# శ్రీ రామకృష్ణ పూజ

కర్త

'సాధన రహస్య' 'సర్వ సిద్ధాంత సౌరభా'ది

బహు గ్రంథకర్తలు,

శ్రీ రామకృష్ణాశ్రమములు

(బాపట్ల & భీమునిపట్నం)

సంస్థాపకులు,

పరమహంస పరివ్రాజకాచార్య

**శ్రీశ్రీశ్రీ అనుభవానంద స్వాములవారు**




**శ్రీ అనుభవానంద గ్రంథమాల**

బాపట్ల-522 101 (గుంటూరుజిల్లా)

భీమునిపట్నం-531 163 (విశాఖజిల్లా)

Sri Anubhavananda Grandhamala
Publication No. 17


ముఖచిత్రం, చిత్రకారులు :
శ్రీ అనుభవానంద స్వాములవారు.

తృతీయ ముద్రణము :
Re-Revised Edition
1988

మూల్యము
రు. 8-00

ప్రతులకు :

1. స్వామి అనుభవానంద యోగకేంద్రము
బాపట్ల - 522 101.

2. శ్రీ అనుభవానంద గ్రంథమాల
భీమునిపట్నము - 531 163.



# తొలిపలుకు

శ్రీ అనుభవానంద స్వాములవారు, సకల సమన్వయమూర్తియు, సర్వ సాధనావతారమును అగు శ్రీ రామకృష్ణదేవుని అనుయాయులు. వీరు పరివ్రాజకులై, పాదచారులై దేశముల దిరుగు సమయమున 1938లో విశాఖ జిల్లా భీమునిపట్టణమున నొక శ్రీ రామకృష్ణాశ్రమమును స్థాపించిరి. ఆంధ్రదేశమున నిదియే ప్రప్రథమ శ్రీరామకృష్ణాశ్రమము. ఆపై 1937లో గుంటూరుజిల్లా బాపట్లలో నొక శ్రీరామకృష్ణాశ్రమమును నిర్మించిరి. శ్రీ శారదా, రామకృష్ణుల విగ్రహములను శ్రీ స్వాములవారు స్వయముగ దయాళొనర్చి, ఆశ్రమద్వయమున ప్రతిష్ఠించిరి. ఆ ప్రతిష్ఠామూర్తులకు పూజల సలుపవలయునుగదా! ఆ పూజావిధాన మనూరాక చున దక్షిణదేశపద్ధతిని జరుప సంకల్పముతో శ్రీ స్వాములవారు శ్రీ రామకృష్ణ అష్టోత్తరశత, సహస్రముల వ్రాసియుండిరి. ఆ నామావళియందు సర్వదేవతా వివరణము, మరియు, శ్రీరామకృష్ణదేవుని సర్వతోముఖత్వము సువ్యక్తము. మరియు నా నామముల శ్రీరామకృష్ణదేవుని జీవిత, సాధనా విధానములు వ్రాయబడుటచే బూజ చేయువారికి ఆ మహనీయుని జీవితమంతయు గన్నులకు గట్టినట్లుండును. ఇది శ్రీ స్వాములవారి ప్రతిభకు దార్కాణము.

శ్రీ స్వాములవారికి అవతారవరిష్ఠుడగు శ్రీరామకృష్ణునియందు అనన్య భక్తి కలదు. ఆ నిర్మల భక్తి, వారి జప, తప, మౌన, సాధనాదికముచే గరిగి, ప్రవహించి, వారి హృదయమునుండి యీ అష్టోత్తరశత నామావళిగ రూపొందినదేమో! ఈ అష్టోత్తరశతమునకొక ప్రత్యేకత గలదు. 'ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ' అను ద్వాదశాక్షరీ మంత్రమున గల ద్వాదశాక్షరముల గ్రహించి, ఒక్కొక్క అక్షరమునకు తొమ్మిది నామములుగ $12 \times 9 = 108$, మొత్తమునకు 108 నామములుగ నీ అష్టోత్తరశతమును శ్రీ స్వామివారు రచించుటలో

నొక విశిష్టతను వ్యక్తము జేయుచున్నది. ఈ అష్టోత్తర శతమున శ్రీరామకృష్ణదేవుని నామావళి పదగుంఫనముతో, శ్రీరామకృష్ణుని విశ్వతోముఖ సాధన, సిద్ధత్వములు మృదుమధురముగ వ్రాయబడినవి. ఈ నామముల జదివి అనేకులు ఆనందించుచున్నారని వ్రాయుటకెంతయు సంతసించుచున్నాము.

ఈ పూజా విధానమును గాంచినవారు దీనిని ముద్రింపగోరిరి. అంత 1956లో నీ పూజావిధానము ప్రచురింపబడి, పూజాగృహములం పఠింపబడి అనేకులకానందమును ప్రసాదించినది. అంత, కొన్ని అనివార్య కారణములచే నీ చిన్ని పుస్తకముద్రణము నిలిచినది. ఈ సమయమున శ్రీ శారదా దేవ్యష్టోత్తరశతము, శ్రీ వివేకానందస్వామి అష్టోత్తరశతము, శ్రీ అనుభవానందస్వామి అష్టోత్తరశతములను వ్రాసి యుంటిని.

అంతియకాక శ్రీ స్వాములవారు రచియించిన శ్రీరామకృష్ణ అష్టోత్తరశత నామములకు వ్యాఖ్యానము వ్రాయ సంకల్పము కలిగినది. ఆ యా నామములకు నా శక్తి మేరకు క్లుప్తముగ వివరణము గావించితిని. నాకు యీ శక్తిని ప్రసాదించినది నా ఆరాధ్య దైవము లగు శ్రీ శారదా రామకృష్ణులు; మద్గురువర్యులగు శ్రీ అనుభవానందస్వామి దివ్యాశీర్వాద ప్రభావమని నా విశ్వాసము. నాకు యీ అవకాశము నొసంగిన ఆ త్రిమూర్తులకు నా హృత్పూర్వక వందన సహస్రములు. శ్రీ స్వాములవారే యీ అష్టోత్తరశతమునకు వివరణము గావించిన ఎట్లుండెడిదో!

శ్రీ కాళికాదేవి అర్చనముతోడనే శ్రీరామకృష్ణుని దివ్య జీవితము ప్రారంభమైనది. భగవంతుడు సగుణ, సాకారముతో నుండెనని భావించి, పూజాదికము సలుపుటలోనే మానవునకు దైవవిశ్వాసమేర్పడుటకు అవకాశము కలదేమో! పూజ చేయువాడు పూజింపబడు స్థితి కరుదెంచుటయే అర్చనావిధానమందలి ప్రత్యేకత. అదియే ఉన్నత పరి

ణామము. ధర్మమూర్తియగు శ్రీ రఘురాముని నుపాసించి శ్రీరామునిగ; జ్ఞానస్వరూపుడగు శ్రీకృష్ణ పరమాత్మ నుపాసించి శ్రీకృష్ణునిగ; నిత్య సమాధి సంస్థితుడైన ఈశ్వరు నుపాసించి శంకరునిగ; జగజ్జననియగు శ్రీకాళికాదేవి నుపాసించి శక్తిస్వరూపిణిగ పరిణమించి, ఆ యా మూర్తులుగ నా యా ఉపాసకులకు దర్శనమిడి, ఆరాధింపబడిన దివ్య సమన్వయమూర్తి శ్రీరామకృష్ణుడు. అట్లు దేశదేశాంతరముల సర్వ మతస్థులచే, సకల దేవతోపాసకులచే పూజింపబడుట ఏ దేశమున గాంచముకదా!

శ్రీరామకృష్ణుని సాధనా విశిష్టతను గ్రహింపదలచినవారు సాధకులు కావాలి. ఆ పరమహంస చంద్రుని అర్చనా విధానమునందలి ప్రత్యేకతను గ్రహింపదలచినవారు భగవదావేదనాసంచరితులు కావాలి. ఆ మహనీయుని సకలమత, సమస్త దేవతా సమన్వయమును గ్రహింప దలచినవారు విశాల హృదయులు కావాలి. అప్పుడే శ్రీరామకృష్ణ దేవుని అనుభవరహస్యం స్పష్టం అవుతుంది. పై విధమున శ్రీరామకృష్ణదేవుని విశాల విశ్వతోముఖతత్త్వమును గ్రహించి, 'మా, మీ' అను సంకుచిత భావముల వీడి, సమరసతత్త్వము నవలంబించి, మన భారతీయాధ్యాత్మికానుభవముల సాధించి, ఆనందించి తరింతుముగాక!

ఈ శ్రీరామకృష్ణపూజ మరల తృతీయ ముద్రణమును పొందినందుకు ఎంతయో ఆనందించుచున్నాను. ఇందులో మంత్రపుష్పార్థము కూడ వ్రాయబడినది. నేటి ప్రజానీకమునకు మనశ్శాంతిని కలిగించేది ఆయన జీవితచరిత్ర ప్రబోధములు ప్రచారములు కాక ఆచరణ ముఖ్యమను ఆ దివ్య సందేశమే నేడు సర్వులకు కావలసినది. ఆహ్వానించండి! పఠించండి ఆచరించండి! ఆనందించండి! ఆనందింప జేయండి! ఇది మన కర్తవ్యం.

శ్రీరామకృష్ణజయంతి,
బాపట్ల.
19-2-88

మా బాపూజీ
భార్గవేశానంద

# అంకితం

బాల్యమునుండి సర్వవిషయముల,
సర్వదేశముల, సర్వకాలముల,
సర్వవిధముల నన్ను రక్షించి,
సర్వసాధనల నాకు ముందుండి,
సర్వానుభవముల నాకు ప్రసాదించి,
సర్వదా నాకు తోడునీడయైన,
సర్వసమన్వయమూర్తి

నా

పరమహంస గురుదేవునికి



శ్రీ రామకృష్ణ పరమహంస దేవుడు

శ్రీ రామ శ్రీకృష్ణ రూప భగవంతుడు ఈ శరీరమున



రామకృష్ణుడై యున్నాడు. ఇది సచ్చిదానంద స్వరూపము. శ్రీ జగన్మాతయే ఇట నుండి భక్తులతో నాడుకొనుచున్నది. మనసా ఈశ్వ రుని గోరువాడిటకు తప్పక అరుదెంచును. ఇచ్చట సర్వము గాంచును.

చిత్తమును నాపై మగ్నమొనర్చుచో సర్వమును పొందును.

సకల దేవతా గణములు నా యంశములు. సర్వ జీవకోటికి నేను తల్లిని. భగవంతుని మాతృప్రేమతత్త్వమును వ్యక్త పరచు టకే శ్రీ రామకృష్ణ భగవానుడు ప్రపంచ మున నన్ను ఉంచెను. నేను జీవించి యున్నంత కాలము నన్ను ఎవరును గ్రహింపజాలరు. నే నింటింట బూజింప బడుదును. నా కృపాపాత్రుడు కానివాడు అదృష్ట విహీనుడు.



శ్లో॥ ఓం స్థాపకాయ చ ధర్మస్య సర్వధర్మ స్వరూపిణే,
అవతారవరిష్ఠాయ రామకృష్ణాయ తే నమః॥

శ్రీ రామకృష్ణునితో సములెవరు?



అట్టి ప్రేమ, పవిత్రత, దయ కాన జాలము. ఇది నా గాఢ విశ్వాసము, తుది తీర్మానము. నా గురుదేవుని ప్రత్యక్ష మూర్తియే మాతృ శ్రీ శారదామాయి.

# ★ నివేదన ★







నీపాదకమల సేవయు
నీపాదార్చకులతోడి నెయ్యము, నితాం
తాపార భూతదయయున్
తాపసమందార నాకు దయసేయగదే॥

సంతత వికారభూయిష్టమైన యైహిక సుఖసంపదయే యథార్థమని భ్రమించుచు, సహస్రాధిక జన్మలాదిగ దానదగుల్కొని యనుభవించుచు, గాలక్రమమున నందుగల యల్పత్వమును, హేయత్వమును క్షణికత్వమును గ్రహించి, తరణోపాయమునకై యన్వేషించుచు, మరల నా యింద్రియ సుఖములు బ్రసరింప వెనుదిరుగు చిత్తమును, శాశ్వతమును అఖండమును అనంతమును ఇంద్రియాతీతమునైన అవ్యయానందవిభూతి నాకాంక్షించు సాధకవర్యులకేమి; ప్రపంచవాసనలనిరికి, యందభిరుచి పూర్తిగా బాయక, మనసును మరల్ప నశక్తుడై, యందనురక్తుడై యుండియు, విషయాతీత పరమేశ్వర దర్శనానందమునకై యొకించుకనైన యత్నించుచుండు సామాన్య సాధకునికేమి, సాధనమున బ్రథమ సోపానమనజెల్లు భగవదర్చనావిధానము అత్యవసరమగుచున్నది. పై జెప్పబడిన

పద్యరాజము భగవత్పాద పూజయందుగల మహిమను, సత్ఫలితము లను వివరించుచున్నది. అర్చనామహిమచే సాధకుని హృదయమున నొక శక్తి యుద్భవించి, యతని హృదయమాలిన్యమును సమయింప జేసి పరిపూర్ణ నిర్మలత్వమును బ్రసాదించి, 'జ్ఞాన సంతతిం సమా నశ్చ భవతి' (మాండూక్యం) అను శ్రుతివచనముచందము భక్త సంఘ మున సమాన గౌరవమును గడించి యొనంగును. దాన సువిశాల హృదయముద్భవించి, పరిణమించి, 'ఇదమేవాస్య తత్సాధారణమన్నం యదిదమద్యతే భుజింపబడుచున్న యీ యన్నము సర్వజీవులదే సుమా యను బృహదారణ్యక తాత్పర్యమును గ్రహించి, 'సర్వభోజ్యత్వా దేవయో ముఖే ప్రక్షిప్యమాణోసి గ్రాసః పరస్య పీడాకారో దృశ్యతే మమేదం స్యాదితి హి సర్వేషాం తత్రాశా ప్రతిబద్ధా' అది సర్వ ప్రాణుల యాహారమగుటచే. తన నోటియందుంచుకొనిన కబళమును, యితరులు తమదేయని యాశించుచుండుటచే నితరులకు బాధాకరమగును గదా యను శ్రీ శంకరభగవత్పాదుల భాష్యవచనము నవగాహన మొనరించుకొని, 'నాత్మార్థం పాచయేదన్నం' తనకొరకుమాత్రమే వంట చేసికొనరాదను మహాభారతవాక్యము నౌదల ధరించి, యనష్ఠించి, అపార భూతదయాప్రేరిత హృదయుడై రాజిల్లును. అంతటనే ఆ సాధకుడు భగవదనుగ్రహప్రాప్తికధికారి యగునని పై పద్య రాజ తాత్పర్యము.

అంతియగాక, ఈశ్వరానుగ్రహప్రాప్తచిత్తుడై, ఇష్టదేవతా మూర్తి సమ్ముఖమున నాసీనుడై, సంతతైకాగ్రమనమున నా యిష్ట మూర్తి స్వరూపమును మనసా స్మరించి, ధరించి, ధ్యానించి, 'స యథా కామో భవతి తత్క్రతుర్భవతి, యత్క్రతుర్భవతి తత్కర్మ కురుతే.

యత్కర్మ కురుతే తదభిసంపద్యతే' అతడు దేని గాంక్షించునో దాని సంకల్పించి కృషించి పొందునను శ్రుతి సూక్తి చందము న్యాస విధానము నవలంబించి, సర్వాంగన్యాసశక్తిచే స్వరూపతః సాధకుడే తన యిష్టమూర్తి యగును. అంత జప ధ్యానాఖ్యానము గావించుచు, అష్టోత్తరశత, సహస్రనామావళిగల పరమేశ్వర అనంత కళ్యాణ గుణగణముల మనమున లగ్న మొనరించి, న్యాసమాహాత్మ్యమున నా ధ్యేయమూర్తితో సర్వవిధ తాదాత్మ్యమునొంది, 'శివోహం' 'అహం బ్రహ్మాస్మి' 'బ్రహ్మైవాహం' అను విధమున అఖండైక బ్రహ్మైక్య మును సాధకుడు పొంది విముక్తుడగుచున్నాడు. అనగా కరచరణా ద్యవయవ విశిష్టుడైన బాహ్య దైవమును ప్రథమతః నెలకొల్పి, అజ్ఞుడై పూజాదుల సల్పినను, తదర్థ భావనాయుక్తమగు సక్రమ సాధనా విధానమును పాటించి అనుసరించుచో, 'ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా' అను శ్రుత్యుక్తిరీతి సాధకుని హృదయ పీఠము నలంకరించి, నెలకొల్పబడిన కల్పిత బాహ్యరూపము కాల క్రమ న్యాయమున నంతర్హితమై, సాధక సాధన సాధ్యము నా త్రివిధ విభేదము విచ్ఛిన్నమై, తాదాత్మ్యమున నేకాకారమై, సంపూర్ణాద్వైత సిద్ధికి బూజావిధానము గొంపోవునని శాస్త్రవచనము బోధించుచున్నది.

ఈ విధానముచే ఆశ్రయించి, సక్రమరీతి అనుష్ఠించి, సిద్ధిగాంచిన అద్భుతమూర్తి, సాధనావతారమని కీర్తిగాంచిన మన రామకృష్ణ పరమహంసదేవుడు, ఈ పద్ధతి నాబాల్యముపాసించి, సర్వభక్తి మార్గముల నవలంబించి, శ్రమించి. జగజ్జనని కాళికాపాదపద్మ సేవా భాగ్యమున ఆదర్శ పూజారియై, సర్వాధ్యాత్మిక సాధనానుభవానంద తేజోమూర్తియై, వెలుగొంది, సర్వాదర్శమున నాధ్యాత్మిక శక్తియై,

వివిధ సాధకలోకమునకారాధ్య దేవతామూర్తియై, అఖిల ప్రపంచమును నావరించి, ముముక్షుకోటికి దారణోపాయము పదేశించుటనే నతడే మనకు ఉత్తమాదర్శము. నిరక్షరుడైన యీ విచిత్ర వ్యక్తి, సర్వ ప్రపంచముచే నర్చింపబడుటయందలి రహస్యమేమి? విశిష్ట పూజా విధానమేగదా!

అట్టి అద్వితీయాద్భుతమూర్తి నుపాసింపక నన్యభావనములేల! పశుత్వమునుండి మానవత్వము నుపదేశించు మార్గేతరములగాక, మానవత్వము వీడి, దేవత్వము అనగా బ్రహ్మత్వమునే ప్రసాదించు భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంసదేవుని అద్భుత సాధనావిధానము అవశ్యము అవలంబనీయముగదా! అంతియగాక, మార్గము నుపదేశించు మార్గదర్శకుడుమాత్రమేగాక, భగవన్మహిమా శక్తులమూర్తిగా మూర్తీభవింప జేసికొని, సాధకుల మనోరథసిద్ధి బ్రసాదింప సంసిద్ధుడై యున్న ఆ యాదర్శమూర్తినే వేదికనుంచి, పూజించుటయు శ్రేష్ఠముగదా! కాన సాధకవరులు పై విషయముల మనసా గ్రహించి, హృదయమున ధరించి, జగద్గురుండును, జగత్పితయునగు నా దివ్యమూర్తి నుపాసించి, భగవద్దర్శనాదిక ఆనందసందోహములనేగాక, బ్రహ్మవిదులై, 'బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి' అనునట్లు బ్రహ్మస్వరూపులై ప్రకాశించెదరుగాక అని ఆశించుచున్నాను.

పూజాకాలమున ప్రాపంచిక విషయముల హృదయమున ప్రవేశింపనీయక, ప్రశాంతమనంబున, దొందరపాటులేక, నిశ్చలముగా నిష్ట దేవతామూర్తి యొక్క స్వరూపముపై జిత్తమును సంలగ్నమొనరించి, ఆ యా పూజాంగముల సంపూర్ణార్థమును గ్రహించి, మనసా స్మరించుచు

పూజింపవలెను. పూజావిషయమున, అతి ముఖ్యమైన ధ్యానసమయ మున, అర్చామూర్తి వివిధావయవములతో స్వీయావయవముల తాదాత్మ్యతను విశ్వసించుచు మననము గావించుట ముఖ్యము. అట్లాచరించి ననే భాగవత భగవత్సమైక్యత అచిరకాలమున నేర్పడి అద్వైతసిద్ధి సులభతరమై యొప్పారును. అట్లే నామావళి యిష్టదైవముయొక్క వివిధ సుగుణ సందోహముల జిత్రించునుగాన, నామార్చన కాలమున గూడ 'తజ్జపః తదర్థభావనం' అను యోగసూత్రరీతి నా యా నామ తాత్పర్యమును గ్రహించి, ధ్యానమున నుంచి, ఏకాగ్రచిత్తమున నర్చన గావించుచో గాలక్రమమున నా గుణగణము సాధకునందావిర్భవించి, తాదాత్మ్యస్థిది గలుగజేయును. కాన పూజాఫలితము నచిరకాలమున బొందగోరు సాధకులు, అర్చనను కేవలము సాధన దృష్టితోడనే ఆచరింపవలయునని శ్రీరామకృష్ణదేవుని ఆదర్శ తాత్పర్యము.

విశ్రాంతిగలవారు నిత్యసహస్రనామ పూజ గావించుట సర్వోత్తమము. దానిచే సద్యోఫలితములు బహుళముగ సిద్ధించును, అట్లు నిత్యము ఆచరింపజాలని సాధకులు, అష్టోత్తరశతనామ పూజ దశోపచారములతో జేర్చి నిత్యము జేయుచు, వారమునకొక పర్యాయమైనను సహస్రనామమును విధిగా ఆచరింపవలయును.

అట్లు ముముక్షులోకము యీ పూజావిధానమును నక్రమలీల గ్రహించి, అనుష్ఠించి, ఆనందించెదరుగాక! ప్రథమమున నర్చకుడై, క్రమమున నర్చామూర్తిగ బరిణమించి, లోకారాధ్యుడైన భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంసదేవుని యాదర్శముగను, ఆరాధ్యుని గను హృదయపీఠముపై నధిష్ఠింపజేసికొనెదరుగాక! జగద్గురుదేవుని

యడుగుజాడల ననుసరించి, ద్వైతముతో ప్రారంభించి, అందే నిలచి తృప్తిగాంచక, భగవానునివలెనే అద్వైతస్థితికొరకై పయ నించి, సిద్ధి గాంచెదరుగాక! పై విధానమున నా యీ చిన్న రచ నము ముముక్షుకోటికుపయుక్తమై, సార్ధకత నొందునని ఆశించు చున్నాను.

శ్రీ రామకృష్ణ జయంతి,

14—31—1956

ఓం
# శ్రీ రామకృష్ణాయ నమః

స్నానము చేసి, శుభ్రవస్త్రమును ధరించి, అర్చామూర్తిని, స్థలమును శుభ్రపరచి, ఆ అర్చామూర్తికి ఎడమ ప్రక్కన వసతి ననుసరించి ఉత్తరముఖముగాగాని, తూర్పుముఖముగాగాని, ఏర్పరచిన ఆసనముపై కూర్చుండవలెను. పళ్ళెము, పంచపాత్ర, ఉద్ధరిణ, ఉదకము, పుష్పాక్షతాది పూజాద్రవ్యముల ముందుంచుకొనవలెను. ధ్యానాసనాదులలో అనుకూలమైనదానిలో కూర్చుండి, యిష్టదైవముపై అరమోడ్పు నేత్రములతోగాని, పూర్తిగా నేత్రముల మూసిగాని దృష్టి నిలిపి ధ్యానింపవలెను.

## ధ్యానము:-

ఓం స్థాపకాయ చ ధర్మస్య సర్వధర్మస్వరూపిణే।
అవతారవరిష్ఠాయ రామకృష్ణాయ తే నమః॥
విశ్వస్య ధాతా పురుషస్త్వమాద్యో
వ్యక్తేన రూపేణ తతం త్వయేదం
హే రామకృష్ణ త్వయి భక్తిహీనే
కృపాకటాక్షం కురు దేవ నిత్యం॥

## గురుస్తోత్రము:-

గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః॥
గురురేవ పరంబ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః॥
న గురోరధికం తత్త్వం న గురోరధికం తపః।
తత్త్వజ్ఞానాత్ పరం నాస్తి తస్మై శ్రీ గురవే నమః॥

సర్వధర్మస్థాపస్త్వం సర్వధర్మస్వరూపకః।
అచార్యాణాం మహాచార్యో రామకృష్ణాయ తే నమః।

## భూతాపసరణమః:-

అపసర్పంతు యే భూతా యే భూతా భూమిభారకాః।
యే భూతా విఘ్న కర్తారః తే నశ్యంతు శివాజ్ఞయా॥

★ అను మంత్రమును పఠించుచు నుదకమును దశదిక్కులకు చల్లవలెను.

## ఆసనశుద్ధిః-

పృథ్వీ త్వయా ధృతా లోకా దేవీ త్వం విష్ణునా ధృతా।
త్వం చ ధారయ మాం నిత్యం పవిత్రం కురు చాసనం॥

★ అని చదువుచు ఆసనముపై నీరమును ప్రోక్షింపవలెను.

## పుష్పాదిక శుద్ధిః-

పుష్పేపుష్పే మహాపుష్పే సుపుష్పే పుష్ప సంభవే।
పుష్పచయావకీర్ణే హూం ఫట్ స్వాహా॥

★ అనుచు పుష్పాదికముపై జలమును చల్లవలెను.

## సర్వశుద్ధి:-

అపవిత్రః పవిత్రో వా సర్వావస్థాం గతోపి వా।
యః స్మరేత్పుండరీకాక్షం స బాహ్యాభ్యంతరశ్శుచిః॥

★ అని పఠించుచు మూడుసార్లు ఆచమనము చేయవలెను.

## ప్రాణాయామము:-

కుంభకములేని ప్రాణాయామమును మూడు పర్యాయములు ఆచరింపవలెను.

## జపము:-

జపమాలను కుడి హస్తమున ధరించి, మాల బయటికి గోచరింపకుండునట్లు వస్త్రమును కప్పి, యిష్టమంత్రమునుగాని, యిష్టనామమునుగాని, ఏకాగ్రచిత్తముతో జపించవలెను. శ్రీరామకృష్ణదేవుడు సర్వదేవదేవీస్వరూపమగుటచే నే మంత్రమైనను సముచితమై యొప్పారును.

## పీఠన్యాసము :-

వక్షమును స్పృశించుకొనుచు 'ఓం హ్రీం పీఠదేవతాభ్యో నమః ఓం హ్రీం పీఠశక్తిభ్యో నమః, ఓం నమో భగవతే రామకృష్ణాయ సర్వదేవదేవీస్వరూపాత్మనే పరమహంసాయ సర్వాత్మసంయోగ హంస పీఠాత్మనే నమః' అని ఉచ్చరింపవలెను.

## ఋష్యాదిన్యాసము:-

'ఓం ఐం సర్వదేవదేవీస్వరూపాయ శ్రీ రామకృష్ణాయ నమః' ఇత్యస్య మంత్రస్య బ్రహ్మఋషిర్గాయత్రీచ్ఛందః, సర్వదేవదేవీస్వరూపః శ్రీరామకృష్ణదేవతా ఋష్యాదిన్యాస వినియోగః

(శిరసే) బ్రహ్మణే ఋషయే నమః

(ముఖే) గాయత్రీ చ్ఛందసే నమః

(హృది) సర్వదేవదేవీస్వరూపాయ శ్రీరామకృష్ణాయ నమః

## కరన్యాసము:-

ఓం ఐం అంగుష్ఠాభ్యాం నమః
ఓం రాం తర్జనీభ్యాం స్వాహా
ఓం మం మధ్యమాభ్యాం వషట్
ఓం కృం అనామికాభ్యాం హూం
ఓం ష్ణం కనిష్ఠాభ్యాం వౌషట్
ఓం ఐం రామకృష్ణ కరతలపృష్ఠాభ్యాం అస్త్రాయ ఫట్

## అంగన్యాసము:-

ఓం ఐం హృదయాయ నమః
ఓం రాం శిరసే స్వాహా
ఓం మం శిఖాయై వషట్
ఓం కృం కవచాయ హుం
ఓం ష్ణం నేత్రాభ్యాం వౌషట్
ఓం ఐం రామకృష్ణ కరతలపృష్ఠాభ్యాం అస్త్రాయ ఫట్

## వ్యాపకన్యాసము:-

'ఓం ఐం సర్వదేవదేవీస్వరూపశ్రీరామకృష్ణాయ నమః' అను మంత్రము జపించుచు శిరమునుండి పదములవరకు, పదములనుండి శిరముపర్యంతము, నాభినుండి హృదయపర్యంతము ఉభయ కరములతో మార్జనము చేయవలెను.

## సంకల్పము:-

మమ ఉపాత్త దురితక్షయద్వారా శ్రీపరమేశ్వరముద్దిశ్య, శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం శ్రీరామకృష్ణదేవాజ్ఞయా ప్రవర్తమానస్య, అద్య బ్రహ్మణః ద్వితీయ పరార్ధే, శ్వేత వరాహకల్పే, వైవస్వత మన్వంతరే, కలియుగే, ప్రథమపాదే, జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే, మేరోః దక్షిణదిగ్భాగే, శ్రీశైలస్య .... .... ప్రదేశే, .... .... మధ్యదేశే, సమస్త దేవతా సర్వదేవదేవీస్వరూప శ్రీరామ కృష్ణ పాదపద్మసన్నిధౌ, అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్ర మానేన,.... .. నామ సంవత్సరే, .... .... ఆయనే, ... ...ఋతౌ, ... ... మాసే, .... .... పక్షే, ... ...తిథౌ, ... .... వాసరే, శుభ నక్షత్రే, శుభయోగే, శుభకరణే, ఏవం గుణవిశేషణవిశిష్టాయాం శుభతిథౌ, మమ గురూపదేశానుష్ఠానశ్రద్ధావ్యారక తదనుష్ఠానజనిత, చిత్తశుద్ధిసంపాదిత, సాధనచతుష్టయసమాసాదితాత్మవిచారణసంజాత, ప్రత్యక్‌బ్రహ్మైకాత్మ్యానుసంధాననిష్ఠానిరస్తాశేషానర్థ వ్రాతతా సముద్భోధితా ఖండానంద సాక్షాత్కారరూప బ్రహ్మప్రాప్త్యర్థం, సర్వదేవదేవీస్వరూప శ్రీరామకృష్ణదేవ పూజాం కరిష్యే.

## ఆవాహనము:-

'శ్రీశారదావివేకానందాది పరదేవతామునిగణసేవిత శ్రీరామ కృష్ణ పరబ్రహ్మణే నమః ఆవాహనం సమర్పయామి. ఓం శ్రీరామకృష్ణ ఇహాగచ్ఛ! ఇహాగచ్ఛ! ఇహ సన్నిదేహి! ఇహ సన్ని దేహి! ఇహ సమ్ముఖీ భవ! ఇహ సమ్ముఖీ భవ! మమ పూజా గృహాణ!' అని పఠించుచు, సవినయముగ, తన హృదయాన నధిష్ఠితుడై యున్న శ్రీరామకృష్ణదేవుని ఆహ్వానించుచు నమస్కరింప వలెను.

# షోడశోపచారములు



## 1. ఆ స న ము:-

శ్లో॥ సర్వభూతాంతరస్థాయ సర్వభూతాంతరాత్మనే।
కల్పయామ్యుపదేశార్థమాసనం తే నమో నమః॥

'శ్రీరామకృష్ణదేవాయ ఆసనం సమర్పయామి'

అని నమస్కరించుచు, ఒక పుష్పమును దేవ పాదసన్నిధినర్పింపవలెను.

## 2. స్వా గ త ము:-

శ్లో॥ యస్య దర్శనమిచ్ఛంతి దేవా బ్రహ్మ హరాదయః॥
కృపయా దేవదేవేశ మదగ్రే సన్నిధీ భవ॥

అని ప్రణామపూర్వక స్వాగతమొసంగవలెను.

## 3. పా ద్య ము:-

శ్లో॥ యద్భక్తిలేశసంపర్కాత్ పరమానందసంభవః।
తస్మై తే చరణాబ్జాయ పాద్యం శుద్ధాయ కల్పయే॥

'శ్రీరామకృష్ణదేవాయ పాద్యం సమర్పయామి'

అని పుష్పముతో నీరమును దేవుని పాదములపై చల్లవలెను.

## 4. అ ర్ఘ్య ము:-

శ్లో॥ తాపత్రయహరం దివ్యం పరమానందలక్షణం।
తాపత్రయవిమోక్షాయ తవార్ఘ్యం కల్పయామ్యహం॥

'శ్రీరామకృష్ణదేవాయ అర్ఘ్యం సమర్పయామి'

5. ఆ చ మ నీ య ము:—

శ్లో॥ దేవానామపి దేవాయ దేవానాం దేవతాత్మనే।
ఆచామం కల్పయామీశ శుద్ధాయ శుద్ధహేతవే॥
'శ్రీరామకృష్ణదేవాయ ఆచమనీయం సమర్పయామి'
అని ఉద్ధరిణతో పళ్ళెములో నీరును ముమ్మారుంచవలెను.

6. మ ధు ప ర్కా ము:—

శ్లో॥ సర్వకల్మషహీనాయ పరిపూర్ణసుధాత్మకం।
మధుపర్కమిదం దేవ కల్పయామి ప్రసీద మే॥
'శ్రీరామకృష్ణదేవాయ మధుపర్కం సమర్పయామి'

7. స్నా న ము:—

శ్లో॥ పరమానందబోధాబ్ధినిమగ్ననిజమూర్తయే।
సాంగోపాంగమిదం స్నానం కల్పయామ్యహమీశ తే॥
'శ్రీరామకృష్ణదేవాయ శుద్ధోదకస్నానం సమర్పయామి'

8. వ స్త్ర ము:—

శ్లో॥ మాయాచిత్రపటాచ్ఛన్న నిజ గుహ్యోరుతేజసే।
నిరావరణవిజ్ఞాన వస్త్రం తే కల్పయామ్యహం॥
'శ్రీరామకృష్ణదేవాయ వస్త్రయుగ్మం సమర్పయామి'

9. ఆ భ ర ణ ము:—

శ్లో॥ స్వభావ సుందరాంగాయ నానాశక్త్యాశ్రయాయ తే।
భూషణాని విచిత్రాణి కల్పయామ్యమరార్చిత॥
'శ్రీరామకృష్ణదేవాయ అనేక దివ్యాభరణాని సమర్పయామి'

10. పుష్పము:-

శ్లో॥ తురీయవనసంపన్నం నానాగుణమనోహరం।
ఆనందసౌరభం పుష్పం గృహ్యతామిదముత్తమం॥
'శ్రీరామకృష్ణదేవాయ నానావిధపుష్పాణి సమర్పయామి'

పిమ్మట సహస్రనామ పూజగాని అష్టోత్తరశతనామ పూజగాని చేయవలెను.

11. ధూపము:-

శ్లో॥ వనస్పతిరసో దివ్యగంధాఢ్యః సుమనోహరం।
ఆఘ్రేయః సర్వదేవానాం ధూపోఽయం పరిగృహ్యతాం॥
'శ్రీరామకృష్ణదేవాయ ధూపమాఘ్రాపయామి'

12 దీపము:-

శ్లో। సుప్రకాశో మహాదీపః సర్వత స్తిమిరాపహః।
సబాహ్యాభ్యంతరజ్యోతిర్దీపోఽయం పరిగృహ్యతాం॥
'శ్రీరామకృష్ణదేవాయ దీపం దర్శయామి'

13. నైవేద్యము:-

దేవతామూర్తికి ఎదురుగ, స్థలమును శుభ్రపరచి, అచ్చటివంటపదార్థముల నుంచి, వానిపై జలమును ప్రోక్షించవలయును:-

శ్లో॥ నైవేద్యం వివిధం దేవ శర్కరాది వినిర్మితం।
మయా నివేదితం భక్త్యా గృహాణ పరమేశ్వర॥

'ఓం భూర్భువస్సువః, తత్సవితుర్వరేణ్యం'
భర్గో దేవస్య ధీమహి, ధియో యోనః ప్రచోదయాత్; 'సత్యం త్వ_ర్తేన పరిషించామి, అమృతమస్తు, అమృతోప స్తరణమసి'.
'ఓం ప్రాణాయ స్వాహా'
'ఓం అపానాయ స్వాహా'
'ఓం వ్యానాయ స్వాహా'
'ఓం ఉదానాయ స్వాహా'
'ఓం సమానాయ స్వాహా'
'శ్రీరామకృష్ణదేవాయ మహానైవేద్యం సమర్పయామి'

14. తాంబూలము:-

శ్లో॥ ఫలపత్రిసమాయుక్తం కర్పూరాది సువాసితం।
త్రియోదశగుణోపేతం తాంబూలం ప్రతిగృహ్యతాం॥
'శ్రీరామకృష్ణదేవాయ తాంబూలం సమర్పయామి'

15. మాల్యము:-

శ్లో॥ సూత్రేణ గ్రధితం మాల్యం నానాపుష్పసమన్వితం।
శ్రీయుక్తం లంబమానం చ గృహాణ పరమేశ్వర॥
'శ్రీరామకృష్ణదేవాయ మాల్యం సమర్పయామి'

16. వందనము:-

శ్లో॥ సర్వసాధనసంయుక్తం సర్వధర్మసమన్వయం।
సకలానుభవసంపన్నం రామకృష్ణం సమాహ్వయం॥

అని, పుష్పముల చేతుల నిడుకొని, నమస్కరించి, ఇష్టమూర్తి పాదముల నర్పింపవలెను.

## కర్పూర నీరాజనము:-

శ్లో॥ ఖుదీరామసుపుత్రాయ చంద్రామణిసుతాయ చ।
శారదారాధ్యదేవాయ రామకృష్ణాయ మంగళం॥

శ్లో॥ కాళికామాతృచరణాబ్జ ఆరాధనతత్పరాయ చ।
మంగళమనుభవరూపాయ రామకృష్ణాయ మంగళం॥

శ్లో॥ సంతత శ్రీరస్తు - సమస్త మంగళాని భవంతు॥
నిత్య శ్రీరస్తు - నిత్య మంగళాని భవంతు॥

## మంత్ర పుష్పము



పుష్పములనో, అక్షతలనో, చేతిలో నుంచుకొని, భక్తితో నమస్కరించుచు నిలువబడి, మంత్రపుష్పమును పఠింపవలెను.

ఓం ధాతా పురస్తాద్యముదా జహార। శక్రః ప్రవిద్వాన్ ప్రదిశశ్చతస్రః। తమేవం విద్వానమృత ఇహ భవతి। నాన్యః పంథా అయనాయ విద్యతే।

ఓం సహస్రశీర్షం దేవం విశ్వాక్షం విశ్వశంభువం। విశ్వం నారాయణం దేవమక్షరం పరమం పదం। విశ్వతః పరమాన్నిత్యం విశ్వం నారాయణం హరిం। విశ్వమేవేదం పురుషస్తద్విశ్వ ముపజీవతి। పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివమచ్యుతం। నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణం। నారాయణ పరో జ్యోతిరాత్మా నారాయణః పరః। నారాయణ పరంబ్రహ్మ తత్త్వం నారాయణః పరః। నారాయణ పరో ధ్యాతా ధ్యానం

నారాయణః పరః। యచ్చ కించిజ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపి వా। అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణస్స్థితః। అనంతమవ్యయం కవిగ్ం సముద్రేఽంతం విశ్వశంభువం। పద్మకోశ ప్రతీకాశగ్ం హృదయం చాప్యధోముఖం। అధో నిష్ట్యా వితస్త్యాంతే నాభ్యా ముపరితిష్ఠతి। జ్వాలమాలాకులం భాతి విశ్వస్యాయతనం మహత్। సంతతగ్ం శిలాభిస్తులం బత్యా కోశసన్నిభం। తస్యాంతే సుషిరగ్ం సూక్ష్మం తస్మిన్ సర్వం ప్రతిష్ఠితం। తస్య మధ్యే మహానగ్ని ర్విశ్వార్చిర్విశ్వతోముఖః। సోఽగ్రభుగ్విభజం స్తిష్ఠన్నాహారమజరః కవిః। తిర్యగూర్ధ్వమధశ్శాయీ రశ్మయ స్తస్య సంతతా। సంతాపయతి స్వందేహ మాపాదతలమస్తకః। తస్య మధ్యే వహ్నిశిఖా అణీయోర్ధ్వా వ్యవ స్థితః। నీలతోయద మధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా। నీవారశూక వత్తన్వీ పీతా భాస్వత్యణూపమా। తస్యాశ్శిఖాయా మధ్యే పర మాత్మా వ్యవస్థితః। స బ్రహ్మ స శివస్స హరిస్సేంద్రస్సోఽక్షరః పరమ స్స్వరాట్।

యోఽపాం పుష్పం వేద। పుష్పవాన్ ప్రజావాన్ పశుమాన్ భవతి। చంద్రమా వా అపాం పుష్పం। పుష్పవాన్ ప్రజావాన్ పశుమాన్ భవతి। య ఏవం వేద। యోఽపామాయతనం వేద। ఆయతనవాన్ భవతి।

అగ్నిర్వా అపామాయతనం। ఆయాతనవాన్ భవతి। యోఽగ్నే రాయతనం వేద। ఆయతనవాన్ భవతి। య ఏవం వేద। యోఽపా మాయతనం వేద। ఆయతనవాన్ భవతి।

వాయుర్వా అపామాయతనం । ఆయతనవాన్ భవతి । యో వాయోరాయతనం వేద । ఆయతనవాన్ భవతి । ఆపో వై వాయో రాయతనం । ఆయతనవాన్ భవతి । య ఏవం వేద । యోఽపా మాయతనం వేద । ఆయతనవాన్ భవతి ।

అసౌ వై తపన్నపామాయతనం । ఆయతనవాన్ భవతి । యోఽముష్యతపత ఆయతనం వేద । ఆయతనవాన్ భవతి । ఆపో వా అముష్యతపత ఆయతనం । ఆయతనవాన్ భవతి । య ఏవం వేద । యోఽపామాయతనం వేద । ఆయతనవాన్ భవతి ।

చంద్రమా వా అపామాయతనం । ఆయతనవాన్ భవతి । యశ్చంద్రమస ఆయతనం వేద । ఆయతనవాన్ భవతి । ఆపో వై చంద్రమస ఆయతనం । ఆయతనవాన్ భవతి । య ఏవం వేద । యోఽపామాయతనం వేద । ఆయతనవాన్ భవతి ।

నక్షత్రాణి వా అపామాయతనం । ఆయతనవాన్ భవతి । యో నక్షత్రాణామాయితనం వేద । ఆయతనవాన్ భవతి । ఆపో వై నక్షత్రాణామాయతనం, ఆయతనవాన్ భవతి । య ఏవం వేద । యోఽపామాయతనం వేద । ఆయతనవాన్ భవతి ।

పర్జన్యో వా అపామాయతనం । ఆయతనవాన్ భవతి । యః పర్జన్యస్యాయతనం వేద । ఆయతనవాన్ భవతి । ఆపో వై పర్జన్య స్యాయతనం । ఆయతనవాన్ భవతి । య ఏవం వేద । యోఽపా మాయతనం వేద । ఆయతనవాన్ భవతి ।

సంవత్సరో వా అపామాయతనం । ఆయతనవాన్ భవతి ।

యస్సంవత్సరస్యాయతనం వేద । ఆయతనవాన్ భవతి । ఆపో వై సంవత్సరస్యాయతనం । ఆయతనవాన్ భవతి । య ఏవం వేద । యో౽ప్సు నావం ప్రతిష్ఠితాం వేద । ప్రత్యేవ తిష్ఠతి । కిం తద్విష్ణో ర్బలమాహుః । కా దీప్తిః కిం పరాయణం । ఏకో యద్ధారయ ద్దేవః । రేజతీ రోదసీ ఉభే । వాతాద్విష్ణోర్బలమాహుః అక్షరాద్దీప్తి రుచ్యతే । త్రిపదాద్ధారయద్దేవః । యద్విష్ణోరేక ఉత్తమం ।

రాజాధిరాజాయ ప్రసహ్య సాహినే । నమో వయం వై శ్రవ ణాయ కుర్మ హే । స మే కామాన్ కామకామాయ మహ్యం । కామేశ్వరో వై శ్రవణో దదాతు । కుబేరాయ వై శ్రవణాయ । మహారాజాయ నమః ।

ఓం తద్ బ్రహ్మ । ఓం తద్ వాయుః । ఓం తదాత్మా । ఓం తత్ సత్యం । ఓం తత్ సర్వం । ఓం తత్ పురోర్నమః ।

అంతశ్చరతి భూతేషు గుహాయాం విశ్వమూర్తి షు । త్వం యజ్ఞస్త్వం వషట్కార స్త్వమింద్ర స్త్వం రుద్రస్త్వం విష్ణుస్త్వం బ్రహ్మత్వం ప్రజాపతిః ।

త్వం తదాప ఆపో జ్యోతీ రసో౽మృతం బ్రహ్మ భూర్భువ స్సువరోం॥ ఈశానస్సర్వవిద్యానామీశ్వరస్సర్వ౽భూతానాం బ్రహ్మాధి పతిర్బ్రహ్మణో౽ధిపతిర్బ్రహ్మ శివో మే అస్తు సదాశివోం ।

ఆత్మప్రదక్షిణ నమస్కారము:—

శ్లో॥ యాని కాని చ పాపాని జన్మాంతర కృతాని చ॥
తాని తాని ప్రణశ్యంతి ప్రదక్షిణ పదేపదే॥
త్రాహి మాం కృపయా దేవ శరణాగతవత్సల॥

శ్లో॥ అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ।
తస్మాత్కారుణ్యభావేన రక్ష రక్ష మహేశ్వర॥

'శ్రీశారదా వివేకానందాది శిష్యసమేత భగవాన్ శ్రీరామకృష్ణ పరమాత్మనే నమః' 'ఆత్మప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి'

అని సాష్టాంగ నమస్కారము చేయవలెను.

ఓం తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహి తన్నో రుద్రః ప్రచోదయాత్.

ఓం కాళికాయై విద్మహే శ్మశానవాసిన్యై ధీమహి తన్నోరుద్రః ప్రచోదయాత్.

ఓం హంస హంసాయ విద్మహే పరమహంసాయ ధీమహి తన్నోహంసః ప్రచోదయాత్.

ఓం రామకృష్ణాయ విద్మహే గదాధరాయ ధీమహి తన్నో దేవః ప్రచోదయాత్.

ఓం హ్రీం శారదాయై విద్మహే విశ్వజనన్యైధీమహి తన్నో మాతా ప్రచోదయాత్.

ఓం వివేకానందాయ విద్మహే నరేంద్రాయ ధీమహి తన్నో స్వామిః ప్రచోదయాత్.

'ఓం భూర్భువస్సువః భగవతే శ్రీరామకృష్ణ పరబ్రహ్మణే నమః సువర్ణ దివ్య మంత్రపుష్పం సమర్పయామి' అని చేతనున్న పుష్పముల భగవానుని పాదపద్మముల నర్పింపవలెను.

## క్షమాపణము:-

శ్లో॥ యస్య స్మృత్యా చ నామోక్త్యా తపః పూజా క్రియాదిషు।
న్యూనం సంపూర్ణతాం యాతి సద్యో వందే మహేశ్వరం॥

శ్లో॥ మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం మహేశ్వర।
యత్పూజితం మయా దేవ పరిపూర్ణం తదస్తు తే॥

అని క్షమాపణము నమస్కారపూర్వకముగా కోరవలెను.

## అర్పణము:-

'అనయా ధ్యానావాహనాది షోడశోపచార పూజా చ అష్టోత్తర శత, సహస్రనామ పూజా చ, భగవాన్ సర్వాత్మకః శ్రీరామకృష్ణదేవ స్సుప్రీతస్సుప్రసన్నో వరదో భవతు'

అనుచు నీటిని పళ్ళెములో విడువవలెను.

## మంత్రపుష్ప తాత్పర్యము:-

ధాతా పురస్తాత్ .... .... .... అయనాయ విద్యతే॥

సృష్టించుకాలమందు చతుర్ముఖబ్రహ్మ ఏ పరమాత్మనుస్తోత్రము చేసెనో; దేవేంద్రుడును ఏ పరమాత్మను స్తుతించెనో; నాల్గు దిక్కులందునుండు సనక - సనందన - వాల్మీకి - పరాశర - పారాశర్య (వ్యాస) శుక - శౌనకాదులైన మహాత్ములు ఏ పరమాత్మను నుతించినారో; ఆ పరమాత్మను నేను తెలిసికొంటిని. ఆ పరమాత్మను వారు

ఉపదేశించిన విధముగా ఉపాసించువాఁడు ఈలోకమందే ముక్తుఁడగు చున్నాడు. పరమప్రాప్యమైన భగవత్ప్రాప్తికి ఇంతకంటెను మఱి యొక దారిలేదు. అని వేదపురుషుఁడు చెప్పుచున్నాడు.

సహస్రశీర్షం .... .... .... పరమం ప్రభుక.

హృదయపుండరీకమందు ఉపాస్యుడుగా పూర్వపు అనువాకపు చివఱ చెప్పఁబడిన భగవంతుని గుణవిశేషములు, ఈ అనువాకమందు విశేషముగా ప్రదర్శింపఁబడుచున్నవి. ఇందు చెప్పఁబడిన విశేష ములుగల దేవునిని ధ్యానింపవలెను, అని అన్వయించుకొనదగును.

అనంతములైన శిరస్సులుగలవాఁడును (సర్వ జగదాత్మకమగు విరాడ్రూపము భగవద్రూపము. మన శిరస్సులన్నియు అతని శిరస్సులే,) అనంతనేత్రములు గలవాఁడును, సమస్త జగత్తునకు సుఖమును గలిగించువాఁడును, జగదాత్మకుఁడును, నారాయణుఁడును, ఇంద్ర, సూర్యాదిరూపములతో నుండుటవలన దేవుడును నశింపనివాఁడును. గొప్ప కారణమగుటవలన పరముఁడును, నియమించుటకు సమర్థుఁడును;

విశ్వతః పరమం .... .... .... ఉపజీవతి.

జడవర్గమైన జగత్తుకంటె గొప్పవాఁడును, వినాశములేకుండుట వలన నిత్యుఁడును, విశ్వరూపుడుఁను, నారాయణుఁడును, పాపమును అజ్ఞానమును హరించువాఁడును, పురుషశబ్దవాచ్యుఁడైన నారాయణుడు. ఈ పరిదృశ్యమానమగు ఈ విశ్వమును (ప్రాకృత ప్రపంచమును) ఆ అప్రాకృత ప్రపంచమును సంరక్షించుచున్నాఁడు.

పతిం విశ్వస్య .... .... .... పరాయణమ్

ప్రపంచమునకు పాలకుఁడును, సర్వజీవులకు నియామకుఁడును, సర్వకాలములందు ఉండువాఁడును, ఆశ్రయించినవారికి మంగళప్రదుఁడును, చ్యుతి లేనివాఁడును, మహాత్ములైన జ్ఞానులచేత తెలిసికొన దగినవాఁడును, ప్రపంచమునకు అంతర్యామియు, జగమునకు ప్రాప్యుడును నారాయణుఁడు.

నారాయణపరంబ్రహ్మ .... .... .... పరః.

పరంబ్రహ్మశబ్దముచేత చెప్పఁబడువాఁడును నారాయణుఁడే. ఉత్కృష్టుఁడును, జగత్కారణుఁడును నారాయణుఁడే, పరమజ్యోతి రూపుఁడును నారాయణుఁడే, పరమాత్మయు నారాయణుఁడే. బ్రహ్మాదులకంటెను ఉత్కృష్టుఁడైన నారాయణుఁడే ధ్యానింపఁదగినవాఁడు, పరుఁడైన నారాయణుఁడే ధ్యానవిషయము.

యచ్చకించిత్ ... ... .... స్థితః.

లోకమందు వినఁబడుచున్నదియు, చూడఁబడుచున్నదియు, నైన ఈ సమస్త జగత్తును లోపల వెలుపలను వ్యాపించి అంతర్యామిగా నారాయణుఁడేఉన్నాడు.

అనంత ... .... .... మహత్.

సర్వాంతర్యామిగా నుండినను ఆ భగవంతునికి ప్రపంచగత దోషమంటుటలేదు, అని యీ విశేషణములవలన తెలియుచున్నది. ఒక దేశము, ఒకకాలము, ఒకవస్తువు అను పరిచ్ఛేదములేక అంతటనుండువాఁడు. ఇందువలననే నాశములేనివాఁడు. సర్వజ్ఞుఁడు క్షీరసముద్ర

మధ్యమందుండువాఁడు, ప్రపంచమునకు సుఖమును గలిగించువాఁడు. మెడకు, (గ్రీవాబంధము) గ్రిందిభాగమున నాభికి పై భాగమందు పండ్రెండు అంగుళములకు పైన క్రిందిముఖముగా పద్మాకారముగా నుండు నదియే హృదయము, అది ప్రపంచ శరీరకుఁడైన భగవంతునికి గొప్ప నివాసముగా తెలిసికొనవలయును.

సంతతగ్ం ... ... ... ప్రతిష్ఠితమ్ః.

ఆ హృదయము ఆకాశసన్నిభమై కొంచెము వికసించిన తామర మొగ్గతో సమానమై నాడులతో వ్యాపింపఁబడిన దగుచున్నది. ఆ హృదయపద్మ మధ్యమందు సూక్ష్మమైన రంధ్రముకలదు. ఆ రంధ్ర మందు సర్వాత్మకుఁడైన నారాయణుఁడు ప్రతిష్ఠితుడైయున్నాఁడు.

తస్యమధ్యే .... .... .... కవిః.

ఆ హృదయపద్మ మధ్యమందు అంతట జ్వాలలు గలదియు, సర్వతోముఖమైనదియు నైన గొప్పఅగ్ని (జాఠరాగ్ని) అన్నిటిని భక్షించుశక్తి కలదై యున్నది. ఆ జాఠరాగ్ని ఎల్లప్పుడు జాగరూకమై శబ్దించుచున్నదై, తినఁబడిన అన్నాదికమును మూడువిధములుగా విభజించుచు (సర్వావయవములకు ప్రసరింపఁజేయుచు) ప్రథమముగా తాను భుజించుచున్నది.

సంతాపయతి .... .... .... వ్యవస్థితః.

ఆ జాఠరాగ్ని పాదముల మొదలు శిరస్సువఱకు తనదేహమును తపింపఁజేయుచున్నది. అనఁగా దేహగతమైనవేడి అంతయు దాని యధీనమే యనిభావము. అ జాఠరాగ్ని మధ్యమందు అగ్నిజ్వాలవలె

ప్రకాశించుచున్నవాఁడును. అత్యంతసూక్ష్మమైన జీవుఁడు ఊర్ధ్వముగా నున్నాడు. అనఁగా జాఠరాగ్నియందున్నాడు అని యర్థము. సర్వదేహ వ్యాపియగు అగ్నిమధ్య ఒకానొకజ్వాల అత్యంతసూక్ష్మమై సుషుమ్నా నాడీనాలము మొదలుకొని ఊర్ధ్వభాగముననున్న బ్రహ్మరంధ్ర పర్యంతము ప్రసరించి విశేషముగానున్నది అనియు నొక సిద్ధాంతము.

నీల .... ... ... త్త్వణూపమాః.

నల్లనిమేఘమువంటి శరీరముగల భగవంతుని దివ్యమంగళ విగ్రహమునకు ఆశ్రయమగుటవలన ఈ జీవుఁడు, నల్లని మేఘమును మధ్యయందుగల మెఱపుతీగవలె ప్రకాశనశీలుఁడై యున్నాఁడు. నివ్వరిధాన్యపుగింజకొనవలె అతి సూక్ష్మమైనవాఁడును, పచ్చనికాంతియుక్తుఁడును. ఐ యున్నాఁడు.

తస్యాః ... ... ... స్వరాట్.

ఆ పచ్చనికాంతితోఁగూడిన జ్వాలతోసముఁడైన జీవుని హృదయ మధ్య పరమాత్మ యున్నాడు. ఆ నారాయణుఁడే చతుర్ముఖబ్రహ్మను శరీరముగాఁగలవాఁడు. రుద్రశరీరకుఁడు. ఇంద్రశరీరకుఁడు. అతఁడే ముక్తజీవుఁడు. నిత్యులవర్గము. కర్మములకు వశుఁడుగాడు కాన స్వయముగా ప్రకాశించువాఁడగుటచే స్వరాట్టనఁబడును.

నల్లనిమేఘమధ్యమున నున్న మెఱపుదీగవలె ముందు చెప్పఁబడిన అగ్నిశిఖయున్నది. అది నివ్వరిధాన్యపుగింజకొనవలె చాలా సూక్ష్మమైయున్నది. మనము ప్రత్యక్షముగా జూచుచున్న అగ్నిజ్వాలవలె పచ్చనికాంతితోఁగూడినది. ఆ అగ్నిశిఖామధ్యమందు జగత్కారణభూతుఁడైన పరమాత్మయున్నాఁడు. అతఁడు సర్వదేవాత్మకుఁడు. అతఁడే

చతుర్ముఖబ్రహ్మ, గౌరీపతి. ఇంద్రుఁడు, మాయావిశిష్టుడైన అంత ర్యామియగు భగవంతుడు నతఁడే. మాయారహితుఁడైన చిద్రూపుఁడు నతఁడే. పరతంత్రుడుకాఁడుగాన స్వయముగానే రాజు అనియు నొక సిద్ధాంతము.

యోఽపాం పుష్పంవేద ... ... ... య ఏవం వేద.

ఇందు ఉదకములు అనేక విధములుగా ప్రశంసింపఁబడుచున్నవి. అందు మొదటి ప్రశంస ఇది. చంద్రమండలము అమృతమయము గదా। ఇచట ఉదకము పుష్పస్థానీయముగా చెప్పఁబడుచున్నది. ఎవఁ డిట్లు తెలిసికొనుచున్నాడో వాఁడు స్వయముగా భోగార్థమై సంపంగి—పొగడ, మొదలైన పుష్పములతో, పుత్రాది సంతానముతో, ఆవులు మొదలైన పశువులతో సమృద్ధుఁడగుచున్నాఁడు. తెలిసికొనుటకు ఉత్సా హము గలిగించుటకై మొదట ప్రయోజనము (ఫలము) చెప్పఁ బడినది. ఉపసంహారముగా మఱల 'య ఏవం వేద ఎవడు ఈ విధ ముగా తెలిసికొనుచున్నాఁడో', అని మఱల చెప్పఁబడుచున్నది. అన్ని ప్రశంసలందు నింతే.

యోపామాయతనం ... ... అగ్నిర్వా ... ... య ఏవంవేద.

'అగ్నేరాపః। అని అగ్ని జలమునకు కారణమగుటవలన అగ్ని నీటికి ఆశ్రయము. మహాసృష్టియందు ఉదకములు అగ్నికి కార్యము లయినను బ్రహ్మాండాద్యవాంతర సృష్టియందు ఉదకములు, సమస్తము నకు కారణముగా చెప్పఁబడుటవలన బ్రహ్మాండమందుగల మనకు కనిపించు అగ్ని, జలకార్యముగా నుండుటవలన, నీరు అగ్నికి ఆధార మనఁబడుచున్నది. ఇట్లు జలాగ్నులు పరస్పరము ఆధారలైయున్నవి. ఇది రెండవప్రశంస.

యోఽపామాలు ... వాయుర్వా ... య ఏవం వేద.

మహాసృష్టియందు వాయోరాగ్నిః, అగ్నేరాపః, అను శ్రుతి వలన అగ్నిద్వారా వాయువుగూడా కారణమగుటవలన ఉదకములకు వాయువు ఆశ్రియమనఁబడెను. పూర్వము చెప్పబడినట్లే అవాంతర సృష్టియందు ఉదకములు వాయువునకాధారముగా చెప్పఁబడుచున్నవి. ఇట్లు తెలిసినవాఁడికి పై ఫలము లభించునని ప్రతి ప్రశంసయందు తెలియవలెను. ఇది ముడవ ప్రశంస.

యోపా ... తపత ఆయతనం ... వేద.

ఏ యీ సూర్యుడు తపించుచున్నవాఁడై మనకు లభించు చున్నాఁడో, ఆ యీ ఆదిత్యుడు ఉదకములకు అధారము. 'ఆదిత్యాత్ జాయతే వృష్టిః - ఆదిత్యునివలన వర్షము ఏర్పడుచున్నది' అని ఆదిత్యుడు జలములకు కారణమనఁబడుచున్నాఁడు. నీరుకూడ పూర్వ మందువలె ఆదిత్యునికాధారమగుచున్నది. ఇది నాల్గవ ప్రశంస.

యోపా ... చంద్రామావా ... ఏవంవేద.

మంచురూపముగానున్న కిరణములు చంద్రునినుండి వచ్చు చుండుటవలన చంద్రుఁడు జలములకు అధారమగుచున్నాఁడు. ఇది ఐదవ ప్రశంస.

యోఽపాం ... ... నక్షత్రాణివా .... ....వేద.

పుష్యమి ఆశ్రేషమొదలైన మహానక్షత్రములుండఁగా ఎక్కువ వాన కురియుచుండుట చూచుచున్నాము గాన నక్షత్రములు నీటి కాధారములగుచున్నవి. ఇది ఆఱవ ప్రశంస.

యోఽపాం ... పర్జన్యోవా ..., వేద.

వర్షమును కురియుటద్వారా జలమునకు మేఘము ఆధారముగా నుండుటను చూచుచున్నాముగదా! ఇది ప్రసిద్ధమే. ఏడవ ప్రశంస.

యోఽపా ... సంవత్సరోవా ... వేద.

వర్షఋతువుద్వారా సంవత్సరము జలమునకు ఆధారమగుచున్నది. ఇది ఎన్మిదవ ప్రశంస.

యోఽపాం ... ... ... తిష్ఠతి,

ఏ మానవుఁడు భూలోకాదులగు ప్రపంచమంతయును నీటి యందు స్థైర్యముగానుండిన నావనుగా తెలిసికొనుచున్నాఁడో; వాఁడు స్వయముగా లోకమందు ప్రతిష్ఠాయుక్తుఁడగుచున్నాఁడు. అనఁగా 'సర్వలోకములకు ఆధారములైనవి ఉదకములు' అనిఎరుఁగుటవలన ప్రతిష్ఠనందుచున్నాఁడనిభావము. నద్యాదులందు అవ్వలిగట్టుకు చేరు కొనుటకై జనుఁచే నేర్పరుపఁబడిననావ, జలమందు సుప్రతిష్ఠితమై యుండుటలేదు. రాకపోకలవలన చంచలమై నడచుచున్నది. సర్వలోక సంఘరూపమైన నావ ఎప్పుడును కదలక నీటియందే నిలచియున్నది. ఆవరణసహితమగు బ్రహ్మాండము 'ఘనోదము' అనెడి పేరుగల మహాజలమందు ప్రతిష్టితమైయున్నదని పురాణములందును ప్రసిద్ధము.

రాజాధిరాజాయ ... ... ... నమః

సమస్తరాజులకును దంభములేని స్వామియు, సర్వలాభములకును బలాత్కారముగా ప్రతిబంధకుఁడగు వైశ్రవణునికి యజమానులమగు మేము, నమస్కరించుచున్నాము. సర్వకామములకు(కోరికలకు)స్వామి

యగు ఆ వైశ్రవణుఁడు, బలమైనభోగమును అర్థించు నాకు, నాచేత కోరఁబడిన సర్వవాంఛితములను ప్రసాదించుఁగాక. కుబేరరూపుఁడైన మహారాజగు వైశ్రవణునకు నమస్కారము.

ఓం తద్బ్రహ్మ ... ... పురోర్నమః

ఇందు ప్రణవమే సర్వమునకు ఆత్మగా స్తుతింపఁబడుచున్నది. సర్వవేదాంతములందు ప్రసిద్ధమైన పరబ్రహ్మము, ప్రణవముచేత ప్రతిపాదింపఁదగినదే. ఆ వాయువును ప్రణవాత్మకమే. ఆ జీవుఁడును ప్రణవాత్మకుఁడే. సత్యమగునదియును ప్రణవాత్మకమే. సమస్తజగమును ప్రణవాత్మకమే. అన్నిటికిని మూలకారణము ప్రణవమే. కావున ఆ ప్రణవమునకు (ఓంకారమునకు) నమస్కారము.

అంతశ్చరతి .... .... .... ప్రజాపతిః.

ఓ పరమాత్మా! ఓంకార వాచ్యుఁడవైన నీవు దేవతిర్యఙ్మనుష్యాది నానాశరీరయుక్తుఁగు భూతములందు అంతర్యామివై బుద్ధియందును లోపలను సంచరించుచున్నావు. జ్యోతిష్టోమాదియగు యజ్ఞము నీవే. జగత్పాలకుఁడైన విష్ణువు నీవే. హరిః ప్రధానమంత్రమును నీవే. సంహారకర్తయైన రుద్రుఁడవును నీవే. ఇంద్రుఁడవును నీవే. జగత్తును సృష్టించు బ్రహ్మవును నీవే. (ఈ మంత్రము బ్రహ్మోపాసనమందు వినియోగింపఁబడినది.)

త్వం .... ... .... సువరోమ్.

పరబ్రహ్మవైన నీవే, ఆదిత్యరూపుఁడవై యున్నావు. జలరూపుఁడవు. సముద్రాదిగతములగు ఉదకములును, అగ్ని మొదలగు జ్యోతిరూపములును, తీపిమున్నగు రసరూపము, దేవతలచే త్రాగఁదగిన

అమృతరూపము, మంత్రసమూహరూపము, భూలోక - భువర్లోక - సువర్లోకములును అన్నియును పరమాత్మాత్మకములే.

ఈశానస్సర్వ ... .... ... సదాశివోమ్.

వేదాది సర్వవిద్యలకును, చతుష్షష్టి కళలకును నియామకుఁడును, అట్లే అఖిలప్రాణులకు నియామకుఁడును, వేదమును అధికముగా కాపాడువాఁడును, చతుర్ముఖునికి అధిపతియు, చతుర్ముఖుని శరీరముగాఁ గలవాఁడును, ఎల్లప్పుడు దోషములేనివాఁడును, ప్రణవముచేఁజెప్పఁబడు వాఁడును అగు ఆ పరమాత్మ, నాకు శుభములను కలిగించువాఁడగు గాక!

ఆ సదాశివుఁడను నేనే అగుదును, అని మరియొక సిద్ధాంతము.

హరిః ఓం తత్ సత్



# శ్రీ రామకృష్ణ సహస్ర నామావళి



ఓం నమో భగవతే శ్రీరామ
కృష్ణాయ నమః
శ్రీ జగద్గురవే
శ్రీ త్రిలోకాధారాయ
శ్రీ మహాదేవాయ
శ్రీ దేవాధిదేవాయ
శ్రీ సర్వభూతాంతరాత్మనే
శ్రీ పరమాత్మనే
శ్రీ పరంధామ్నే
శ్రీ పరమపురుషాయ
శ్రీ సర్వదేవదేవీ స్వరూ
పాయ 10
అవతారవంద్యాయ
పరమపవిత్రాయ
పరమహంసాయ
బ్రహ్మస్వరూపాయ
సావిత్ర్యై
విష్ణవే
రాధికాయై
రుద్రాయ
భద్రకాళికాయై
ఈశ్వరాయ 20
భువనేశ్వర్యై

ఓం సదాశివాయ
మహాగౌర్యై
శంభవే
సిద్ధకాళికాయై
మహేశ్వరాయ
మహాకాళికాయై
చిదాభాసాయ
విశ్వస్మై
విరజసే 30
వైశ్వానరాయ
సత్స్వరూపాయ
చిత్స్వరూపాయ
ఆనందస్వరూపాయ
సచ్చిదానందమూర్తయే
సగుణాయ
నిర్గుణాయ
సగుణనిర్గుణాతీతాయ
సాకారాయ
నిరాకారాయ 40
సాకారనిరాకారాతీతాయ
అకారాయ
ఉకారాయ
మకారాయ

ఓం ఓంకారాయ
తమోగుణానాథాయ
రజోదేవాయ
సత్వనాయకాయ
త్రిగుణాత్మకాయ
త్రిగుణాతీతాయ 50
సర్వాకారాయ
సర్వజ్ఞాయ
సర్వశక్తిస్వరూపాయ
సర్వవ్యాపకాయ
సర్వాధారాయ
సర్వసాక్షిణే
సర్వప్రకాశాయ
సర్వజ్ఞానమూర్తయే
సర్వశ్రేష్టే
సర్వస్వరూపాయ 60
మత్స్యమూర్తయే
కూర్మస్వరూపాయ
ఆదివరాహదేవాయ
లక్ష్మీనృసింహాయ
వామనాయ
పరశురామాయ
రామభద్రాయ
గోపాలకృష్ణాయ

ఓం బుద్ధదేవాయ
కల్క్యవతారాయ 70
అవతారవరిష్ఠాయ
వేదాంతవేద్యాయ
సర్వోపనిషత్సారాయ
గీతాచార్యాయ
సర్వశాస్త్రమూర్తయే
సర్వవ్యాఖ్యాయ
విద్యానాథాయ
విద్యాతీతాయ
విద్యామూర్తయే
పరవిద్యాప్రకాశాయ 80
నిర్వికల్పాయ
నిర్వికారాయ
నిర్మలాయ
నిష్కళంకాయ
నిశ్చంచలాయ
నిరతిశయాయ
నిరాలంబాయ
నిరాటంకాయ
నిర్మోహాయ
నిరంజనాయ 90
నిరాఘాటాయ
నిర్విఘ్నాయ

ఓం శ్రీగురుదత్తాయ
గౌతమబుద్ధాయ
శంకరాచార్యాయ
రామానుజాయ
మధ్వమూర్తయే
వల్లభాయ
నింబార్కాయ
శ్రీకృష్ణచైతన్యాయ 100
నిత్యానందస్వరూపాయ
సర్వగురురూపాయ
పరబ్రహ్మమూర్తయే
పరమపావనాయ
పరంజ్యోతిస్వరూపాయ
ద్వంద్వాతీతాయ
అవాఙ్మానసగోచరాయ
అఖండాయ
అనంతాయ
అవ్యయాయ 110
ఆనందాయ
అమృతాయ
అచ్యుతాయ
అకుంఠితాయ
అద్వయాయ
అతీతాయ

ఓం జగదుద్ధారాయ
జగన్మంగళాయ
జగదాధారాయ
జగన్నాథాయ 120
జగత్స్వరూపాయ
జగదలంకారాయ
జగత్కారణాయ
జగద్ధితాయ
శ్రీమన్నారాయణాయ
గయానిలయాయ
గదాధరాయ
సర్వయాత్రాఫలప్రదాయ
సర్వపుణ్యకారణాయ
సర్వమానవాలంకారాయ 130
భారతభాగ్యప్రీతాయ
భారతభాగ్యోన్నతికారకాయ
భారతవిజ్ఞానరూపాయ
పూర్వాధునికజ్ఞానమూర్తయే
సర్వాధ్యాత్మికమూర్తయే
పరమోత్కృష్టాయ
వంగరాష్ట్రభూషణాయ
బంకురామండలభాస్కరాయ
కామారిపుష్కరశేఖరాయ
బ్రాహ్మణవంశప్రదీపకాయ 140

ఓం ఛటర్జీ వంశచంద్రాయ
మానిక్రామపౌత్రరత్నాయ
క్షుదీరామపుత్రాయ
చంద్రామణీసుతాయ
దుర్ముఖీ సంవత్సరాయ
వసంతచిత్తాయ
ఫాల్గుణ మూర్తయే
శుద్ధశుక్లతేజసే
ద్వితీయాయై తిథయే
బుధవాసరాయ 150
పూర్వాభాద్రాయ
ప్రథమచరణాయ
సిద్ధయోగాయ
వాలవాకరణాయ
కుంభలగ్న ప్రదీపకాయ
బ్రాహ్మముహూర్తాయ
ధర్మస్థానాధిపాయ
సద్గురునాథాయ
ధర్మసంస్థితాయ
ధర్మవిస్మాపనీయాయ 160
పుణ్యకర్మరతాయ
దేవమందిరవాసాయ
బహుశిష్యసమన్వితాయ
మహాపురుషశ్రేష్ఠాయ

ఓం నారాయణాంశసంభవాయ
సర్వజనపూజ్యపాదాయ
భృగుసంహితాస్తుత్యజాతకాయ
ప్రభుయోగాయ
శ్రీగదాధరాఖ్యాయ
మహోత్కృష్టజాతకాయ 170
సర్వభూతరంజకాయ
దీర్ఘశరీరాయ
వికచకంజదళాక్షాయ
భాస్వరాయ
సువర్ణదీప్తిభాసితాయ
సుందరవదనారవిందాయ
అసంఖ్యాక శుభలక్షణలక్షితాయ
అత్యాశ్చర్యజనకాయ
అద్భుతరూపాయ
భస్మప్రపూతశరీరాయ 180
అతిశాంతస్వరూపాయ
అదృష్టవద్ధనీపూజితాయ
సర్వశ్రేష్ఠాయ
అదృష్టఫలప్రదాయ
కల్పవృక్షాయ
సర్వసుగుణనికరాయ
దీనపోషకాయ
అతిభారశరీరాయ

ఓం అత్యల్పాహారదేహాయ
భవిష్యద్రూపప్రదర్శకాయ 190
లాలిగానవిముఖాయ
కాళీస్తవప్రమత్తాయ
లీలామానుషాయ
బాలగోపాలాయ
చంద్రాదిచిత్రరంజకాయ
వంశవృక్షఫలాయ
సర్వదేవతాస్తోత్రపూర్ణాయ
పురాణేతిహాసపూరితాయ
భక్తిచైతన్యాయ
లౌకికవిద్యావిముఖాయ 200
నిష్కపటచిత్తాయ
గానగంధర్వాయ
చిత్రకళాప్రపూర్ణాయ
నాట్యాచార్యాయ
భరతనాట్యకళానిలయాయ
శిల్పవిద్యాచతురాయ
సర్వదేవతావిగ్రహవిధాత్రే
సంపూర్ణజ్ఞానమూర్తయే
వైరాగ్యస్వరూపాయ
పరవిద్యానిధానాయ 210
ఉత్కృష్టధ్యానసమాధి
స్థితాయ

ఓం త్రికాలజ్ఞాయ
త్రికాలాతీతాయ
ధైర్యలక్ష్మీనాథాయ
సదా బాలబాలికాపరివృతాయ
అతిమధురస్వరయుక్తాయ
మృదుమధురభాషణాయ
సర్వాకర్షణీయలక్షణలక్షితాయ
పురాణపురుషాయ
పురాణకథాలోలాయ 220
ప్రకృతిపురుషాయ
ప్రకృతిచైతన్యాయ
సంధ్యాకాలవిహారవిలోలాయ
కృష్ణమేఘసందర్శ
నోత్సుకాయ
శుక్లపక్షిగణదృశ్యసమ్మోదిత
చిత్తాయ
శ్రీకృష్ణసందర్శనానంద
ప్రమత్తాయ
నామరూపాతీతస్థితయే
భూపరిష్వంగజసుఖపూర్ణాయ
బ్రహ్మానందభరితాయ
మృత్యుతత్త్వజ్ఞాయ 230
ప్రాపంచికాస్థిరజ్ఞానినే
మాతృసేవాలాలసాయ

ఓం మాత్రాధ్యాత్మికస్థితి పోషకాయ
నిర్జనస్థలవిహారాయ
సత్సంగత్యలాలసాయ
సాధుసేవాత్యుత్సుకాయ
కాషాయకౌపీనధరాయ
విభూతిప్రపూతశరీరాయ
విశాలాక్షీప్రసన్నాత్మనే
భావసమాధిస్థితచిత్తాయ 240
ఆదర్శబ్రహ్మచర్యవ్రత రూపాయ
ధనివందితపాదాయ
నిగూఢతత్త్వాయ
దృఢసంకల్పాయ
ప్రేమాతిశయాయ
భక్తజనపోషకాయ
నామమాత్రసంప్రదాయ విచ్ఛేదకాయ
సభాపూజితాయ
పండితస్తవనీయకత్త్వాయ
శ్రీరఘువీరనామామృత లోలాయ 250
సాలగ్రామరూపాయ
అగణితదివ్యానుభవసిద్ధాయ

ఓం నటనానందమూర్తయే
శ్రీ గౌరీశంకరప్రాత నిర్వాహకాయ
కాలసర్పాలంకృతాయ
సదాశివధ్యానోన్మత్తాయ
పరమేశ్వరాయ
కైలాసాధిపతయే
పశుపతయే
ఆధ్యాత్మికగంగోత్తరణీ రూపాయ 260
అతిసులభాయ
నిత్యప్రసన్నాయ
తారకసుధాలోలాయ
స్మశానవాసతత్పరాయ
ఉన్మత్తరూపాయ
సహజసుందరమూర్తయే
సర్పాలంకృతదేహాయ
పశువాహనాయ
నీలకంఠాయ
ఘోరతపోగరిష్ఠాయ 270
నిశాచరాయ
శ్వేతకాంతిచ్ఛటపుంజాయ
జటాజూటయుక్తాయ
త్రినేత్రాయ

ఓం దిగంబరాయ
యోగయోగీశ్వరాయ
హిమాచలవిహారాయ
సమాధిసాగరమూర్తయే
శ్రీకాళికానాథాయ
శ్రీనివాసవందితచరణాయ 280
అసమానక్రీడాలోలాయ
పరమభాగవతాయ
శ్రీకృష్ణమూర్తయే
రాధావిరహసుధాలోలాయ
బృందావనలీలోన్మత్తాయ
రాధికాస్వరూపాయ
సఖ్యభావయుక్తాయ
శ్రీదామ్నే
సుదామ్నే
గోపాలబాలమూర్తయే 290
ప్రహ్లాదమూర్తయే
స్త్రీచిత్తచోరాయ
లీలావిశేషాయ
హాస్యపరిహాసరూపాయ
సర్వోత్కృష్టసందేశదాత్రే
మానిక్రామవనవిహారాయ
తీవ్రభక్తిస్వరూపాయ

ఓం పరాయత్తచిత్తాయ
దయాస్వరూపాయ
విషయసుఖవిదూరాయ 300
కాళీఘట్టనగరవాసాయ
దేవతార్చనోన్మత్తచిత్తాయ
పవిత్రతేజఃప్రావృతపురుషాయ
అనవరతభగవన్నామామృతలోలాయ
వ్యర్థలౌకికవిద్యావిముఖాయ
బ్రహ్మవిద్యాపూర్ణాయ
స్థిమితాయ
సంకల్పసిద్ధపురుషాయ
ప్రాపంచికవ్యవహారవిముఖాయ
దక్షిణేశ్వరీదర్శనమాధుర్యప్రమత్తాయ 310
శిష్టాచారసంపన్నమూర్తయే
గంగాతటవిహారాయ
అత్యుగ్రధ్యానమగ్నచిత్తాయ
మథురనాథవందితపాదాయ
హృదయరామప్రేష్ఠాయ
శివధ్యానతత్పరాయ
రాధాగోవిందార్చనాలోలాయ

ఓం శ్రీకాళికామందిరస్థితాయ
అత్యద్భుతశక్తిసమన్వితాయ
ప్రేమావతారాయ 320
శతశిల్పాచార్యాయ
తీవ్రావేదనానందాయ
నిరుపమదుఃఖాగ్నిరుద్రాయ
విరహవేదనాసాగరాయ
యథార్థార్చకాయ
పరభక్తియుక్తాయ
భక్తాగ్రగణ్యాయ
మంత్రద్రష్టే
కులకుండలినీరూపాయ
రాజయోగశేఖరాయ 330
యోగరాజాయ
సహస్రారమధ్యస్థాయ
ఏకాంతవాసనిరతాయ
నశ్వరప్రపంచదూరాయ
సంధ్యాకాలరతాయ
కేనారామశిష్యచంద్రాయ
కాళికామంత్రసిద్ధాయ
నిగూఢతత్త్వాయ
శ్రీకాళికాభక్తమణయే
కాళికాభక్తిచైతన్యాయ 340
కాళికాపూజామగ్నాయ

ఓం ప్రాపంచికజనవిముఖాయ
పంచవటీతలతపోన్మత్తాయ
దిగంబరశరీరాయ
దీర్ఘకుంతలాయ
సర్వాడంబరవర్జితాయ
నిర్భయాయ
ఆమలకతరుతలవాసాయ
నిశ్చేష్టదేహాయ
రామప్రసాదోక్తకీర్త
నోన్మత్తాయ 350
కమలకాంతారచితస్తోత్ర
మగ్నాయ
దుఃఖాశ్రుస్రావయుక్తాయ
కాలాతీతాయ
కష్టతమసాధనసిద్ధాయ
సర్వసంశయవిధ్వంసకాయ
అజన్మసిద్ధాయ
భక్త్యున్మత్తపురుషాయ
కర్మభక్త్యతీతాయ
గౌణభక్తివిముఖాయ
పరభక్తిమూర్తయే 360
ఉన్మత్తరూపాయ
తురీయస్థితచిత్తాయ
అవస్థాత్రయదూరాయ

ఓం ఆహారవ్యవహారవర్జితాయ
దీనాతిదీనాయ
అనిర్వచనీయతత్త్వాయ
దుఃఖానందపూర్ణాయ
ఆత్మార్పణతత్పరాయ
ఆవేశజనితభీభత్సాయ
శ్రీకాళికాదర్శనప్రాప్త
పురుషాయ 370
ఆనందసంపన్నికుంభితాయ
శ్రీకాళికాస్వరూపాయ
ఆనందమాత్రే
సృష్టిమూలాయై
స్థితినిలయాయై
లయకారణాయై
మాత్రే
రాజరాజేశ్వర్యై
చండీరూపిణ్యై
ఆనందవాహిన్యై 380
దుర్గామాత్రే
పరాశక్తిస్వరూపిణ్యై
ఆదిశక్తిమూర్తయే
సర్వవైభవాన్విత సంపన్నాయై
అభయప్రదాయిన్యై
మందహాసచంద్రికాయుక్తాయై

ఓం అక్షరమాలాసంశోభితాయై
కోటిసూర్యప్రభాయై
కృష్ణవర్ణపరిపూర్ణాత్మనే
నిర్భయప్రదాయిన్యై 390
ప్రకృతిస్వరూపిణ్యై
జగన్మాత్రే
మోక్షప్రదాయిన్యై
కాలాగ్నిమూర్త్యై
భీకరస్వరూపిణ్యై
మహిషాసురమర్దిన్యై
మృదుమధురభాషిణ్యై
భక్తజనపోషిణ్యై
భవసాగరనాశిన్యై
సర్వాధ్యాత్మిక
పాదపాయై 400
కరుణాస్వరూపిణ్యై
కళ్యాణమూర్త్యై
శబ్దబ్రహ్మరూపిణ్యై
నాదబిందుకళాయై
దక్షిణేశ్వరమూర్తయే
ప్రసన్నాత్మనే
సరస్వత్యై
శ్రీరమాయై
పార్వత్యై

ఓం శక్తిత్రయహారిణ్యై 410
సనాతనాయై
సర్వసృష్టిస్థితిలయకారిణ్యై
ఆదిమధ్యాంతరహితాయై
అగమ్యగోచరాయై
సర్వాగమమూలాయై
శాశ్వతానందప్రదాయిన్యై
సర్వతంత్రసంపన్నాయై
సర్వయంత్రస్వరూపిణ్యై
సర్వమంత్రసారాయై
నవకోటిమంత్రమూలాయై 420
సర్వస్వతంత్రమూర్త్యై
సర్వవిశ్వపోషిణ్యై
కాళికాచైతన్యాయ
అనేకదివ్యదృశ్యప్రాప్తహృదయాయ
దివ్యజ్యోతిర్దర్శనప్రాప్తాయ
సంపూర్ణభగవతీయుక్తచిత్తాయ
దేవ్యనుగ్రహప్రాప్తాయ
కాళికాంకతలస్థితాయ
సదా కాళికాసన్నిధానభాగ్యవతే
దివ్యశక్తిసమన్వితాయ 430
సర్వసంశయవిచ్ఛేదకాయ
ప్రేమభక్తిప్రపూర్ణాయ

ఓం ద్వంద్వస్వరూపాయ
పాపపురుషనాశకాయ
పుణ్యపురుషశ్రేష్ఠాయ
తేజోవిభాసితాయ
పంచభక్తిసంయుక్తాయ
శాంతిభావసంస్థితాయ
దాస్యభక్తిభూషితాయ
హనుమద్భక్తివిశిష్టాయ 440
మారుతీధ్యానయుక్తాయ
ఆంజనేయాయ
శ్రీరామసేవాధురంధరాయ
కపికులశేఖరాయ
రాక్షసకులనాశకాయ
అస్ఖలితబ్రహ్మచర్యవ్రతదక్షాయ
వేదాంతవేద్యాయ
బలవతే
పండితాగ్రేసరాయ
సిద్ధపురుషాయ 450
కామరూపాయ
ఆదర్శభక్తాయ
సుగుణగణభూషితాయ
శ్రీరామనామసుధారసలోలాయ
వనచరాయ

ఓం స్వేచ్ఛామతయే
కాలాగ్నివీరాయ
ప్రసన్నాంజనేయాయ
నిర్విక్రమపరాక్రమాయ
కామితమందారాయ 460
బ్రహ్మానందరూపాయ
సీతాప్రసన్నాత్మనే
త్రికరణశుద్ధాయ
సర్వచరాచరాత్మనే
భక్తపరిపోషకాయ
రాస్మణీగురవే
చంచలచిత్తనాశకాయ
ఆదర్శగురుమూర్తయే
అశ్వత్థబిల్వామలకాశోకవట
పంచవటీవాసాయ
ఉగ్రతపోతత్పరాయ 470
తత్త్వార్థతరంగఘాతతాడిత
చిత్తాయ
జయశ్రీవల్లభాయ
శ్వేతారుణపుష్పస్రష్టే
దశమహావిద్యాదేవాయ
దీనార్తజనరక్షకాయ
వనితామోహవ్యూహ
చ్ఛేదకాయ

ఓం కేవలశిశుస్వరూపాయ
దుష్టచిత్తభంజకాయ
హలధారిగర్వహరాయ
హఠయోగప్రదీపకాయ 480
అశాంతియుక్తాయ
అంతర్దృష్టిసంస్థితాయ
బాహ్యాంతరాతీతాయ
ఏకాగ్రచిత్తాయ
సత్వగుణసంయుక్తాయ
సహచరదూరాయ
సదా కాళికాస్మరణవిలోలాయ
ఆరూఢచిత్తస్థితాయ
స్మశానవాసాయ
నిర్భయస్వరూపాయ 490
అశ్రుధారాసంయుతాయ
ఉన్మత్తాయ
సాధనసిద్ధాయ
శారీరావరణవర్జితాయ
దివ్యజ్ఞానసంపన్నాయ
శారదాప్రాణనాథాయ
ధీమతే
కులాలంకారాయ
ముకుందపురనాథాయ
యజ్ఞసూత్రరహితాయ 500

ఓం బాలకృష్ణసందర్శనోత్సుకాయ
సీతాదర్శనభాగ్యసంపన్నాయ
దండధరాయ
గోపాలకృష్ణాయ
శునకోచ్ఛిష్టభోక్త్రే
పక్షిగణమిత్రాయ
సర్వబంధురూపాయ
అనిమిషాయ
నిద్రాహారవివర్జితాయ
గౌరుభావపరిపూర్ణాయ 510
సర్వభక్తినిధానాయ
ఆదర్శభక్తాగ్రేసరాయ
విశ్వవ్యాపకాయ
బ్రహ్మతత్త్వరూపాయ
అవతారవంద్యపాదాయ
బ్రాహ్మణీష్టదేవాయ
సర్వభక్తమూర్తయే
భైరవీపుత్రరత్నాయ
రాధామాధవాయ
అత్యధికబాధాసం
యుక్తాయ 520
అపూర్వశుద్యుక్తాయ
నారాయణస్వరూపాయ
ఉన్మత్తావతారాయ

ఓం స్వేచ్ఛావతారమూర్తయే
వైష్ణవచరణేష్టమూర్తయే
గౌరీపండితవంద్యపాదాయ
విస్పష్టపూర్ణావతారాయ
భావసమాధిసాగరాయ
సర్వజంధవిచ్ఛేదకాయ
విశ్వతోముఖచరితాయ 530
దూషణభూషణాతీతాయ
తంత్రసాధనాపాదపాయ
భవసాగరతారకాయ
అనుభవవిభూతిప్రపూతాయ
దివ్యభావసంస్థితాయ
పశుభావాతీతాయ
వీరభావసిద్ధాయ
దివ్యతంత్రోద్ధారకాయ
తదేకనిష్ఠాగరిష్ఠాయ
మధుమాంసవిముఖాయ 540
బాహ్యాంతరతేజోపరివృతాయ
రాజయోగవిభూషణాయ
అష్టసిద్ధిస్వరూపాయ
సిద్ధివిముఖాయ
సృష్టిస్థితిలయదర్శన
లాభాయ
త్రిమూర్తిసారాయ

ఓం రాజరాజేశ్వరీప్రియాయ
సుందరస్వరూపాయ
అరుణవక్షసే
చంద్రావందితచరణాయ 550
గిరిజాపూజ్యపాదాయ
రామాయతసాధుపరివృతాయ
పరమహంససాధు
పరివేష్టితాయ
పరమగురుదేవాయ
భారతభాగ్యదేవాయ
హిందూమతమూర్తయే
సర్వమతస్వరూపాయ
దివ్యాత్మనే
సిద్ధాయ
మజుందారువందితాయ 560
నిరవధికవిద్యాప్రదపాయ
భారతీనాథాయ
అగణితపండితపరివృతాయ
విద్యాధికయువకవంద్య
పాదాయ
సాధకాగ్రగణ్యాయ
సర్వాదర్శపురుషాయ
వికసితహృదయాయ
అనుక్షణదివ్యతత్త్వాయ

ఓం గౌరీచిత్తాపహారాయ
నారాయణగురురూపాయ 570
దయానందవందితపాదాయ
జయనారాయణస్తుతచరితాయ
కృష్ణకిశోరచిత్తచోరాయ
గోవిందపూజితచరణాయ
జటధారీశిష్యమణయే
రామలాలప్రేమాన్వితాయ
వాత్సల్యభావపూర్ణాయ
రామలాలప్రసన్నాత్మనే
మాతృదేవ్యై
అద్భుతభావయుక్తాయ 580
మధురామృతపానోన్మత్తాయ
బాలరామదర్శనోన్మత్తాయ
శ్రీరామచంద్రాయ
రఘుకులభూషణాయ
దశరథపుత్రాయ
జానకీవల్లభాయ
మౌనిజనవందితాయ
మారుతీరామాయ
రావణకుంభకర్ణరాక్షస
చయహరాయ 590
అభయహస్తాయ
ఆదర్శపురుషాయ

ఓం పితృవాక్యపరిపాలనా
దురంధరాయ
శబరీమోక్షప్రదాయ
అహల్యాశాపవిమోచకాయ
యజ్ఞయాగసంరక్షకాయ
తపశ్శీలాయ
ఆనందాఖ్యాయ
పట్టాభిరామాయ
మహాచక్రవర్తినే
సర్వమానవాలంకారాయ 600
మధురభావస్థితాయ
వనితారూపనిర్వాహకాయ
శ్రీరాధాకృష్ణస్మరణా
నందాయ
రాధామాధవసందర్శనలోలాయ
స్త్రీతత్త్వపూర్ణాయ
లీలామానుషాయ
రాధికాచిత్తాపహరాయ
నందతనూజాయ
కుబ్జాపాలకాయ
పార్థసారథయే 610
నరనారాయణాయ
నరకాసురమర్దనాయ
రుక్మిణీనాథాయ

ఓం గోపికాచిత్తచోరాయ
నవనీతచోరాయ
నిష్కామకర్మసూత్రదాయ
కామినీపరివృతాయ
అస్ఖలితాయ
గోవర్ధనోద్ధారకాయ
హృదయనాథాయ 620
లీలావినోదాత్మనే
లీలామానుషవిగ్రహాయ
జగన్నాటకసూత్రధరాయ
నీలమేఘశరీరాయ
వేణునాదవినోదాయ
సన్న్యాసరాజాయ
ద్వారకాపతయే
గీతోపదేశకాయ
పురుషోత్తమాయ
భావాయ 630
మహాభావాయ
నశ్వరలోకవిముఖాయ
తోతాపురీశిష్యరత్నాయ
ఆదర్శసన్న్యాసమూర్తయే
యతీశ్వరాయ
బ్రహ్మానందభరితాయ
మహాజ్ఞానచైతన్యాయ

ఓం త్రిరాత్రినిర్వికల్పస్థిత
చిత్తాయ
దృగ్దృశ్యదర్శనరూపాయ
భక్తభక్తిభగవత్స్వ
రూపాయ 640
దుస్సాధ్యనిర్వికల్పయుక్తాయ
నిర్వికల్పతరుతలవాసాయ
సర్వమూలాధారాయ
సర్వాధ్యాత్మికానుభవసారాయ
సర్వాతీతాయ
శూన్యాశూన్యాతీతాయ
ఏకేశ్వరాయ
భావవిదూరాయ
హరిఓంస్మరణానందాయ
తోతాపురీగురుమూర్తయే 650
అతీతశక్తియుక్తాయ
సువర్ణహృదయాయ
పరమహంసాచార్యాయ
అవధూతావతంసాయ
సగుణనిర్గుణయుక్తాయ
భక్తిజ్ఞానవైరాగ్యమూర్తయే
గంగోదకాస్వాదనోన్మత్తాయ
అద్భుతకార్యధురీణాయ
చిత్రవిచిత్రస్వరూపాయ

ఓం పురుషప్రకృత్యై 660
అతిశాంతియుక్తాయ
మాసషట్క నిర్వికల్పస్థితాయ
సర్వరోగనివారకాయ
గోవిందానుచరాయ
ఇస్లాముమతావలంబకాయ
అల్లానందభరితాయ
సగుణనిరాకారాయ
భక్తిభావోద్రేకాయ
శారదాభక్తిపోషకాయ
లింగభేదరహితాయ 670
విషయరహితాత్మనే
మధురనాథమోక్షప్రదాయ
భావతత్త్వాయ
దేవలోకనాథాయ
శారదాహృదయమథనాయ
కాళీతత్త్వపూర్ణాయ
కపటనాట్యాచార్యాయ
శారదాశిక్షాచార్యాయ
వ్యావహారికజ్ఞానభరితాయ
ఇహపరరసాస్వాదనాయ 680
సర్వసమత్వదృష్టియుక్తాయ
సమాధిప్రదాయ
తంత్రశాస్త్రవిశారదాయ

ఓం శారదాభక్తాగ్రేసరాయ
షోడశీపూజామగ్నాయ
విశ్వాత్మదృష్టియుక్తాయ
తత్త్వరహస్యసంయుతాయ
తత్త్వస్వరూపాయ
సర్వసమాధిరతాయ
శారదారామకృష్ణాయ 690
దేహాత్మభావరహితాయ
అనంతకల్యాణగుణమయాయ
సర్వాకర్షణశక్తిసంపన్నాయ
ప్రభావాయ
ప్రతిష్ఠాయ
అప్రతిమానాయ
క్రైస్తవోత్తమాయ
శంభుచరణమిత్రాయ
శంభుచరణోద్యానవిహారాయ
మేరీక్రీస్తుదర్శనరతాయ 700
ఏసుక్రీస్తుతత్త్వాయ
మేరీసుతాయ
అనేకకోటిశిష్యసమన్వితాయ
త్రిలోకవంద్యాయ
మానవోద్ధారకాయ
పాలస్తీనాపుణ్యమూర్తయే
యూదుమతోద్ధారకాయ

ఓం పతితపావనాయ
పరమకృపామయాయ
సాక్షాదీశ్వరసుతాయ 710
సర్వసద్గుణసంయుతాయ
సర్వసంగసన్యాసాయ
ఆత్మార్పణపురుషాయ
యోగారూఢాయ
విజితేంద్రియాయ
స్థితప్రజ్ఞాయ
సర్వసిద్ధియుక్తాయ
రాజయోగేశ్వరాయ
సిలువస్వరూపాయ
త్యాగమూర్తయే 720
ప్రేమస్వరూపాయ
త్రిలోకనాధాయ
సిద్ధార్థాయ
పరమత్యాగావతారాయ
అత్యంతతపస్తత్పరాయ
పృథ్వీనాథాయ
శుద్ధోదనపుత్రాయ
మాయానందనాయ
సర్వమంగళస్వరూపాయ
సామంతరాజపరివృతాయ 730
దేవదేవితాసేవితాయ

ఓం అసితాదియోగీశ్వర
వందితాయ
అతికరుణాస్వరూపాయ
హంసప్రాణసంరక్షకాయ
సర్వబాధావిదూరాయ
సర్వసుఖనిలయాయ
యశోధరాప్రియాయ
మరుత్ప్రబోధితహృదయాయ
సర్వత్యాగరాజాయ
సన్న్యాసమూర్తయే 740
అనంతప్రాప్తచిత్తాయ
బోధివృక్షతలస్థితాయ
బుద్ధమూర్తయే
బౌద్ధసిద్ధాంతకర్త్రే
ఆనందరాహులపరివేష్టితాయ
అగణితశిష్యగణసమ
న్వితాయ
రాజాధిరాజసంసేవితాయ
సర్వదుఃఖవినాశాయ
చతురర్థప్రబోధాయ
అష్టమార్గదాత్రే 750
జగద్రక్షకాయ
జైనమతాచార్యాయ
మహావీరాయ

ఓం హనుమదవతారాయ
తీర్థాలంకారాయ
జనకరాజాయ
శిక్కుమతగురవే
గురునానక్స్వరూపాయ
అవతారశ్రేష్ఠాయ
అసాధారణపురుషాయ 760
నవయుగపురుషాయ
స్వేచ్ఛాత్మనే
పరార్థచిత్తాయ
ముక్త్యతీతాయ
సర్వజీవమోక్షప్రదాయ
భావ్యవతారాయ
భావిదృష్టిసంస్థితాయ
సర్వమతసౌభ్రాత్రదృష్టి
మయాయ
సర్వసమదృష్టియుక్తాయ
సర్వకర్మాతీతాయ 770
నిష్కామాచార్యాయ
విశ్వాత్మభావారూఢాయ
జన్మరాహిత్యస్థితిప్రదాత్రే
ఆదర్శసుతాయ
చంద్రాచిత్తోపశమనాయ
శారదాప్రత్యక్షదేవాయ

ఓం సింహవాహినీరూపాయ
జయరామవటీవాసాయ
అతిసూక్ష్మతమతత్త్వాయ
సత్యవ్రతశీలాయ 780
అమానుషచర్యాయుక్తాయ
విశ్వనాథవందితచరణాయ
కేశవచంద్రపూజితపాదాయ
నిగూఢభాషణయుతాయ
సులభపదయుక్తాయ
పండితకేశవబోధకాయ
విశ్వాత్మస్వరూపాయ
బ్రహ్మసమాజవందితాయ
సుబోధకాచార్యాయ
అనుభవవేద్యాయ 790
విజయకృష్ణపూజితాయ
శివనాథవందితపాదాయ
నిరాడంబరాయ
త్రైలోక్యనాథసేవితాయ
కామాతీతాయ
రామపూజాధురంధరాయ
దానకర్ణాయ
పరమపావనాయ
పండితాగ్రేసరాయ
పామరజనపోషకాయ 800

ఓం పంచతత్త్వనిలయాయ
శ్రీగౌరరూపాయ
నవద్వీపనాథాయ
కృష్ణమోహనాయ
నిత్యానందసేవితాయ
ఆత్మారామశివాయ
అంతర్యామిదేవాయ
స్వల్పాహారసంతుష్టాయ
అత్యాహారసంతృప్తాయ
లక్ష్మీనారాయణ
వంద్యాయ 810
మాయాచ్ఛాదనరహితాయ
వికసితపుష్పరాజాయ
ఆధ్యాత్మికమకరందపూర్ణాయ
సుగంధసంసేవితాయ
సహస్రారపద్మదళరాజాయ
సర్వానుభవదళపుష్పాయ
రామచంద్రసంసేవితాయ
దివ్యదృష్టియుక్తాయ
శిష్యపరంపరాసంయుతాయ
మనోమోహనవందితాయ 820
సూక్ష్మశరీరవిహారాయ
స్వప్నలోకాంతర్విహారాయ
క్షమాస్వరూపాయ

ఓం శిష్యశిక్షణదక్షాయ
శిష్యపరిపోషకాయ
శిష్యపరీక్షాశీలాయ
సురేంద్రవందితాయ
మానసికరోగభంజకాయ
కేదారనాథపూజితాయ
ఉత్సాహజనకాయ 830
ధైర్యవతే
యతీంద్రమోహనదేవాయ
దానప్రియాయ
ప్రతాపచంద్రవందితాయ
దివ్యస్పర్శవేదినే
అద్వైతజ్ఞానప్రదాయ
అనుగ్రహస్థితాయ
బ్రహ్మాండపాలకాయ
సాధుతత్త్వాయ
హృదయరామపోషకాయ 840
నిత్యగోపాలవంద్యపాదాయ
బలరామపూజితపాదాయ
నిత్యసిద్ధసంసేవితాయ
ఈశ్వరకోటిపరివృతాయ
మహేంద్రస్తుత్యచరణాయ
విశుద్ధాత్మనే
అశ్వినీకుమారసుతాయ

ఓం ఈశ్వరచంద్రప్రమోదాత్మనే
పవ్హారిగురునాథాయ
వైకుంఠనాథసంస్తుతాయ 850
దుర్గాచరణపూజితచరణాయ
నాగజ్యోతిప్రదీపకాయ
లోకాయతిమతనాశకాయ
చార్వాకసిద్ధాంతవిధ్వంసకాయ
నిర్వాణయుక్తచిత్తాయ
శ్యామసుందరమూర్తయే
సుధాపానోన్మత్తాయ
చతుర్భువనపాలకాయ
సర్వసజ్జనపోషకాయ
బ్రహ్మాండనాయకాయ 860
పిండాండనిలయాయ
సకలచరాచరరూపాయ
అఖిలసాధుపోషకాయ
భావాతీతాయ
జ్ఞానామృతాయ
బోధానందాయ
కేవలాఖండచిన్మాత్రాయ
ప్రజ్ఞానానందాయ
గగనాకారాయ
సర్వగాయ 870
స్వయంప్రభాయ

ఓం సర్వకల్పనాధిష్ఠానాయ
నిరావరణాయ
షడ్భావాదివికారరహితాయ
అనిర్వాచ్యచైతన్యాయ
ద్వైతాద్వైతవర్జితాయ
కార్యకారణదూరాయ
సహజానందాయ
శుద్ధాద్వైతపరాత్పరాయ
శూన్యాశూన్యాతీయాయ 880
అనంతసమరసరూపాయ
శుద్ధబుద్ధముక్తస్వరూపాయ
నిర్మలనిర్వాణమూర్తయే
అక్షయాయ
అతీంద్రియాయ
ఏకరూపాయ
సద్ఘనానందాయ
చిద్ఘనానందాయ
ఆనందఘనస్వరూపాయ
త్రివిధభేదవర్జితాయ 890
సర్వాఖ్యారహితాయ
అసంగాయ
పురాణాయ
వాచామగోచరాయ
ఆధారాధేయదూరాయ

ఓం ప్రశాంతాయ
అచలాయ
అజరాయ
సదానందలక్షితాయ
సూక్ష్మాతిసూక్ష్మాయ 900
బృహద్రూపాయ
నిరామయాయ
తురీయాత్తురీయాయ
కూటస్థాయ
నిరాకులాయ
పూర్ణాయ
షడూర్మిదూరాయ
విశుద్ధాయ
సర్వశరీరోపాధివినిర్ముక్తాయ
నిర్విశేషాయ 910
సర్వత్రాఖండైకరూపాయ
అమనస్కాయ
సుప్రభాయ
భాగ్యాయ
సర్వమయాయ
సర్వమంగళాయ
కార్యకారణాతీతాయ
కామితమందారాయ
చతుర్వేదాయ

ఓం అసాధారణాయ 920
పరమేశావతారాయ
శబ్దబ్రహ్మణే
సర్వమంత్రశక్తయే
సర్వయంత్రాయ
సర్వతంత్రాయ
సర్వస్వతంత్రాయ
క్షరాక్షరాయ
హ్రీం మాయారూపాయ
శ్రీం లక్ష్మీ స్వరూపాయ
క్రీం కాళికాదేవ్యై 930
హ్రాం కుర్చారూపాయ
హ్రుం వర్ణరూపాయ
రం అగ్నిమూర్తయే
ఎం యోగిరాజాయ
ఐం సరస్వత్యై
గం గణేశాయ
దుం దుర్గాయై
క్లీం శక్తిస్వరూపాయ
ఫట్ అస్త్రాయ
నమః వంద్యపాదాయ 940
శారదామత్యై
మాతృదేవ్యై
నరేంద్రాయ

ఓం వివేకానందాయ
రాఖలచంద్రాయ
బ్రహ్మానందాయ
శశిభూషణాయ
రామకృష్ణానందాయ
హరినామ్నే
తురీయానందాయ 950
శారదాస్వరూపాయ
శారదానందాయ
బాబురామాయ
ప్రేమానందాయ
తారకనాథాయ
శివానందాయ
గోపాలచైతన్యాయ
అద్వైతానందాయ
లాటుపోషకాయ
అద్భుతానందాయ 960
నిరంజనాయ
నిరంజనానందాయ
యోగిరాజాయ
యోగానందాయ
గంగాధరాయ
అఖండానందాయ
తులసీచరణాయ

ఓం నిర్మలానందాయ
హరిప్రసన్నాయ
విజ్ఞానానందాయ 970
కాశీప్రసాదాయ
అభేదానందాయ
సుబోధాయ
సుబోధానందాయ
శరత్పరిపాలకాయ
త్రిగుణాతీతానందాయ
ముకుందాయ
అనుభవానందాయ
సర్వవ్యాప్త తేజోమూర్తయే
సకలాధ్యాత్మికపారంగ
తాయ 980
అఖిలతత్త్వస్వరూపాయ
నిఖిలమానవవంద్యాయ
సర్వారాధ్యమూర్తయే
మహర్షిగణహృద్భవనవాసాయ
సర్వోత్తమరూపాయ

ఓం పూర్వాధునసమన్వయ
మూర్తయే
సర్వాదర్శరూపాయ
బ్రహ్మాండస్థితాయ
బ్రహ్మాండపాలకాయ
బ్రహ్మాండమూర్తయే 990
బ్రహ్మస్వరూపాయ
అనిర్వచనీయ తత్త్వాయ
అగోచరాయ
అద్భుతాయ
సగుణనిర్గుణసమాధిమగ్నాయ
ద్వైతాద్వైతసమన్వయ
రూపాయ
సకలదేవతాసాక్షాత్కార
సంపన్నాయ
సర్వమతానుభవసారాయ
అనుభవానందమూర్తయే
శ్రీరామకృష్ణదేవాయ 1000



# శ్రీరామకృష్ణ అష్టోత్తరశత నామావళి



శ్లో॥ శ్రీరామకృష్ణః సాధకకల్పవృక్షః
సమస్తసద్ధర్మసమైక్యరూపః।
ముముక్షుజనవాంఛితకామధేనుః
నిరంతరం రక్షతు త్యాగమూర్తిః॥

ఓంకారస్వరూప శ్రీరామకృష్ణ పరమాత్మనే నమః

ఓమిత్యక్షరమేతదాదౌ ప్రయుక్తం ధ్యానం ధ్యాయితవ్యమితి
ఓంకారస్వరూప శ్రీరామకృష్ణ పరమాత్మనే నమః

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ ధ్యేయం సర్వ ముముక్షుభిరితి
ఓంకారస్వరూప శ్రీరామకృష్ణ పరమాత్మనే నమః

ఓమితి బ్రహ్మేతి వ్యష్టిసమష్టిప్రకారేణేతి
ఓంకారస్వరూప శ్రీరామకృష్ణపరమాత్మనే నమః

ఓమిత్యేతదక్షరముద్గీథముపాసీతేతి
ఓంకారస్వరూప శ్రీరామకృష్ణ పరమాత్మనే నమః

ఓమిత్యేతదక్షరమిదం సర్వం భూతం భవద్భవిష్యదితి సర్వమోం
కార ఏవ యచ్చాన్యత్త్రికాలాతీతం, తదప్యోంకారఏవేతి
ఓంకారస్వరూప శ్రీరామకృష్ణ పరమాత్మనే నమః

ఓంకారప్రభవా వేదా ఓంకారప్రభవాస్స్వరాః । ఓంకార ప్రభవం
సర్వం త్రైలోక్యం సచరాచరమితి
ఓంకారస్వరూప శ్రీరామకృష్ణ పరమాత్మనే నమః

ఓమితి బ్రహ్మ, ఓమితీదం సర్వం ఓమిత్యేతదనుకృతి హస్మ వా
అప్యో శ్రావయత్యాశ్రావయంతి ఓమితి సామాని గాయంతీతి
ఓంకారస్వరూప శ్రీరామకృష్ణ పరమాత్మనే నమః

ఓంకారం యో న జానాతి బ్రహ్మణో న భవేత్తు స ఇతి
ఓంకారస్వరూప శ్రీరామకృష్ణ పరమాత్మనే నమః

నభస్సదృశసర్వవ్యాపకాత్మస్వరూపాయ 10
నవావరణయుక్త సర్వశక్తిస్వరూపాయ
నరనారాయణాఖ్య జీవబ్రహ్మైక్యోపదేశికాయ
నవ్యపురాతనసర్వాధ్యాత్మికతత్త్వానుభవయుక్తాయ
నర్తనగానానురాగప్రియనాదబ్రహ్మణే
నతజనాఖిలకలుషాంధకారవిచ్ఛేదక ప్రభాన్వితాయ
నశ్వరమాయాప్రపంచసర్వదుష్టవిక్షేపవిధ్వంసకాయ
నందముఖారవిందప్రభూతదివ్యజ్యోత్స్నాలంకృతాయ
నరేంద్రనాథప్రముఖసహస్రాధికశిష్యపరివేష్టితసర్వాధిపతయే

మోక్షవిశిష్టచిత్తజనితానందకందళితహృదయాయ 19
మోదవార్ధితరంగదోలికాతలశయనోన్మత్తాయ
మోహనశక్తియుక్తాష్టప్రకృతిపరివేష్టితమహారాజాధిరాజాయ
మోక్షలక్ష్మీసంపాదితసర్వాధ్యాత్మికసాధనానుభవసంపత్స్వరూపాయ
మోఘాపుష్పసుతసదృశనిస్సారప్రపంచనిఖిలవ్యామోహబంధ
విధ్వంసకాయ
మోచకసంస్కారతత్త్వపరిశీలనానుగుణోపదేశప్రదాత్రే

మోదప్రమోదాత్మకసువర్ణ తేజోపుంజప్రసరణమూర్తయే
మోహితవిశ్వమానవోద్ధరణకార్యదీక్షాదక్షాయ
మోక్షానందరూపప్రభావిభాసితాయ

భక్తరక్షాదక్షసర్వశక్తిసంపన్నాయ 28
భక్తిభాగవతభగవదాఖ్యత్రిపుటీస్వరూపాయ
భక్తిజ్ఞానవైరాగ్యాత్మికాధ్యాత్మికమార్గోపదేశికాయ
భక్త్యున్మత్తమూర్తి శ్రీకృష్ణచైతన్యావతారాయ
భవసాగరతరణోపాయనిధానస్వరూపాయ
భవతారిణీచరణయుగ్మపూజానిరతవ్రతశీలాయ
భవిష్యత్ప్రపంచోద్ధారకదివ్యసందేశ ప్రదాత్రే
భరతఖండసంజనితవేదవిజ్ఞానాఖండమూర్తయే
భవ్యమధురసుధారససంజనకపాదయుగళాయ

గయాపవిత్రక్షేత్రపురనాథశ్రీగదాధరాయ 37
గంగాపావనోదకాధికతరపవిత్రచరితాయ
గగనోపమశుద్ధవిశాలవిశ్వతోముఖహృదయాయ
గణనీయసర్వసద్గుణగణనికరాయ
గంగాతటస్థపంచవటీతలతపోనిష్ఠాగరిష్ఠాయ
గభీరతత్త్వార్థవిజ్ఞానసాగరరూపాయ
గరిష్ఠాధ్యాత్మికసర్వోత్కృష్టసుఖాబ్ధివిహారాయ
గంభీరనిర్వికల్పసవికల్పాదిసమస్తవిధసమాధిజన్యనిరుపమానంద
విలోలాయ
గంగాధరలక్ష్మీధరవాణీధరత్రిమూర్త్యాత్మికసర్వదేవతాధిష్ఠానమూర్తయే

వంగబ్రాహ్మణవంశప్రదీపకరత్నాయ 46
వటతరుమూలజన్యసర్వాధ్యాత్మికసారరూపాయ
వరమునిగణవందితచరణారవిందయుగళాయ
వశ్యేంద్రియనికాయప్రభూతశాంతిసామ్రాజ్యాధిపతయే
వందనీయశుభలక్షణలక్షితశరీరాయ
వనితాసువర్ణాదికప్రాపంచికవిషయసుఖవాంఛారహితవినిర్మలచిత్త యుక్తాయ
వరేణ్యస్వాత్మహృదయకుహరాంతర్గతసర్వోత్కృష్టాత్మానందా స్వాదనోన్మత్తాయ
వసుంధరాతలజన్యసర్వమతోద్ధారకగురుమూర్తయే
వహ్నివత్సదాపరమపవిత్రితత్త్వాయ

తేజోనిధానసహస్రారమధ్యస్థాపనోపవిష్టసమాధిస్థితాయ 55
తేజోవిరాజితశక్తికృతసర్వమతసాధనానుభవసిద్ధాయ
తేజఃప్రపూతవికసితవదనారవిందాయ
తేజస్తేజోమూర్తయే
తేజస్స్వరూపబ్రహ్మైకత్వజ్ఞానజన్యపరమానందవిశిష్టాయ
తేజఃప్రావృతభాస్కరాదిదేవతాగణవందితపాదారవిందయుగ్మాయ
తేజోజన్యత్రయఃత్రింశత్కోటిసురవరగణపుణ్యస్వరూపాయ
తేజస్స్వాంతసంభూతశాంతిప్రశాంతావరణయుక్తరాజాయ
తేజస్సాగరతరంగమధ్యశయనానందలోలాయ

రామలాలశిశుపోషణకార్యధురంధరాయ 64
రామచంద్రపదకంజయుగళసేవానిరతాయ

రాగవిరాగాదిసర్వద్వంద్వరూపప్రపంచరహితచిత్తాయ
రాధాభక్తిసుగంధప్రపూతశరీరాయ
రాజాధిరాజసంసేవ్యమానసర్వభోగాతీతసుఖసముదాయసమన్వితాయ
రాజసాదిసర్వప్రాకృతిక గుణవిలక్షణమహిమాన్వితాయ
రామణీయకకమనీయవేదాంతజ్ఞానరసాస్వాదనోన్మత్తభృంగాయ
రాధాగోవిందార్చనతత్పరతాజన్యభక్తిచైతన్యబాష్పయుక్త
చక్షుద్వయాయ
రాస్మణీమణీభక్తిపరిపోషకాయ

మహాదేవీపరాశక్తికాళికాభక్తినిమజ్జనోద్భూతమహదానంద
తన్మయాయ 73
మహనీయగుణగరిష్ఠశిష్యకోటిపరివృతాయ
మధురనాథాద్యనేకరాజసేవకగణసంసేవితపూజ్యపాదాయ
మమతాహంకారాదివిక్షేపావరణద్వయరూపమాయావిదూరస్థితాయ
మత్స్యకూర్మాదిదశావతారజనకమూలకారణపరబ్రహ్మస్వరూపాయ
మథితకామక్రోధాదివైరిషడ్వర్గాయ
మంత్రతంత్రయంత్రాత్మకసర్వతంత్రాగమశాస్త్రోద్ధారకమూర్తయే
మరుమరీచీసామ్యసర్వారిష్టవిషయసుఖవ్యర్థదర్శనాయ
మతమతాంతరసాధనాతీరసన్నివేశాయ

కృష్ణవర్ణవిశిష్టభవతరణీపదకంజయుగళసేవారక్తియుక్తాయ 82
కృపాసుధారసపరిపూర్ణమృదులహృదయాయ
కృత్రిమబాహ్యచారనిబిడీకృతప్రాచీనసంప్రదాయవిచ్ఛేదకాయ

కృపణాధునికప్రపంచపరిరక్షాదక్షయుక్తాయ
కృష్ణమేఘమండలస్థశ్వేతవిహంగదర్శనోద్భూతసమాధిరతాయ
కృచ్ఛ్రసంజనితాఖిలసంసృతికారణసంస్కారదూరస్థాయ
కృతాదిచతుర్యుగబద్ధకాలచక్రనిబద్ధసర్వజీవోద్ధారకాయ
కృష్ణకిశోరదేవమధురామృతప్రేమవీచికాజాలనిమగ్నచిత్తాయ
కృష్ణదర్శనప్రాప్తచిత్తజానందసాగరవిహారాయ

ష్ణాక్షరసూచితషడ్భావవికారశూన్యనిర్వికారతత్త్వాయ 91
ష్ణానిరూపితషణ్మాససహజనిర్వికల్పస్థితాత్మానందనిమగ్నాయ
ష్ణారూపకషట్చక్రోపవిష్టషడ్దేవతాసంసేవితదేవాధిదేవమూర్తయే
ష్ణానిర్దిష్టషోడశకళాపరిపూర్ణాధ్యాత్మికశశిస్వరూపాయ
ష్ణానామకనానాత్వసంపీడితజీవావరణమాయావిచ్ఛేదకాయ
ష్ణాలక్షితనశ్వరమాయాప్రపంచవిషయవిషదూరాయ
ష్ణానిర్ణీత "నేతి నేతీ"తి కృపాణఘట్టితభిన్నసంసారాయ
ష్ణాభావితజ్ఞానశక్తిజనితేచ్ఛాక్రియాశక్తిద్వయయుక్తాయ
ష్ణాంతర్గతషకారసూచితసర్వవిషయవిచ్ఛేదనరూపవ్యతిరేక
తత్త్వనకారయుక్తాయ

యతిగణ సంసేవ్యమానానంతకళ్యాణగుణసంసేవితాయ 100
యమనియమాసనాద్యష్టాంగయోగాధిష్ఠానపురుషోత్తమాయ
యశోవిరాజమానయతికులసంప్రదాయపరిపాలకచక్రవర్తినే
యమునాతీరవిహారికృష్ణపదపంకజజన్యసుధాప్రపాన
భరితోన్మాదచిత్తాయ

యత్నాప్రయత్నసంజనితనానాసిద్ధిసంయుతాయ
యమనలక్షణలక్ష్యసంయమిలోకాదర్శగురుశేఖరాయ
యంత్రసమానలోకనియంతృకార్యపరిజ్ఞానసంయుతాయ
యదృచ్ఛాలాభసంతుష్టసూత్రనియమపరిపాలకోత్తమాయ
యజ్ఞాధిష్ఠానదేవతానికరసంపూజితమహదనుభవానందపరబ్రహ్మణే 108



వ॥ తమ చారిత్ర సుధాతరంగముల నీదన్, నీ మహావాక్య సా
ర మశేషంబుగ గ్రోల, నీదు సుగుణప్రజ్ఞాప్రసారంబులన్
శ్రీమదీరంగ మునుంగ, నీ పసిడితేజంబందునం దేల, వే
రె మనోజ్ఞంబగు మోక్షమెందుగలదో శ్రీరామకృష్ణప్రభూ!

# శ్రీ శారదాదేవ్యష్టోత్తరశత నామావళి





శ్లో॥ రామకృష్ణగురుధ్యానతత్పరాం
శాంతిదాయినీం।
కామకాంచనదూరాంతాంశారదాం
ప్రణమామ్యహం॥

ఓం శ్రీ శారదామణీదేవ్యై నమః
ముఖర్జీవంశోద్ధారకాయై
శ్రీరామచంద్రముఖర్జీసుతాయై
శ్రీ శ్యామసుందరీగర్భముక్తాఫలాయై
బ్రాహ్మణవంశ ప్రదీపికాయై
జయరామవటీవాసాయై
మార్గశిరమాసప్రాధాన్యవ్యక్తీకృతాయై
బహుళసప్తమీసంజనితాయై
శ్రీకాళికాంశసంభవాయై
సహజసౌందర్యశోభితాయై 10
శ్రీ జగద్ధాత్రీపూజామగ్నమానసాయై నమః
దీనజనసేవాతత్పరాయై
అతిసుకుమారహృదయాయై

ఓం పంచవర్షయుక్తాయై
పాణిగ్రహణప్రాప్తాయై
శ్రీ రామకృష్ణకరస్పర్శధన్యాయై
శ్రీ రామకృష్ణప్రాణప్రియాయై
శ్రీ రామకృష్ణచరణకమలఅర్చనాయై
శ్రీ రామకృష్ణపాదార్పితహృదయాయై
శ్రీ రామకృష్ణధ్యానతత్పరాయై 20
ఆవేదనాసంశరితచిత్తాయై
శ్రీ రామకృష్ణసందర్శనోత్సుకాయై
దక్షిణేశ్వరప్రయాణసంసిద్ధాయై
శ్రీ కాళికాదర్శనప్రాప్తానందసంతుష్టాయై
ప్రథమసందర్శనఅత్యాశ్చర్యయుక్తాయై
భయవిదూరాయై
అమితానందభరితాయై
భోగవిదూరజీవనాయై
త్యాగస్వరూపిణ్యై
సుందరవదనారవిందాయై 20
కరుణానిలయాయై
మృదుమధురభాషిణ్యై
అతిసౌమ్యశీలాయై
శ్రీ రామకృష్ణసేవాభాగ్యనిరతాయై
సుశిక్షితాయై
ప్రాపంచికజనమనస్తత్వగ్రహణప్రవీణాయై నమః
మాతృభావనాసంయుతాయై

ఓం గురుచరణారాధనాతత్పరాయై
దైవభావనాస్థితాయై
షోడశవర్షయుక్తాయై 40
షోడశకళాస్వరూపిణ్యై
షోడశీపూజామగ్నాయై
అపరకాళికాదేవ్యై
శ్రీరామకృష్ణఇష్టదేవతామూర్త్యై
శ్రీరామకృష్ణసుపూజితాయై
శ్రీరామకృష్ణశిష్యాగ్రగణ్యాయై
శుద్ధసత్త్వస్వరూపాయై
సగుణారాధనానిరతాయై
అఖండసాధనానిమగ్నాయై
వినిర్మలభక్తి తత్పరాయై 50
భావసమాధిసంస్థితాయై
నిర్వికల్పాద్యనుభవసుశోభితాయై
సగుణనిర్గుణసకలానుభవసంపన్నాయై
గురుహృదయగతభావగ్రహణధురీణాయై
గురువాక్యపరిపాలనాయై
శ్రీరామకృష్ణమహాసమాధ్యనంతరబాధితచిత్తాయై
కాశీబృందావనాదిపవిత్రక్షేత్రనివాసిన్యై
దక్షిణదేశక్షేత్రసందర్శనానందాయై
కమార్పుకూరుగ్రామవాసిన్యై
అత్యుగ్రతపశ్శీలాయై 60
పంచాగ్నిమధ్యతపస్తత్పరాయై నమః

ఓం పంచభూతాధివాసిన్యై
పంచతన్మాత్రాధిష్ఠానాయై
పంచకర్మేంద్రియనిగ్రహాయై
పంచజ్ఞానేంద్రియసంయమనాయై
పంచప్రాణాధిదేవతాయై
పంచభావనిలయాయై
పంచభేదవిదూరాయై
సర్వద్వంద్వసహిష్ణుతాయై
సకలద్వంద్వాతీతాయై 70
తీవ్రవైరాగ్యస్వరూపాయై
సర్వానుభవనిలయాయై
శ్రీరామకృష్ణోపదేశపరిపాలనాయై
సంపూర్ణశ్రీరామకృష్ణార్పితమానసాయై
శ్రీరామకృష్ణకార్యనిర్వహణాసమర్థాయై
దివ్యానుభవప్రదాయిన్యై
కలకత్తానగరవాసప్రముఖశిష్యప్రార్థితాయై
శిష్యవాత్సల్యప్రపూర్ణాయై
అత్యధికమాతృప్రేమవిలసితాయై
అజ్ఞజనోద్ధరణకార్యనిమగ్నాయై 80
పరమానందనిలయాయై
పరాశక్తిస్వరూపిణ్యై
కామకాంచనవిజేత్ర్యై
అహేతుకకరుణాప్రసారిణ్యై
సర్వలోకవంద్యపాదాయై

ఓం సృష్టిస్థితిలయకారిణ్యై నమః
గుణత్రయవిదూరాయై
మూర్తిత్రయసారాయై
శక్తిత్రయనివాసిన్యై
సత్తాత్రయవిభాసితాయై 90
శక్తిత్రయయుక్తాయై
త్రికాలాతీతాయై
అవస్థాత్రయవర్జితాయై
త్రికరణసిద్ధాయై
శరీరత్రయవిదూరాయై
దుఃఖత్రయవినాశిన్యై
జ్వరత్రయవిమోచన్యై
ఈషణత్రయవిధ్వంసిన్యై
భావత్రయాతీతాయై
మతత్రయాంతర్గతాయై 100
శ్రీయోగానందోపదేశప్రదాత్ర్యై
శ్రీఅద్భుతానందధ్యానగమ్యాయై
శ్రీవివేకానందవిదేశగమనాశీర్వాదప్రదాయిన్యై
శ్రీబ్రహ్మానందప్రత్యక్షశక్తిస్వరూపిణ్యై
శ్రీశారదానందఅమృతమాతృమూర్త్యై
శ్రీఅభేదానందస్తోత్రకారణాయై
శ్రీఅనుభవానందహృదయనివాసిన్యై
అనుభవామృతవర్షిణ్యై 108

# శ్రీ వివేకానందస్వామి అష్టోత్తరశత నామావళి



శ్లో॥ విద్యావివేకసంపన్నం
విమలవిజ్ఞానదాయినం।
విశ్వనాథసుతం వందే
వివేకానందస్వామినం॥

ఓం జగద్భ్రాత శ్రీ వివేకానందస్వామినే నమః
సకలజగద్వంద్యాయ
దత్తవంశసుధాంబుధిచంద్రాయ
త్యాగవిరాజితదుర్గాచరణపౌత్రాయ
న్యాయవాదివిశ్వనాథపుత్రాయ
పవిత్రభక్తిప్రపూతభువనేశ్వరీగర్భసంజాతాయ
క్షత్రియవంశోద్భవాయ
మాతృసమర్చితకాశీవిశ్వనాథప్రసాదాయ
దుందుభినామసంవత్సరాయ
పుష్యమాసస్వరూపాయ 10
బహుళసప్తమీసంజనితాయ
సత్సంస్కారపోషకాయ
సర్వప్రపంచాకర్షితవిశాల నేత్రద్వయాయ
సప్తర్షి మండలనివాసాయ

ఓం సప్తమలోకఆగమనాయ నమః
సప్తఅధోలోకవిగర్హితాయ
సప్తఊర్ధ్వలోకవిముఖాయ
సప్తస్వరశోభితసంగీతవేత్త్రే
సప్తద్వీపపరిపాలనాదక్షాయ
సప్తాశ్వరథాధిష్ఠితభానుతేజోమూర్తయే 20
సప్తజ్ఞానభూమికాధిరోహాయ
సప్తమసహస్రారచక్రవిభేదినే
మకరసంక్రాంతిపుణ్యదినసంజాతాయ నమః
మకరరూపమోహవిచ్ఛేదకాయ
నరేంద్రనాథనామాలంకృతాయ
"బిలే" నామాంతరాయ
అపారమాతృభక్తితత్పరాయ
బాలరామాయణప్రోక్త శ్రీరామధ్యానమగ్నాయ
సత్యవాక్యపరిపాలనాసక్తాయ
బ్రహ్మచారిహనుమద్భక్తివిశిష్టాయ 30
అహింసావతారశ్రీగౌతమబుద్ధసందర్శనానందాయ
సమాధినిష్ఠాగరిష్ఠఈశ్వరధ్యానానందప్రమత్తాయ
మందహాసవదనారవిందాయ
హాస్యవిద్యాచతురాయ
ధైర్యసాహసగుణోపేతాయ
సమస్తవిద్యాప్రథమస్థానాధిపాయ
సకలవిద్యాపారంగతాయ
ప్రాచ్యపాశ్చాత్యగ్రంథజ్ఞానసముపార్జితాయ

ఓం భారతీయవేదాంతవిజ్ఞానాకర్షితహృదయాయ నమః
గభీరగంభీరదివ్యవాగ్భూషణాయ 40
భగవదన్వేషణాపరితప్తాయ
యథార్థావేదనాసంభరితచిత్తాయ
బ్రహ్మసమాజాకర్షితమానసాయ
సమాజోద్దిష్టవికేశ్వరోపాసనారతాయ
నిరాకారబ్రహ్మసాధనతత్పరాయ
బ్రహ్మనందవిదూరాయ
దుఃఖోదధిమగ్నాయ
దేవేంద్రనాథపరిప్రశ్నాయ
అసంతృప్తసమాధానగ్రహణాయ
భగవదనుభూతమూర్తిగవేషణాశీలాయ 50
శ్రీరామకృష్ణపరమహంసాయ
దక్షిణేశ్వరనివాసాయ
ఆబాల్యనిత్యసమాధిరతాయ
బాహ్యలౌకికవిద్యావిముఖాయ
ప్రాపంచికజనసేవాదూరాయ
జగన్మాతకాళికామాతృచరణాశ్రయాయ
భవతరణీసందర్శనానందప్రమోదాత్మనే
అగాధఅపారఆధ్యాత్మికసంపద్విభూషితాయ
సకలదేవదేవీప్రత్యక్షదర్శనాయ
సర్వమతసమరసమూర్తయే 60
సర్వసౌభాతృదృష్టియుక్తాయ
సర్వసమత్వప్రబోధితహృదయాయ

ఓం సర్వగుణలోకవందితపాదాయ నమః
సర్వదేవదేవీస్వరూపాయ
శ్రీరామచంద్రదత్తప్రబోధితాయ
శ్రీరామకృష్ణప్రథమదర్శనభాగ్యసంపన్నాయ
అనిర్వచనీయానందసంభరితాయ
గురుప్రబోధితవాక్యపరీక్షాశీలాయ
గుర్వంఘ్రియుగ్మరేణుశిరోధరాయ
గురూపదేశపరిపాలకాయ 70
గుర్వనుగ్రహప్రాప్తనిర్వికల్పసమాధినిష్ఠాయ
సన్న్యాసిసార్వభౌమాయ
అసమానప్రతిభాస్వరూపాయ నమః
ఆసేతుహిమాచలపర్యంతపర్యటనాయ
మహారాజాధిరాజసుపూజితాయ
కన్యాకుమారీసందర్శనభాగ్యాయ
శ్రీశారదాదేవ్యాశీర్వాదగృహీత్రే
ఖండాంతరగమనాయ
చికాగోనగరప్రవేశాయ
అనేకకష్టపరంపరాతీతాయ 80
శ్రీరామకృష్ణదివ్యకరుణాకటాక్షపూర్ణాయ
విశ్వమతసమ్మేళనోపన్యాసవేదికాభూషణాయ
చతుర్థస్థానసమలంకృతాయ
వైదికమతప్రబోధితవిశ్వధర్మసందేశప్రదాత్రే
ధీరగంభీరప్రశాంతస్వరూపాయ
జ్ఞానోత్పన్నగంభీరనిర్మలవాక్ప్రవాహాయ

ఓం అత్యాశ్చర్యమగ్నాయ నమః
ప్రాచ్యపాశ్చాత్యవిజ్ఞానఘనస్వరూపాయ
ప్రాచ్యబ్రహ్మవిద్యావైదుష్యమూర్తయే
పాశ్చాత్యభౌతికవిజ్ఞానవేత్త్రే 90
భారతీయసంస్కృతిప్రతిభాప్రబోధాయ
అఖండవివేకప్రజ్ఞానసంపన్నమూర్తయే
భారతీయవేదాంతధ్వజప్రతిష్ఠాపకాయ
పాశ్చాత్యదేశపండితపామరజనరంజకాయ
అమెరికాఖండప్రజాసందోహవందితాయ
ఆమూలాగ్రక్రైస్తవమతవిజ్ఞానగ్రహణాయ
ఖండఖండాంతరదివ్యజ్ఞానప్రచారాయ
అఖండప్రబోధప్రచారనిమగ్నాయ నమః
దిగ్విజయయాత్రాఫలప్రదాయ
జన్మభూమిభారత దేశాగమనాయ 100
కలకత్తానగరప్రవేశాయ
అఖండప్రజాసందోహసన్మానితాయ
సోదరశిష్యగణపరివేష్టితాయ
శ్రీ రామకృష్ణమఠసంస్థాపకాయ
శ్రీ రామకృష్ణదివ్యమూర్తిప్రతిష్ఠితాయ
శ్రీ కాశికా దేశకార్యనిర్వహణధురీణాయ
స్వస్వరూపానుభవవేదినే
శ్రీ రామకృష్ణపరబ్రహ్మవిలీనాయ 108



# శ్రీ అనుభవానందస్వామి అష్టోత్తరశత నామావళి



శ్లో॥ శ్రీరామకృష్ణకృపాపాత్రం
అంధ్రదేశయతీశ్వరం।
సమామ్యనుభవానందం
మయి సంపూర్ణవత్సలం॥

ఓం శ్రీ అనుభవానందస్వామినే నమః
అకారాక్షరప్రారంభకాయ
అజ్ఞానాహంకారవిధ్వంసకాయ
అవిద్యాగ్రంధివినాశకాయ
అత్యల్పసంతృప్తాయ
అమానుషశక్తియుక్తాయ
అత్యద్భుతమేధాసంపన్నాయ
అమితవాత్సల్యరూపాయ
అంతర్దృష్టిసంస్థితాయ
అనుభవజ్ఞానసంపన్నాయ నమః
కామరాజువంశోద్ధారకాయ
శ్రీ భక్తసింగరిదాసపౌత్రాయ
నియమనిష్ఠాగరిష్ఠశ్రీచెన్నకేశవసుతాయ

ఓం ఆగర్భగృహిణీ శ్రీసరస్వతీపంచమపుత్రాయ నమః
కీలకనామసంవత్సరాయ
సకలకీలక కేంద్రవేదినే
దేవీశరన్నవరాత్రిప్రధానఆశ్వయుజమాసాయ
బహుళపంచమీతిథయే
రోహిణీనక్షత్రజాతకాయ
కన్యాలగ్నప్రదీపకాయ 20
"వాసుదేవముకుంద" నామాయ
పంచవర్షాత్ప్రభృతిభక్తితత్పరాయ
మాతృభక్తిసంయుతాయ
హృదయప్రధానాయ
అపరవిద్యాధీత్రే
ప్రజ్ఞాశాలినే
ఆబాల్యవైరాగ్యరతాయ
లౌకికవివాహబంధవిముఖాయ
ఆబాల్యసాధనరతాయ
చిత్రకళాప్రపూర్ణాయ 30
శిల్పకళాసుశోభితాయ
వాస్తుశాస్త్రవిశారదాయ
హాస్యపరిహాసచతురాయ
బహుగ్రంథపరిశీలనాసక్తాయ
నిత్యానిత్యవివేకశాలినే నమః
సుమధురగంభీరవక్త్రే
మానవగురురహితాయ

ఓం శ్రీ రామకృష్ణగురువిశ్వాసాయ నమః
శ్రీ రామకృష్ణపాదార్పితహృదయాయ
స్వయంశిక్షకాయ 40
శక్తిస్వరూపిణీ శ్రీశారదార్చకాయ
శ్రీ శారదాదేవ్యనుగ్రహసంపాదినే
శ్రీ శారదాసాక్షాత్కార సంపన్నాయ
భక్తిపూరితపద్యగద్యకీర్తనాదిరచయిత్రే
అజన్మబ్రహ్మచారిణే
మానవమనస్తత్వవేదినే
పవిత్రశీలసంపన్నాయ
సర్వస్వతంత్రభావయుక్తాయ
దక్షిణదేశయాత్రారతాయ
శ్రీరామకృష్ణ ప్రసాదిత"శ్రీఅనుభవానంద"నామాయ 50
దేశదేశాంతరపాదచారిణే
ఉత్తరదేశపర్యటనాయ
స్వీకృతసన్న్యాసాయ
కాషాయవస్త్రధారిణే
జటాధరాయ
ప్రాచీనమహర్షిస్వరూపాయ
పరమహంసపరివ్రాజకాయ
సదా మౌనదీక్షానిరతాయ
కోటిజపదీక్షాతత్పరాయ
సదా బాలబాలికాపరివృతాయ నమః 60
కాష్ఠమౌనాదికమగ్నాయ

ఓం నిత్యానందస్వరూపాయ నమః

ప్రసన్నవదనారవిందాయ

నిరంతరగ్రంథపఠనాసక్తాయ

సహజప్రతిభాస్వరూపాయ

ధీరగంభీరమూర్తయే

యథార్థవిషయవ్యక్తీకృతే

నిష్కల్మషహృదయాయ

సర్వసిదమూర్తయే

సిద్ధసంకల్పాయ 70

సకలానుభవసారాయ

బహుజన్మార్జితసకలకళాకోవిదాయ

కళాస్వరూపాయ

మాతృదృష్టిసంయుక్తాయ

మమకారరహితాయ

సర్వసమదృష్టియుక్తాయ

కామకాంచనవిజేత్రే

సర్వసాధనాభ్యాసాయ

క్రమశిక్షణదక్షాయ

సునిశితతత్త్వాయ 80

అత్యద్భుతమేధాశాలినే

ఆంగ్లభాషాకోవిదాయ

ప్రాచ్యపాశ్చాత్యబహుగ్రంథావలోకనాయ

ప్రాచ్యవిజ్ఞానాధిక్యతానిరూపిణే

ఓం భౌతికాభౌతికవిజ్ఞానవేత్రే నమః

భౌతికతత్త్వప్రతిపాదితసిద్ధాంతగ్రహణాయ
పశ్చిమభౌతికవిజ్ఞానప్రస్ఫుటాయ
భౌతికాభౌతికవిజ్ఞానసమన్వయరూపాయ
అభౌతికాత్మతత్త్వాధిక్యతానిరూపిణే
ప్రాచీనాధునికసంప్రదాయఏకత్వవివరిణే 90
ఆర్షసంప్రదాయప్రబోధినే
సనాతనధర్మసముద్ధరణాయ
భవబంధవిమోచకాయ
అసమానప్రతిభాస్వరూపాయ
ఉపదేశపాదపూజాదికవిముఖాయ
నిరాడంబరాయ
ఆశ్రమద్వయనిర్మాత్రే
శ్రీరామకృష్ణ, శ్రీశారదామాత విగ్రహనిర్మాణాయ
శ్రీశారదా, రామకృష్ణ విగ్రహప్రతిష్ఠితాయ
కార్యక్రమనిర్వహణదక్షాయ 100
భయరహితాయ
శరీరభ్రాంతివివర్జితాయ
త్యాగజీవితాదర్శనిరూపిణే
సర్వజనోపయుక్త "సాధన రహస్య" గ్రంథవిరచిత్రే
పామరజనసమ్మోదితాయ
సకలమత సామరస్య ప్రబోధిత
"సర్వ సిద్ధాంత సౌరభ" గ్రంథరాజప్రదాత్రే
పండితజనరంజకాయ
వైశాఖపౌర్ణమీబ్రహ్మీభూత శ్రీఅనుభవానందస్వామినే 108

# శ్రీ రామకృష్ణ అష్టోత్తరశత వ్యాఖ్యానము





శ్రీ మాతాజీ త్యాగీశానందపురి



## ఓంకారస్వరూప శ్రీ రామకృష్ణపరమాత్మనే నమః

ఓంకార స్వరూపుడైన శ్రీ రామకృష్ణ పరమాత్మకు నమస్కారములు.

## 2. "ఓమిత్యక్షరమేతదాదౌ ప్రయుక్తం ధ్యానం ధ్యాయి తవ్యమితి" (అధర్వశిఖోపనిషత్తు....1)

ఓంకారస్వరూప శ్రీ రామకృష్ణపరమాత్మనే నమః

ఈ "ఓం" అను అక్షరము ఆదియందు ప్రయోగింపబడినది. ఇదియే ధ్యానమును, ధ్యానింపతగినదియునై యున్నది. "ఓం" అనగా త్ర్యక్షరయుక్తము. అవియే "అ" "ఉ" "మ" కారములు. ఈ అక్షర త్రయమే ఓంకారముగా ప్రసిద్ధి నొందినది, అక్షరమనగా క్షరము గానిది. అనగా నశింపనిదని అర్థము. ఈ ప్రపంచములో క్షరమును వదలి, అక్షరుని పొందుటకే మానవయత్నము. అదియే సాధన. అందుచేతనే మానవుడు తన నిత్య జీవితమున ననుక్షణము "ఓం అసతో మా సద్గమయ। తమసో మా జ్యోతిర్గమయ। మృత్యోర్మా అమృతం గమయ" అని ప్రార్థన సల్పుచుండును. "ఓ ప్రభూ! ఈ అసద్రూప ప్రపంచము నుండి సద్రూపమునకు నడిపింపుము. అసద్రూపమున గోచరించు

సర్వము అజ్ఞానము, అనగా తమోరూపము. కాన నన్ను అంధకారము నుండి తేజోరూపమునకు గొనిపొమ్ము. మృత్యువు అజ్ఞాన రూపమగుట నీ మృత్యువునుండి అమృతత్త్వమునకు జేర్చుము" అని అశ్రువి బొంద ఆవేదన జెందుచుండును.

ఆ ఓంకారమే నాదము. నాదమవినాశి. నాద బిందు కళలలో నాదమునకే ప్రథమ స్థానము. నాదస్వరూపుడు మహాశివుడు. శంకరుని హస్తమునందుగల ఢమరుకము నాదచిహ్నము. అట్లే కాలస్వరూపిణియు, సృష్టిస్థితిలయకారిణియు, నాదశక్తియునగు కాళికాదేవిగూడ నాద స్వరూపిణియే. ఆమె కంఠమున గల శిరములమాలలో నేబది శిరస్సులు కలవు. ఒక్కొక్క శిరస్సు, ఒక్కొక్క అక్షరమునకు చిహ్నము. అకారాది క్షకారపర్యంత అక్షరముల నొక్కొక్క శిరస్సు, ఒక్కొక్క అక్షరమును బలుకుచుండగా, నది అకార ఉకార మకారసంయుతిమైన ఓంకారనాదముగా శ్రవణగోచరము. ఆ నాదమే సప్తస్వర శోభితమై, పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ రూపమున జతుర్విధ వాగ్రూపమై, మానవుని మనోభావముల వ్యక్తీకరించుచున్నది. ఆ నాదమే శబ్దము. నిత్యమనియే "శబ్దః నిత్య ఏవ స్యాత్" అని జైమినీయ పూర్వ మీమాంసా సూత్రమున వ్యక్తము. ఆ శబ్దము నిత్యమగుటచేతనే తమ తీవ్ర సాధనాపటిమచే మహాత్ములు, నేటికిని భగవద్వాణిని వినగలుగుచున్నారు. కురుపాండవ సంగరమున సంజయుడట లేకున్నను శ్రీ కృష్ణార్జునుల గాంచుచు, శ్రీ కృష్ణపరమాత్మ గీతోపదేశమును శ్రవణము జేసి, వెంటవెంటనే ఆ యా విషయముల ధృతరాష్ట్రునకు దెలుపుట జగద్విదితమే. అదియే దివ్యదృష్టి! అదియే దివ్యశ్రవణము! అదియే దివ్యశక్తి! అదియే దివ్యజ్ఞానము! నాదబ్రహ్మోపాసన గావించినవారికే ఆ దివ్యానుభూతులు! అట్లు, నాద స్వరూపిణియగు కాళికామాయి

వర్తించి, దివ్యజీవితమును గడిపి, దివ్యమయుడై దివ్యజ్ఞానసంపన్ను డైన శ్రీ రామకృష్ణుడు ఓంకారస్వరూపుడే, అట్టి ఓంకారస్వరూపుడైన శ్రీ రామకృష్ణ పరమాత్మకు నమస్కారములు.

## 3. "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ ధ్యేయం సర్వ ముముక్షుభిరితి" (నారాయణ 33, ధ్యానబిందూపనిషత్తు....9)

ఓంకారస్వరూప శ్రీ రామకృష్ణపరమాత్మనే నమః

ఈ "ఓం" అను ఏకాక్షరమే బ్రహ్మము. ఈ బ్రహమే ముముక్షువులచే ధ్యానింపదగినది. ఇట "ముముక్షుభిః" అని అధికారి నిర్వచనము చేయబడియున్నది. ముముక్షువనగా మోక్షాసక్తి గలవాడు. బుభుక్షువన భోజనాసక్తుడు. బుభుక్షువునకు భోజనాదికముచే దమోగుణమభివృద్ధి యగును. దానిచే ప్రాపంచిక విషయాసక్తి జనించును. ఇట్టి లౌకిక విషయాసక్తులకు నిత్య, నిర్వికార, శుద్ధ, బుద్ధ, నిర్మల, నిరంజనమగు బ్రహ్మమలభ్యము.

ముముక్షువునకు సత్త్వగుణము ప్రధానము. సత్త్వగుణముచే విషయములందు వైరాగ్యము కలుగును. విషయదూరులకు సత్త్వ గుణమభివృద్ధిపొంది, "సత్త్వాత్ సంజాయతే జ్ఞానం" (గీత. 14.17) అను చందము బ్రహ్మజ్ఞానము లభించును. బ్రహ్మజ్ఞానము నొందినవారు బ్రహ్మవిదులు. "బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి" (ముండక. 3.2.9.) బ్రహ్మవిదుడు బ్రహ్మమే అగుచున్నాడుగదా!

పైన వచింపబడినరీతి యథార్థ ఉపాసకుడై, పరమ హంసయై, బ్రహ్మవిద్వరిష్ఠుడై, అద్వైతానందామృతపానమత్తుడై, ఆ యానంద

మహోదధి గ్రుంకులిడి, నిర్వికల్ప సమాధిశిఖరము నధిరోహించినట్టి ఓంకారస్వరూపుడైన శ్రీ రామకృష్ణ పరమహంస దేవ పరమాత్మునకు వందనములు.

## 4. 'ఓమితి బ్రహ్మేతి వ్యష్టిసమష్టి ప్రకారేణేతి'

(నారద పరివ్రాజకోపనిషత్తు. ..8.1)

ఓంకారస్వరూప శ్రీ రామకృష్ణపరమాత్మనే నమః

ఈ ఓంకారము బ్రహ్మము. ఆ బ్రహ్మము వ్యష్టి, సమష్టి రూపమున ద్వివిధము. వ్యష్టి యన నేకమనియు, సమష్టి యన యనేకమనియు నర్థము. మానవుడు సమష్టిరూప సంఘమున జన్మించి, సంఘమున జీవించి, సంఘమును సంస్కరింప బ్రయత్నించును. కాని "అణోరణీయాన్ మహతో మహీయాన్" (కఠ. 2.20) అణువుకంటె నణువును, మహత్తులకు మహత్తును అనగా వ్యష్టి, సమష్టి రూపమైన ఆ బ్రహ్మమును గ్రహింపనిదే ఎవరును సంఘ సంస్కర్తలు కాజాలరు. అందుచే నీ స్థూల బుద్ధిగల మానవుడు స్థూలముచే సూక్ష్మమును, అనేకముచే నేకమును, వ్యక్తముచే నవ్యక్తమును, కార్యముచే గారణమును, సగుణముచే నిర్గుణమును, సాకారముచే నిరాకారమును, సావయవముచే నిరవయవమును, సమష్టిచే వ్యష్టినిపొంది, జీవత్వమును బాసి, బ్రహ్మత్వము ననుభవించును.

ప్రథమమున సమష్టిరూప అవతారాదికముల భక్తితో నారాధించి, తన ఆవేదనచే మృదుహృదయుడగును. అంత "ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా" (రామపూర్వతాపినీ. 1.7) ఉపాసకులకొరకు మాత్రమే బ్రహ్మమునకు రూప నిర్దేశము. కాన వ్యష్టిలో సమష్టిని

లయింపజేయును. వ్యష్టి గ్రహణముచే సమష్టి రూప చరాచర జీవ కోటిని "సమదర్శినః" అనురీతి సమత్వమున గాంచగలుగును. ఆ సమత్వముచే ప్రశాంతిః ఆ సమత్వముచే ఆనందముః ఆ సమత్వముచే నిర్వ్యామోహముః ఆ సమత్వముచే నిర్మల ప్రేమః ఆ సమత్వముచే నిరాడంబరతః ఆ సమత్వముచే గంభీర వాణిః ఆ సమత్వముచే నిర్భయ త్వముః పై విధమున సకల దేవతల సమష్టి రూపమున దర్శించి, ఆ సమష్టి దేవతలకు గారణమైన వ్యష్టి బ్రహ్మత్వమును కాళీమాత అనుగ్రహముచేబొంది, అవ్యాజ అనురాగ వాత్సల్యమూర్తియై, శిష్యులకు మాతృమూర్తియై చెల్వొందిన ఓంకారశబ్ద వాచ్యుడగు శ్రీ రామకృష్ణ పరమాత్మకు ప్రణామములు.

## 5. 'ఓమిత్యేతదక్షరముద్గీథముపాసీతేతి'

(ఛాందోగ్యోపనిషత్తు ...1.1.1.)

ఓంకారస్వరూప శ్రీ రామకృష్ణపరమాత్మనే నమః

ఈ ఓంకారాక్షరము నుద్గీథనుగా ఉపాసింపవలెనని మంత్రార్థము. "అథ ఖలు య ఉద్గీథ స్స ప్రణవో యః ప్రణవస్స ఉద్గీథ ఇతి" (ఛాం. 1.5.1.) ఏది ఉద్గీథయో అది ప్రణవము. ఏది ప్రణవమో అది ఉద్గీథ యనియు సుస్పష్టము. ఆ ఓంకారరూప ఉద్గీథయే "ఉద్గీథమేతత్పరమం తు బ్రహ్మ" (శ్వేతా. 1.7) పరబ్రహ్మముగా వర్ణితము. "య ఓంకార స్స ప్రణవో యః ప్రణవ స్సర్వవ్యాపీ యస్సర్వవ్యాపీ సోఽనంతే యోఽనంతో స్తత్పరం బ్రహ్మ" (అథర్వశిర, 4.2) ఏది ఓంకారమో అది ప్రణవము. ఏది ప్రణవమో అది సర్వవ్యాపి. ఏది సర్వవ్యాపకమో అది అనంతము. ఏది అనంతమో అది పరబ్రహ్మముగా, ఏకత్వము

నిరూపితమైనది. అట్టి ఉద్గీథరూప ఓంకార బ్రహ్మమును గ్రహించిన వాడు "జ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ హ వై భవతి" (ఛాందోగ్య. 1.1.) సర్వమున జ్యేష్ఠుడుగ నభివర్ణితము.

"బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి" యని గదా శ్రుతి ఆ ఓంకార రూప బ్రహ్మమును గ్రహించి, బ్రహ్మవిద్వరిష్ఠుడై, సర్వసాధనల జ్యేష్ఠుడై, సకలానుభవముల శ్రేష్ఠుడై, సర్వోన్నతుడై, సర్వలోక వంద్యుడై, ఓంకారస్వరూపుడైన శ్రీరామకృష్ణపరమాత్మకు వందనములు.

**6. 'ఓమిత్యే తదక్షరమిదం సర్వం। భూతం భవత్ భవిష్యదితి సర్వమోంకార ఏవ। యచ్చాన్య త్త్రికాలాతీతం। తదప్యోంకార ఏవేతి'**

(మాం....1నృ.ఉ.తా...., రా ఉ.తా ..)

ఓంకారస్వరూప శ్రీ రామకృష్ణపరమాత్మనే నమః

ఈ "ఓం" అను అక్షరమే యీ సర్వమునై యున్నది. సర్వము అనగా ప్రస్తుతము వ్యక్తరూపముననేగాక అవ్యక్తముగ నున్నదిగూడ అనియు నన్వయము. వ్యక్తరూపమున వర్తమానకాలమును, అవ్యక్తరూపమున భూతకాలమును, వ్యక్తావ్యక్తరూపమున నెట్లుడునో దెలియనట్టిడు భవిష్యత్కాలమును యీ "సర్వ" శబ్దము సూచించుచున్నది. అందుచేతనే "భూతం భవద్భవిష్యదితి సర్వమోంకార ఏవ" భూతభవిష్యద్వర్తమాన త్రికాలములును ఓంకారమే అని శ్రుతి నొక్కి వక్కాణించుచున్నది. అంతియకాక "యచ్చాన్యత్త్రికాలాతీతం తదప్యోంకార ఏవ" త్రికాలములకతీతమైనదియు ఓంకారమే అనియు వ్యక్తీకరించుచున్నది. త్రికాలములచే తెలియబడునది అనిత్యమనియు, త్రికాలాతీత

మైనది నిత్యమనియు నర్థమిందు సుస్పష్టము. ఇట త్రికాలములును ఓం కారమనుటలో సమష్టియు, త్రికాలాతీతముగూడ ఓంకారమనుటలో వ్యష్టియు ద్యోతకము. ఇందు సగుణ నిర్గుణ, ద్వైతాద్వైత, వ్యష్టి సమష్టి, భక్తిజ్ఞానముల ఏకత్వ సమన్వయత్వములు గానవచ్చుచున్నవి.

ఇక శ్రీ రామకృష్ణ దేవుని పవిత్ర జీవిత విధానమున నీ సర్వ సమత్వ, సర్వ సమన్వయములు ప్రత్యక్ష నిదర్శనములు. ద్వైత సాధనలచే నద్వైత సిద్ధిని గాంచిన మహనీయమూర్తి. భక్తితో భగవతి నర్చించి, ఉన్నతాధ్యాత్మిక శిఖరముల నధిష్ఠించిన భగవద్భక్తుడు. సర్వ మతముల గవేషణమొనరించి, తద్రహస్యముల గ్రహించి, అనుభవించిన సమత్వమూర్తి. పవిత్రాధ్యాత్మిక సంపదల గోరి తన దరికేగుదెంచు శిష్యాగ్రగణ్యుల భూత భవిష్యద్వర్తమాన విషయముల దివ్యదృష్టి గ్రహించి, తదనుగుణ శిక్షణ నొసంగగల గురువరేణ్యుడు, అనగా త్రికాలజ్ఞుడు. అట్టి త్రికాలవేత్తయైన ఓంకారరూప శ్రీ రామకృష్ణ పరమాత్మకు నమస్సులు.

## 7. ఓంకార ప్రభవా వేదాః ఓంకార ప్రభవా ప్రభవాస్స్వరాః॥ ఓంకార ప్రభవం సర్వం త్రైలోక్యం సచరాచరమితి॥ (ధ్యానబిందు ...10)

ఓంకారస్వరూప శ్రీ రామకృష్ణపరమాత్మనే నమః

ఓంకారమునుండి వేదములు, ఓంకారమునుండి స్వరములు, ఓం కారమునుండి త్రిలోకములు, ఓంకారమునుండి చరాచరములు పుట్టెనం డనని వివరించి, వేరువేరుగా చెలుపుట అసాధ్యమని "ఓంకార ప్రభవం సర్వం" సర్వము ఓంకారజన్యమని చెలుపుట సమంజసముగా నున్నది.

"ఓంకార ప్రభవా వేదాః" ఓంకారమునుండి వేదములుద్భవించి నవని ప్రథమ స్థానము వేదములకొసంగుట ఆనందదాయకము. మన భారతీయాధ్యాత్మికసంస్కృతికి ఆధారము వేదములు. మన భారతీయ సంస్కృతివైభవమునకు అధిష్ఠానము వేదములు. మన భారతీయసర్వ విజ్ఞానసంపదకు మూలకేంద్రము వేదములు. మన భారతీయసర్వకళ లకు నిలయములు వేదములు. మన భారతీయవైజ్ఞానిక, ఆధ్యాత్మిక, అనుభవసంపదలకాలవాలము వేదములు. ఇట్టి చతుర్వేదములు ఓం కారజన్యములు.

"ఓంకార ప్రభవాస్స్వరాః" ఓంకారమునుండి స్వరము లుత్పన్న ములు, ఓంకారము నాదస్వరూపము. దానినుండి వేద చతుష్టయము జనించినది. ఆ వేదములలో సామవేదము సంగీత పరమైనది. స్వర యుక్తము సంగీతము. సరిగమపదని అనునవి సప్తస్వరములు. అనగా ఓంకారజన్యములైన వేదముల నుండియే సంగీత సాహిత్యాది కళలు వ్యక్తము. అందుచేతనే "కళాప్రపూర్ణ" అనుటలో సామాన్యమగు సంగీత, సాహిత్య, చిత్రలేఖన, శిల్పకళలుగాక అలౌకికాధ్యాత్మిక "జ్ఞాన కళాప్రపూర్ణ" అనుటయే భావ్యమేమో! సామాన్యుల "కళాప్రపూర్ణ" లో నీర్ష్యా సూయాహంకారములు వ్యక్తమగుచుండ నీ "జ్ఞానకళాప్రపూర్ణ"లో ప్రశాంతి నాట్యము సల్పుచుండును. అది ఆనందదాయకము.

అట్లే ఓంకారమునుండి ముల్లోకములు, అందలి చరాచర జీవకోటియు నుద్భవము. అందువలననే ఓంకారమునుండి సర్వము పుట్టొందినదని చివరకు సమన్వయము చేయబడినది.

ఇక సర్వధర్మస్వరూపుడై, ఆధ్యాత్మికానందవిభూతుల గరతలా మలకమొనరించుకొనిన శ్రీరామకృష్ణునకు, సామాన్యమైన కళలు స్వాధీ

నముగుటలో నాశ్చర్యములేదు. చిత్రికాళానై పుణ్యము, దేవతా విగ్రహ నిర్మాణము, విజ్ఞానగ్రహణ ప్రావీణ్యము, గాన మాధుర్యము, నాట్యములు శ్రీరామకృష్ణ దేవునికి జన్మతః జనించిన లక్షణములు. చూచినది చూచినట్లే చిత్రముల చిత్రించెడివాడట. గంగాతటమున, శివ అర్చనకై ప్రతిదినమొక ఈశ్వరుని విగ్రహమును దయారొనరించి, పూజాదికముల నిర్వర్తించి, అపై గంగాజలముల విడిచెడివాడట. ఆయన ఆధ్యాత్మిక విజ్ఞానమునకు పండిత ప్రకాండులైనను పాదాక్రాంతులు కావలసినదే. ఆయన సుమధుర అనుభవపూరిత వాగమృతమును గ్రోలుచు తన్మయత్వమున నీదులాడవలసినదే. ఆయన గానమాధురికి, దక్షిణేశ్వరవాసియైన భవతారిణి ఉప్పొంగి నృత్యము కావింపవలసినదే. అదియే ఆయన ప్రత్యేకత. అట్టి సర్వకళాపరిపూర్ణుడును, ఓంకారస్వరూపుడను అయిన శ్రీరామకృష్ణ పరమాత్మకు వందనములు.

## 8. 'ఓమితి బ్రహ్మ ఓమితీదం సర్వం ఓమిత్యే తదనుకృతి హస్మ వా అప్యో శ్రావయత్యో శ్రావయంతి ఓమితి సామాని గాయంతీతి'

(తైత్తిరీయోపనిషత్తు .... 1.8.1.)

ఓంకారస్వరూప శ్రీ రామకృష్ణపరమాత్మనే నమః

ఓంకారమే బ్రహ్మము. ఈ ఓంకారమనుకరణమని ప్రసిద్ధము మరియు "ఓ శ్రావయ" అని బదులు పలుకుచున్నారు. ఓం అనియే సామగానమును ఉపక్రమించుచున్నారని మంత్రార్థము.

ఈ ఓంకారము సకలమునకు ప్రథమమున చెప్పాబడినది. పూజలన్నిటికి విఘ్నేశ్వరపూజ ముందుగ గావించినట్లు సర్వము యీ

"ఓం" అను యుచ్చారణముతోడనే ప్రారంభమగును. సమస్త మంత్రములకు, సకల నామములకు నీ ఓంకారము ప్రథమమున నుండును. అధ్యయనమునకు ముందుగ ఆచార్యుడు యీ ఓంకారము నుచ్చరించునుగదా! ఓంకారముతో ప్రారంభించుట శ్రుతి సమ్మతమే యగుచున్నది. ఈ ఓంకారము అక్షరరూపమై, పరబ్రహ్మమును తెలుపుటకు బ్రహ్మమువలె అక్షరమై, సర్వాధారము బ్రహ్మమైనవిధమున సర్వవిద్యలకు, సమస్త మంత్రములకు నీ ఓంకారము ప్రథమమై, సర్వాధారమై యున్నది. అందువలననే ఓంకార బ్రహ్మములకు అభేదత్వమును గొన్ని యుపనిషత్తులు ప్రబోధించియున్నవి.

ఈ ప్రపంచమంతయు శక్తిమయమేయై యున్నది. సర్వమునకు శక్తి ఆధారముగదా!

పరల నీ శక్తి, జ్ఞాన ఇచ్ఛా క్రియా రూపములనియు, సాత్విక రాజసిక తామసికములనియు. స్థూల సూక్ష్మ కారణములనియు, శారీరక, విద్యా, మానసికములనియు వెలుగొందుచున్నది. అందు జ్ఞానశక్తి సాత్వికమై సర్వకారణమై, మానసిక శక్తి రూపమున నుండగా, ఇచ్ఛా శక్తి రాజసికమై, సూక్ష్మమై, విద్యాశక్తిరూపమున చెలువొందగా; క్రియా శక్తి తామసికమై, స్థూలమై, శారీరకశక్తి రూపమున తనరారుచున్నది. జ్ఞానశక్తి జన్యములైన ఇచ్ఛా క్రియాశక్తులకు బలమధికము. అట్టివి మహాపురుషులకు సాధ్యము. అందువలననే వారి సంకల్పములు సక్రమముగా నెరవేరి క్రియారూపమున బరిణమించి, మానవులకు శాంతి దాయకములగుచున్నవి. సామాన్య మానవులకు జ్ఞానశక్తి శూన్యమగుటచే, నిచ్ఛ అనగా కోరిక లౌకిక విషయములవెంట బరుగులుపేయ శక్తి క్షీణించి, అసలు ఆ ఇచ్ఛ క్రియలో నెరవేరక అశాంతి కలుగును.

దాసిచే మానవుడు బలహీనుడగును. అందుచేతనే తాంత్రిక గ్రంథములు శక్తికి ప్రథమ స్థానము నిడి, జోహారులర్పించియుండనోపు.

పై విధమున, శక్తికి ప్రాధాన్యత నిడినట్లు, ఆ శక్త్యారాధకునికి గూడ ప్రథమ స్థానము తప్పదేమో! ఆద్యశక్తియు, కాలస్వరూపిణియు, సర్వమున శక్తిరూపమున వెలుగొందు శ్రీకాళికాదేవికి, శ్రీరామకృష్ణుడు బాల్యమునుండి తన హృదయమున ప్రథమస్థానమొసగెను. అందువలననే ఆయన సర్వసాధకులలో ప్రథముడై; సకల సిద్ధులలో ప్రథముడై; సమస్త ఉపాసకులలో ప్రథముడై; సర్వగురువులలో ప్రథముడై; సకల అవతారములలో ప్రథముడై; సర్వ యతీశ్వరులలో ప్రథముడై; సర్వాదర్శమూర్తియై యొప్పుట గాంచనగును. ఓంకారమెట్లు సర్వమునకు ప్రథమమైనదో అట్లే సర్వమానవులలో ప్రథముడై వెలసిన శ్రీరామ కృష్ణునకు నమస్సులు.

## 9. 'ఓంకారం యో న జానాతి బ్రాహ్మణో న భవేత్తు స ఇతి' (ధ్యానబిందూపనిషత్తు... 1^)

ఓంకారస్వరూప శ్రీ రామకృష్ణపరమాత్మనే నమః

సర్వ నామములకు, సమస్త మంత్రములకు మూలము ఓంకారము. ప్రథమమున ఓంకారార్థమును గ్రహించి, పిదప మంత్రార్థమును దెలిసికొనవలెను. అందుచేతనే, ఎవడు ఓంకారమును గ్రహింపడో వాడు బ్రాహ్మణ్యుడు కాజాలడని యీ మంత్రము దృఢముగా పలుకుచున్నది. ఓంకారమనిన బ్రహ్మముగా నిర్వచించినదిగదా!

పై ఎనిమిది మంత్రములలో, ఎనిమిది నామములలో, ఓంకారమే బ్రహ్మమనియు, అది అవినాశి యనియు, దానినుండియే యీ సర్వము

జనించినదని వచించుటచే నీ ఓంకారమునకు మించినది వేరొకటి లేదనియే అర్థము. అందుచేతనే "సర్వే వేదా యత్పదమామనంతి, తపాంసి సర్వాణి చ యద్వదంతి యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి తత్తేపదం సంగ్రహేణ ప్రవక్ష్యే॥ ఓం (కఠ. 2.15) సర్వవేదములు ఏ పదమును పొందు చున్నవో, తపములన్నియు దేనిని వచించుచున్నవో, దేనిని గోరి బ్రహ్మచర్యమున చరించుచున్నారో అట్టి పదమునుగూర్చి నీకు సంగ్రహముగా వచింతును. అదియే ఓంకారమని కఠోపనిషత్తునందు యమధర్మరాజు నచికేతునకు బోధించియున్నాడు. అట్టి పరాగతిని సాధించుటకు బ్రహ్మచర్యయుతుడై, తీవ్ర తపోసాధనం నొనరించి, తత్సిద్ధిని పొందిన శ్రీరామకృష్ణ దేవుడు బ్రహ్మజ్ఞానియేగదా! అట్టి బ్రహ్మవిద్వరిష్ఠుడైన శ్రీ రామకృష్ణ పరమాత్మకు ప్రణామములు.

## 10. నభస్సదృశసర్వవ్యాపకాత్మస్వరూపాయ నమః

"అతతీ వ్యాప్నోతీతి ఆత్మా" సర్వవ్యాపకమైనది ఆత్మయని నిర్వచనము. ఆ యాత్మయే "ఆత్మైవేదమగ్రఆసీత్" (బృహ. 1.4.1) మొదట గలదని శాస్త్రము. ఆ యాత్మ ఏకమైనది, సర్వవ్యాపకమైనది సర్వవ్యాపకమన మానవాళికి తెలియజేయుటకు "ఆకాశవత్సర్వగతశ్చ నిత్యః (శాండిల్య. 2) ఆకాశమువలె సర్వగతమైనదని వచించినది. కాని "ఆత్మనః ఆకాశస్సంభూతః (తై. 2.1.1) అనుటలో నాత్మనుండి ఆకాశము సంజనితముగదా! అన్నిటికి అవకాశము నొసంగునది ఆకాశము. శ్రీరామకృష్ణ దేవుడు ఆత్మానందానుభూతిని పొందుటచే సర్వమతములకవకాశమొసంగి, సకల విషయముల తన విశాలత్వమును బ్రికటించి, విశాల హృదయమున సర్వుల ప్రేమింపగలిగెను. రాగద్వేష రహితత్త్వమే జీవిత పరాకాష్ఠ. అది "సా కాష్ఠాసా పరాగతిః" అను

పరతత్త్వమగు ఆత్మానుభవయుక్తునికే సాధ్యము. అట్టి ఆత్మస్వరూపు డైన శ్రీరామకృష్ణునకు నమస్సులు.

## 11. నవావరణయుక్తసర్వశక్తిస్వరూపాయ నమః

పరాశక్తియు, నాద్యశక్తియు, నగు జగన్మాతను శ్రీ చక్రరూప మున నర్చింతురు. ఆ శ్రీచక్రమునకు "నవ" అనగా తొమ్మిది ఆవ రణలు కలవు. లోకమున నీ తొమ్మిది సంఖ్యకు చాల ప్రాధాన్యము కలదు. తొమ్మిదితర్వాత సంఖ్య లేదు. "మాసానాం మార్గశీర్షోఽహం" (గీత. 10. 35) అని మాసములలో దొమ్మిదవమాసమైన మార్గశిరము నకే ప్రాధాన్యతను శ్రీకృష్ణ భగవానుడును జూపించెను. అంతియకాక చైత్రమాసమున వసంతనవరాత్రుల ప్రారంభించి; భాద్రపదమున గణ పతినవరాత్రులను కలుపుకొని; ఆశ్వయుజమున శరన్నవరాత్రుల దివ్య శక్తి నారాధించి; మాఘమున మహాశివరాత్రియందు సమాధి స్థితుడై; మానవుడు, అమృతత్త్వమును ఏకత్వముతో సాధింపవలయునని ప్రకృ తియే బోధించుచున్నది. జీవుడు. మాతృగర్భమున నవ మాసములు బంధింపబడి, బహిర్గతుడై, నవరసయుతుడై, నవగ్రహ పీడితుడై, నవ ధాన్యముల గ్రహించి, నవరత్నముల ధరించి, శాంత్యానందముల గాంచక, ప్రథమమున వసంత నవరాత్రుల, భక్తితో భగవానుని ఉపా సన జేసి; పిమ్మట భక్తికైనను ఇంద్రియనిగ్రహమవసరమని గ్రహించి, గణపతి నవరాత్రుల జరిపి; ఆ ఇంద్రియ నిగ్రహమునకైనను శక్తి అనుగ్రహము ప్రధానమని భావించి; నవావరణయుక్తమగు మాతృ నవకమును శరన్నవరాత్రుల నర్చించి సర్వశక్తి వంతుడగును. మాతృ మూర్తి అనుగ్రహపాత్రుడైన వానికి ప్రపంచమున నెదురులేదు. అట్టి వానికి బంధములు వైదొలగును.

పై విధమున సర్వ సృష్టి స్థితి లయ స్వరూపిణియైన గాళికాదేవి నారాధించి, ఆ మాతృమూర్తి కృపాకటాక్షవీక్షణములకై బరితపించి, ఆ లోకైకజనని దివ్య దర్శనము బొంది, దివ్యానందమగ్నుడైనవాడు శ్రీరామకృష్ణ దేవుడు. కల్మషయుక్తులకు భయంకరియై, నిష్కల్మషులకు అభయంకరియై, మాతృదృష్టి సంయుతులకు వాత్సల్యమూర్తియై యొప్పు ఆ దివ్యమాతను సందర్శించిన శ్రీరామకృష్ణుడు, తన వ్యావహారిక ధర్మ పత్నియు, ప్రథమ శిష్యురాలును అగు శ్రీ శారదాదేవియందును ఆ జగన్మాతను దర్శించి, ఆమెను పవిత్ర దేవీమూర్తిగ బూజించుటలో నాశ్చర్యము లేదు. అట్టి దివ్యశక్తి సంపన్నుడైన శ్రీరామకృష్ణ గురు దేవునకు వందనములు.

# 12. నరనారాయణాఖ్యజీవబ్రహ్మైక్యోపదేశికాయ నమః

నరుడైన అర్జుననకు, నారాయణుడైన శ్రీకృష్ణపరమాత్మ బోధించినది భగవద్గీత. "జంతూనాం నరజన్మ దుర్లభం" అని ఆదిశంకరులు తమ "వివేకచూడామణి" యందు వ్రాసియుండిరిగదా! వానరరూపమున నుండియు, వానర లక్షణములగు జంచలత్వమును బోనాడుటచే, నాంజనేయుడు శ్రీరామభక్తాగ్రేసరుడై చెలువొందెను. నరుడన మానవుడు. అందును "హృదయ్యపేక్షయా తు మనుష్యాధికారత్వాత్" అను ఉత్తర మీమాంసాశాస్త్రవిధాన హృదయముగలవారికే మోక్షాధికారము. కేవల స్థూలశరీరపోషణ పశుబుద్ధి. చిత్తసంస్కార పోషణ మానవబుద్ధి. అందుచే గురువు నారాయణుడు. స్థూలశరీరమునే ప్రధానముగ భావించి సుఖదుఃఖాది ద్వంద్వచక్రమున బడి, ప్రతిబింబరూపుడై, శరీర లక్షణము

లగు "అస్తి, జాయతే, వర్ధతే, పరిణమతే, అపక్షీయతే, వినశ్యతే" (గర్భోపనిషత్తు)అను షడ్వికారముల నాత్మకనువర్తించుచు, తన, స్వస్వరూపమును మరచి, "పాశబద్ధస్తదా జీవః" (స్కాంద.7) అనురీతి జీవుడు పాశబద్ధుడై ముక్తికై వేదన నొందును. తన ఆవేదనమును భగవంతునికి నివేదించి, ఉపాసించుట భక్తి యగును. నిత్య, సత్య, నిర్వికార బ్రహ్మము "అహం బ్రహ్మాస్మి" తానే అని గ్రహించుట జ్ఞానమగును. జీవత్వమును బాయుటే బ్రహ్మత్వము. ఇట్టి జీవబ్రహ్మైక్యమును సాధించి, ఆ సాధనా విధానమును, శిష్యుల చిత్తప్రవృత్తులకనుగుణముగ నుపదేశించు నేర్పుగల జగద్గురువైన శ్రీ రామకృష్ణ దేవునకు నమస్సులు.

## 13. నవ్యపురాతనసర్వాధ్యాత్మికతత్త్వానుభవ యుక్తాయ నమః

జీవ, బ్రహ్మ, ప్రకృతులను తత్త్వత్రయమును గ్రహించిన వాడు తత్త్వవేత్త. ఇదియే వేదాంతము. తత్త్వత్రయమని వచించుటయే కాని ఉన్నదొక్కటే అదెట్లన "బ్రహ్మ సత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ" అనుటలో సత్యమొక్కటే బ్రహ్మమనియు; జగత్తు మిథ్య అనగా లేనిది ఉండినట్లు గోచరించునదేకాని యథార్థము కాదనియు; తాత్కాలికముగ జీవుడనబడువాడు బ్రహ్మమే అనియు వ్యక్తమగుచుండ, నిక త్రయమునకు అవకాశమెట్లుండును? "ఏకమేవాద్వితీయం" అను శ్రుతిరీతి బ్రహ్మానుభవమే ఆధ్యాత్మికానుభవము. అనుభవమనగా ఆధ్యాత్మికానుభవమనియే అర్థము. ఆ యాధ్యాత్మికతత్త్వమతిప్రాచీనము, అనాదియైనను అది నిత్యనూత్నమైనది. సర్వకాల, సర్వావస్థల, భూతభవిష్య

ద్వర్తమానముల నందరికివి అనుసరణీయము, అనుభవైకవేద్యము. అట్టి పురాతన ఆధ్యాత్మిక విషయములకు నిత్య నూత్నముగను, అట్టి సనాతన వేదాంత విషయముల ఆధునాతనముగను, కాలానుగుణ్యముగా మలిచి, నేటి భౌతిక విజ్ఞానవేత్తలకు అభౌతిక తత్త్వముల గ్రహింపజేసి, అనుసరింపజేసి, అనుభవవింపజేసిన సర్వాధ్యాత్మికానుభవయుక్తుడైన శ్రీ రామకృష్ణ పరమహంస దేవునకు నమస్కారములు.

## 14. నర్తనగానానురాగప్రియనాదబ్రహ్మణే నమః

ఓంకారము నాదస్వరూపము. నాదము సప్తస్వర శోభితము. ఆ సప్తస్వరములు పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరీలయందంతర్గతము. ఆ చతుష్టయమున అవ్యక్తములు కొన్నియు, వ్యక్తములు కొన్నియు కలవు. వ్యక్తములు వాగ్రూపమున బహిర్గతము. అందుచేతనే "వాగ్వై బ్రహ్మేతి" అని వాక్కు బ్రహ్మస్వరూపముగా నభివర్ణితము. నాదో పాసనచే బ్రహ్మము సాధ్యము. ఇదియే ప్రణవ నాదము. "ప్రాణానల సంయోగమువలన ప్రణవనాదము సప్తస్వరములై బరగె" అని భక్తి తత్పరుడై త్యాగరాజు కీర్తించెను. ఆ సంగీతమైనను భక్తివినా నిష్ప్రయోజనమే. అట్టి నాదస్వరూపమునకు, నృత్యగానములు సహకారములు. తన నృత్యసంపదను శ్రీకృష్ణపరము గావించి, పరవశత్వము నొందినది మీరాసాధ్వి. తన గానామృతముచే శృతిలయల మేళవించి, బాహ్యము నకు రాగప్రధానముగా గోచరించినను, అంతరంగమున హృదయముతో అనురాగ ప్రధానముగ దశరథ రాముని గీర్తించి తన్మయత్వము నొందిన వాడు త్యాగరాజస్వామి. తన మధుర వేణుగానముచే భక్తుల హృదయ ముల స్పందింపజేసి, ఆనందింపజేసిన గానమూర్తి నీలమేఘశ్యాముడు. తన నృత్యముచే నందరిని హృదయముల దోచి, త్యాగమును నేర్పిన

నృత్యవిశారదుడు యదునందనుడు. అట్టి నృత్యగానములయందు నిపుణుడై, వానిచే నాదస్వరూపిణి యగు గాళికాదేవినే సాక్షాత్కరింపజేసికొని ఆ భక్తిప్రపూరిత నృత్యగానములచే, దన దరికరుదెంచిన జనసందోహమున కానందతన్మయత్వముల గలిగించిన నాదస్వరూపుడైన శ్రీరామకృష్ణ ప్రభువుకు నమోవాకములు.

## 15. నతజనాఖిలకలుషాంధకారవిచ్ఛేదక ప్రభాన్వితాయ నమః

అంధకారమును నశింపజేయువాడు సూర్యభగవానుడు. "జ్యోతిషాం జ్యోతిః" అని ఆత్మస్వరూపమభివర్ణితము. అట్టి జ్యోతిరూపమగు ఆత్మను పొందినవాడు బ్రహ్మజ్ఞాని, అతడే గురువు. కల్మషాంధకారమును నశింపజేయువాడు ఆధ్యాత్మిక తేజోమూర్తియైన సద్గురువరేణ్యుడు. అందుచేతనే "పాపాటవీ ప్రదహనే హుతభుక్సమానం, మోహాంధకారదళనే హరిదశ్వకల్పం। సంతాపనాశనవిధౌ శరదిందుతుల్యం, జ్యోతిశ్చకాస్తి కిమపి క్షుదిరామగేహే॥" అడవిని దహింపజేయునది అగ్ని. అంధకారమును నశింపజేయువాడు దివాకరుడు, తాపమును దూరీకృతము చేయువాడు నిశాకరుడు. కాని పాపమను అడవిని దహింపజేయుటలో నగ్నిసమానుడును; మోహమను అంధకారమును పారద్రోలుటలో భాస్కరతుల్యుడును; సంతాపమును నశింపజేయుటలో నిందుసమానుడును అయిన, ఒకానొక జ్యోతి క్షుదీరాముని గృహమున ప్రకాశించుచున్నదని శ్రీరామకృష్ణ కర్ణామృతము. శ్రీరామకృష్ణునొక దివ్యజ్యోతిర్మయునిగా నభివర్ణించెను. తన నాశ్రయించినవారి జన్మజన్మాంతర కల్మషములను, మోహాంధకారమును పారద్రోలగల సమర్థుడు శ్రీరామకృష్ణుడు. దృష్టిచే

గొందరికిని, స్పర్శచే గొందరికిని, సంకల్పముచే గొందరికిని, వాక్కుచే గొందరికిని, అంధకారమును నశింపజేసిన ఆ తేజోమయమూర్తి పరమ హంస దేవునకు ప్రణామములు.

## 16. నశ్వరమాయాప్రపంచసర్వదుష్టవిక్షేప విధ్వంసకాయ నమః

"యా మా సా మాయా" ఏది లేనిదో అది మాయ యని మాయా నిర్వచనము. ఈ ప్రపంచము మాయా కల్పితము. లేని మాయచే బుట్టొందిన ప్రపంచము లేనిదేగదా। అందుచేతనే "దుఃఖాలయమ శాశ్వతం" దుఃఖనిలయమును, అశాశ్వతమును అని గీతాకారునిచే నీ ప్రపంచము నశ్వరమని వివరింపబడినది. "సత్యత్వేన జగద్భావం సంసారస్య ప్రవర్తకం। అసత్యత్వేన జగద్భావం సంసారస్య నివర్తకం॥" (ఆత్మోపనిషత్తు), జగత్తు సత్యమని భావించువారికి సంసారము భయంకర పిశాచమువోలె ననేక బాధల గల్పించును. ప్రపంచము నసత్యమని ఎంచువారికి అంతర్ధానమగును. భ్రాంతచిత్తులకు సుఖముగా నుండునవి, సాధకునకు విక్షేపముల గలిగించును. ఆ విక్షేపములకు బాధ నొందిన సాధకుడు, ఆ విక్షేపజాలమును నివారించుకొనుటకు, సద్గురు సమాశ్రియత్వమునకు అపేదన నొందును. ఆ యాపేదన యథార్థమైనచో సద్గురువులభించును, ఆ సద్గురూపదిష్ట సాధనల గావించి బ్రహ్మత్వమును పొందును. కాన. మాయాప్రపంచజనిత దుష్ట సంస్కారవిక్షేపముల విధ్వంసమొనరించి, సాధకులకు సిద్ధిని ప్రసాదింపజేయగల సాధనావతారమగు శ్రీరామకృష్ణ గురుమూర్తికి ప్రణతులు.

## 17. నందముఖారవిందపరిభూతదివ్య జ్యోత్స్నాలంకృతాయ నమః

ప్రాపంచికులకు సుఖదుఃఖములుమాత్రమే కలుగుచుండును. సుఖమునకు వ్యతిరేక పదము దుఃఖము. ఈ సుఖదుఃఖాది ద్వంద్వముల నతిక్రమించినవారికే ఆనందానుభూతి. ఆనందమునకు వ్యతిరేకపదమగోచరము. అందుచేతనే "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" (తైత్తిరీయము), "విజ్ఞానమానందం బ్రహ్మ" (మహోపనిషత్తు), ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" (తైత్తిరీయము) అనియు ఉపనిషత్తులు ఆ బ్రహ్మస్వరూపము నానందముగ గానము చేసినవి. సర్వవ్యాప్త, సర్వాధిష్ఠానమగు బ్రహ్మమునకు "ఆనంద" పదప్రయోగమే గోచరము. ఈ జీవులు దుఃఖస్వరూపులు గాక, "ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే। ఆనందేన జాతాని జీవంతి। ఆనందం ప్రయంత్యభిసంవిశంతి" (తైత్తి. 3.6.1) ఆనందమునుండియే జనించి, ఆనందములోనే జీవించి, ఆనందములోనే మరల లయింతురను సత్యమును జీవులకెరుకపరచి, దుఃఖనివృత్తిని కలుగజేసికొనుమని ఆదేశించినవి మన ఉపనిషత్తులు. అదియే ఆధ్యాత్మికానందము। అదియే ఆత్మానందము। అదియే బ్రహ్మానందము। అదియే అవ్యయానందము। అట్టి నిర్మల బ్రహ్మానందముఖారవిందజనిత దివ్యాధ్యాత్మికచంద్రికలచే నలంకృతుడై, ప్రేమమూర్తియైన శ్రీరామకృష్ణునకు వందనములు.

## 18. నరేంద్రనాథపరిముఖసహస్రాధిక శిష్యపరివేష్ఠితసర్వాధిపతయే నమః

యజమాని సేవకులచే, ధనికుడు పేదలచే, బలవంతుడు బలహీనులచే, బండితుడు పామరులచే, నృపాలుడు మంత్రి సామంతాదులచే గొలువబడుచుండుట సహజమే. కాని యివి లౌకిక సంబంధములు. ఇందు స్వార్థము కలదు. స్వార్థమున్నచో భేదాభిప్రాయములు కలుగును. ఆపై ఈర్ష్యాసూయాదులు పెరిగి దుఃఖము జనించును.

యథార్థ ఆధ్యాత్మిక జీవిత సమ్మేళనమున స్వార్థము లేదు. స్వార్థములేనిచో భేదమే లేదు. అది నిస్స్వార్థ, పవిత్ర ప్రేమ. ఆ నిస్స్వార్థ, నిర్మల ప్రేమకు సర్వులు జోహారులర్పింపవలసినదే। అదియే గురుశిష్యుల ప్రేమ। విడివడుటకవకాశములేని నిష్కల్మష ప్రేమ। ఆ అపూర్వ పవిత్ర సంబంధము యథార్థ గురుశిష్యులకే వ్యక్తము. ఇందు శిష్యులు గురువును వదలి ఉండుట అసాధ్యము. శిష్యుల సంస్కారముల గ్రహించి, ఆధ్యాత్మిక జీవితమున వారి స్థానమును గుర్తించి, దరిజేర్చి, వారికి గ్రమ శిక్షణమొసంగి, సాధనాదుల సక్రమరీతిని జేయించుచు ఆధ్యాత్మిక విద్యను గరపుచు, అనుభవమును ప్రసాదింపగల్గిన గురువరేణ్యుడు; సకల అర్హతల సంపూర్ణముగ నుండిన శిష్యుడు ఏకమైనచో, నా గురు శిష్యుల సంబంధము దివ్యమై తనరారును. జ్ఞానప్రవాహము వారిరువురినుండి సంజనితమై, యథార్థ సాధకులకు ఆత్మశాంతి నొసంగగలదు. అట్టి అర్హులైన శిష్యరత్నములు వివేకానంద, బ్రహ్మానంద, ప్రేమానంద, అభేదానంద, శారదానంద, రామకృష్ణానంద, అద్భుతానందాదులు. ఆ శిష్యులలో ప్రథముడై, ప్రపంచము నుర్రూతలూగించినవాడు వివేకానందస్వామి. అట్టి నరేంద్రాది ప్రముఖ సహస్రముచే నధిష్ఠితుడై, పీఠాధిపతియు, మఠాధిపతియుగాక సర్వాధిపతి యగు శ్రీరామకృష్ణ దేవునకు ప్రణామములు.

## 19. మోక్షవిశిష్టచిత్తజనితానందకందళిత హృదయాయ నమః

మానవుడు కామకాంచనములకు దాసుడు. వాని వలననే రాగ ద్వేషములు కలుగును. వానిచే బంధమేర్పడును. అందువలననే "మమేతి బధ్యతే జంతుః నిర్మమేతి విముచ్యతే" (మహోపనిషత్తు) మమ త్వము బంధహేతువనియు, మమకార రాహిత్యమే ముక్తి యనియు విదితము. మమకారముచే చిత్తము చలించును. "చిత్తే చలతి సం సారః నిశ్చలం మోక్ష ఉచ్యతే" (యోగశిఖ. 6.58) చిత్తచాంచల్యము సంసారముగ, నిశ్చలత్వము మోక్షముగ వివరణము.

సర్వద్వంద్వ, సర్వబంధ, సర్వపాపదూరుడగుటయే ముక్తుని లక్షణములు. అట్టి ముక్తిని సాధించినవాడు శ్రీరామకృష్ణ దేవుడు. ఆ మోక్షవిశిష్టజనితానందముతోకూడిన హృదయముగల మహనీయమూర్తి. శరీరము రోగగ్రస్థమైన సమయములందును మనోనిగ్రహముగల ఆ దివ్యమూర్తి ముఖమున, సర్వవేళల నిర్మలమును, అమాయకమును అగు చిరునగవే నాట్యము చేయుచుండెడిది. అట్టి చిదానంద హృదయుడగు శ్రీరామకృష్ణునకు వందనములు.

## 20. మోదవార్ధిధీతరంగడోలికాతల శనైయు న్మత్తాయ నమః

"బాలోన్మత్తపిశాచవత్" అనురీతి మహాత్ములు, పసిబాలుర మన స్తత్వము గలవారికి పసివారివలెను, ప్రాపంచికులకు ఆధ్యాత్మికోన్మత్తుల వలెను, గోచరింతురు. "బాలో బాలేషు, వృద్ధేషు వృద్ధో, ధీరేషు ధైర్య

వాన్। యువా యౌవనవృత్తేషు, దుఃఖితేషు సుదుఃఖధీః॥ (అన్నపూర్ణ.ఉ)
బాలురలో బాలునివలె, వృద్ధులయందు వృద్ధులవలె, ధీరులయందు ధీరులవలె, యౌవన వంతులలో యువకునివలె, దుఃఖితులయందు దుఃఖితునివోలె నుండుట బ్రహ్మవిదుని లక్షణము. అందరిలో నందరివలె బాహ్యమునకు గోచరించినను, సదా ఆనందమూర్తులై వారు వసింపగలరు. వారి యానందము సాగరమురీతి విశాలమై, అగాధమై, గంభీరమైయుండును. అట్టి సంతోష సంద్రము అందుచేతనే శ్రీమహావిష్ణువు సాగరముపై శయనించి, ఆనందముగా. జీవుల పోషణ భారమును నిర్వహించుచున్నాడు విషయవిముఖుడైన శంకరుడు, ఆనందమహోదధి గ్రుంకులిడి అమృతత్వము నొందుటచేన్మశానవాసియై, నిత్యానందస్వరూపుడగుటచేత నేఆ యానంద సాగరపు టలలు తేల్చుచు ఊయల నూపుచుండును. అట దుఃఖ మభావము గదా! అదే సంసారసాగరమైనచో అందలి సుఖదుఃఖ తరంగములు జీవుల ముంచుచు, దేల్చుచు బాధించుచుండును. ఇందు సంతసమభావము. లౌకికాలౌకికములకు ఎంత వ్యత్యాసము! కాన మోదవార్నిధీ తరంగముల నుయ్యలలూగుచు, ఉన్మాదులవలె ఆనందమొందుచు, ఆనందింపజేయగల వారు ధన్యులు. అట్టి దివ్యానందమూర్తి శ్రీరామకృష్ణ సద్గురుపుంగవునకు నమస్సులు.

## 21. మోహనశక్తియుక్తాష్టప్రకృతిపరివేష్ఠితమహారాజాధి రాజాయ నమః

సర్వాధిష్ఠానమైన బ్రహ్మము నిర్వికారము. ఈశ్వర స్వాధీనము ప్రకృతి. ప్రకృతివశుడు జీవుడు. ప్రకృతిబద్ధుడైన జీవుడు వికారభూయిష్ఠుడు, ప్రకృతిని జయించినగాని వీనికి బ్రహ్మత్వము సిద్ధింపదు.

ప్రకృతి ఒక్కటియైనను నది వివిధరీతుల గోచరము. ప్రకృతి దుర్వి నియోగముచే బంధమును, సద్వినియోగముచే మోక్షమును కలుగుచున్నవి.

'మనోబుద్ధిరహంకారః ఖానిలాగ్ని జలాని భూః ఏతాః ప్రకృతయ స్త్వష్టౌ॥' (శారీరకోపనిషత్తు) మనస్సు, బుద్ధి, అహంకార, ఆకాశ, వాయు, అగ్ని, జల, పృథ్వీరూపమున నీ ప్రకృతి అష్టవిధములు. పంచభూత నిర్మితుడైన మానవుడు, ఆ భూత లక్షణముల గ్రహించి, ఉపాసనచే వానివి సాధించును. సాధనచే నహంకారమును, వివేకముచే మనస్సును, నిశ్చయత్వముచే బుద్ధిని వశపరచుకొని సాధకుడై, క్షమాదికముచే బృథ్విని, స్నేహముచే జలమును, తపోతత్పరతచే నగ్నిని, అహ్లాదముచే వాయువును, సర్వ వ్యాప్త ఆత్మగ్రహణముచే నాకాశమును జయించి, జీవుడు సిద్ధుడై యొప్పారును. అప్పుడే బ్రహ్మత్వప్రాప్తి.

పై విధమున నష్ట ప్రకృతి జయము గాంచినవాడు శ్రీరామకృష్ణుడు. బాల్యమునుండి విచక్షణాజ్ఞానముచే స్వాధీనమనస్కుడై, భగవంతుడొక్కడే నిత్యమను నిశ్చయత్వమును బుద్ధిచే బొంది, శ్రీకాళికాదేవ్యారాధనా, సాక్షాత్కారములచే నిరహంకారియై శ్రీరామ కృష్ణుడు వెలుఁగొందెను. అంతియగాక ద్వైతాద్వైత, సర్వమత సాధనా సమన్వయమును విశాలత్వముచే నాకాశభూతమును; సర్వులకు అహ్లాదమొసంగుటచే వాయుభూతమును; ఉగ్రసాధనల బవిత్రతేజోమూర్తి యగుటచే నగ్నిభూతమును; ఎల్లర ప్రేమ వాత్సల్యముల గాంచుటచే జలభూతమును; దుష్టుల గూడ దరికిజేర్చు క్షమామూర్తి యగుటచే బృథ్వీభూతమును వశమొనర్చుకొని, శ్రీరామకృష్ణుడు పంచభూత విజయమును సాధించెను. అట్లు జయమొంది, అష్ట ప్రకృతి పరివేష్ఠితుడై, నిర్మోహుడై, అధ్యాత్మిక సార్వభౌముడై తనరారిన శ్రీరామకృష్ణ దేవునకు బ్రణామములు.

## 22. మోక్షలక్ష్మిసంపాదితసర్వాధ్యాత్మికసాధనాను భవ సంపత్స్వరూపాయ నమః

లౌకిక సంపద అశాశ్వతము. కాని అధ్యాత్మిక సంపద శాశ్వత మైనది. ఆ యాధ్యాత్మికైశ్వర్యము తరగనిది. అది సర్వాధ్యాత్మిక సంపద; అది ద్వైత, విశిష్టాద్వైత, అద్వైతమత సాధనా జన్యము; అల్లే మహమ్మదీయ క్రైస్తవమత సామరస్యమువలన కలిగిన సమతాసంపద; అది, సర్వదేవదేవీ సాక్షాత్కారమువలన కలిగిన ఐక్యసంపద; ఆ సంపదకు దినదినాభివృద్ధియే; ఆ సకలాధ్యాత్మికైశ్వర్యము మోక్షసంపాదితము. ఆ మోక్షము నిర్మమత్వముచే సాధ్యము. ఆ మమకారరాహిత్యము విషయ విముఖతచే లభ్యము. ఆ విషయవైమనస్యము వైరాగ్యముచే గలుగును. ఆ వైరాగ్యము యథార్థ వివేకసంజనితము. ఈ విధముగ వివేక వైరాగ్యములచే సమస్తమును గ్రహించి, సకలాధ్యాత్మిక సాధనల గావించి, సిద్ధినిబొందిన అనుభవసంపత్స్వరూపుడును, అనుభవావతారుడునునైన మన శ్రీ రామకృష్ణ గురుదేవునకు వందనములు.

## 23. మోహాపృష్పసుతసదృశనిస్సారప్రపంచనిఖిల వ్యామోహ బంధవిధ్వంసకాయ నమః

ఈ ప్రపంచము గగనకుసుమమువంటిదనియు, వంధ్యా పుత్రుని వంటిదనియు శాస్త్రవచనము. ఆకసమున పుష్పము, గొడ్రాలి సుతుడును లేనట్లు యీ మాయాప్రపంచము భ్రాంతిచే గోచరమే కాని యథార్థము కాదు. సారరహితమీ లోకము. ఈ లోకమునందలి విషయములును సారహీనములే. కాన నీ నిస్సార ప్రపంచ వ్యామోహ బంధముల చేధింప సాధకుడు కృషి సల్పును. సర్వబంధ వినాశకుడు బ్రహ్మవిదుడు

'భిద్యతే హృదయగ్రంథిశ్ఛిద్యంతే సర్వసంశయాః। క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే॥' (యోగశిఖ. 6-45) ఆ పరాత్మను దర్శించినవాని హృదయ గ్రంథులన్నియు ఛేదింపబడుచున్నవి. వాని సర్వ సంశయములు నశించుచున్నవి. వాని సర్వకర్మలును క్షయించు చున్నవిగదా। తన బంధములనేగాక యోగ్యులై, తన నాశ్రయించినవారి బంధ సముచ్చయమునుగూడ నశింపజేయు శక్తిసామర్థ్యములు గల వాడు శ్రీరామకృష్ణ దేవుడు. ఆ సర్వబంధ విధ్వంసమూర్తికి నమస్సులు.

# 24. మోచకసంస్కారతత్త్వపరిశీలనానుగుణోపదేశ ప్రదాత్రే నమః

'మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే। యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః॥' (గీత. 7.3) వేయిమంది మానవులలో సిద్ధికై యత్నించువాడు ఒక్కడు. అట్లు యత్నించు వేయిమందిలో నొక్కడుమాత్రమే నన్ను తత్త్వత" గ్రహించునను శ్రీకృష్ణ భగవానుని వాక్యములు ఎంతయు యథార్థములు.

తనను తాను విగ్రహించుకొనుట సులభమే. ఒక్క అనుభవమును పొందుటయు సులభమే. కాని అట్టి స్థితిని వీరు పొందగలరా. లేక దుష్ట సంస్కారములున్నవా, తన్నివారణోపాయమేసాధనచే గలుగునో గ్రహించి, బోధించి, ఉత్తీర్ణత కలుగజేయుట అంత సులభము కాదు. సామాన్య గురువులకు సాధ్యముకాదు. సకల దేవతా సాక్షాత్కారము నొంది, అద్వైతసాగరమున నీదులాడి, ఆశ్రితుల వంశపరంపరను, పూర్వజన్మగత రహస్యముల గ్రహించి, ఎవరికి, ఏ మంత్రము, ఏ సమయమున నుపదేశింపదగునో దెలిసికొని, తదనుగుణోప

దేశము గావించుట ఒక్క శ్రీరామకృష్ణదేవునకుమాత్రమే సాధ్యమనుట యందాశ్చర్యము లేదు. అట్టి జగద్గురు లక్షణములు శ్రీరామకృష్ణుని యందు పుష్కలముగా నున్నవి. ఆయనకవి కాళీప్రసాదితములు. అందు చేతనే. ఆయన శిష్యులు గురుపుంగవునివలె ఒక్కొక్కరు ఒక్కొక్క సాధనజేసి, తత్సిద్ధిని పొందియుండిరి. శ్రీరామకృష్ణుని శిష్యులలో శక్తి, శివ, రామ, కృష్ణాది సగుణోపాసకులేగాక అద్వైతానుభవసంపన్ను లును గోచరము. శిష్యులకు తెలియకయే వారిని విషమ పరీక్షల గావించి, వారి సత్సంస్కార పుంజములకు మోదమంది, అనుగుణోపదేశమును ప్రసాదించిన ప్రశాంతమూర్తి శ్రీరామకృష్ణునికి వందనములు.

## 25. మోదప్రమోదాత్మకసువర్ణతేజోపుంజప్రసరణ మూర్తయే నమః

'యద్భావం తద్భవతి' అని సూక్తి. 'తం యథా యథోపాసతే తథైవ భవతి' (ముద్గల. 3) ఎట్లు ఉపాసించునో అట్లే అగుననియు; 'యం భావం దర్శయేద్యస్య తం భావం స తుపశ్యతి' ఏ భావమున జూచునో ఆ భావమునే గాంచుననియు, శ్రుతులు బోధించుచున్నవి. 'యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహం' (గీత. 4.11) అని కృష్ణ పరమాత్మయు వచించియుండెనుగదా! మనోగత భావములు, వాగ్రూపమున నా భావతరంగములనే ప్రసరింపజేయును. ఆ యా వృత్తుల నిర్వహించువారికి, ఆ యా భావములే వ్యక్తమగుట జగద్విదితము. దుఃఖ భావములు మనపై ప్రసరించి మనల దుఃఖితుల గావించును. భక్తులను గాంచిన, వారి భక్తి భావములు మనకు తాత్కాలికముగనైనను భక్తిని ప్రకోపింపజేయును. అట్లే ఆనందమూర్తుల సన్నిధినుండుచో, వారి ఆనందతరంగములు మనపై ప్రసరించి ఆనందమును కలిగించునుకదా!

ఆ యానందాత్మక కాంతిపుంజము ఎల్లప్పుడు ప్రసరించుచుండును. ఆ కాంతికిరణ సంచయము ప్రాపంచికులకు చండప్రచండ భాస్కరునివలె బాధాకరమగుచుండ, సాధకులకు శీతలకిరణోపేతుడైన చంద్రునివలె ఆనందదాయకమగును. ఆ యానందతేజోపుంజము సర్వులపై బ్రసరించుచున్నను అందఱును గ్రహింపలేరు. 'దివా పశ్యతి నోలూకః, గుడ్లగూబ పగలు చూడలేదనుచందమున మోహాంధకార మగ్నులైనవారు ఆ మహాత్ముల దర్శింపలేరు.

శ్రీరామకృష్ణుని అపూర్వ సాధనావిధానముచే నాయన శరీరముగూడ దివ్యకాంతిని ప్రసరింపజేయుచుండెడిదట! ఆ దివ్యమూర్తిని ఒకపరి దిలకించినవారి మనస్సుల నా మహనీయుని దివ్యస్వరూపము శాశ్వతముగ నాకర్షించెడిది. ఆ చిరునవ్వు చిందుముఖము, ఆ అమాయకత్వము, ఆ భక్తి పారవశ్యములు మరపురానివై యుండుటచే, ప్రజానీకము ఆయనను జూచుటకు దక్షిణేశ్వరమున కరుదెంచుటలో నాశ్చర్యములేదు. అదియే ఆధ్యాత్మిక సౌందర్యప్రకాశము. అట్టి ఆధ్యాత్మిక కాంతిని ప్రసరింపచేయు శ్రీరామకృష్ణునకు ప్రణామములు.

## 26. మోహితవిశ్వమానవోద్ధరణకార్యదీక్షా దక్షాయ నమః

ప్రతివ్యక్తికి పట్టుదల సహజముగ నుండును. దానినే దీక్ష అందురు. కార్యదీక్ష కలవాడనికూడ అనుట పరిపాటిగదా! అర్థరహిత పనులయందును. పరులను బాధించుటయందును కొందరికి పట్టువదలని కార్యదీక్ష వుండును. కాని సత్కార్యదీక్ష అందరికి లభింపదు. మరియు నీ అజ్ఞ జనోద్ధరణను అందరు చేయజాలరు. ప్రథమమున తనను తాను

ఉద్ధరించుకొనవలెనని, 'ఉద్ధరేదాత్మనాత్మానం' (గీత. 6.5) అని గీతా వచనము. స్వయంతీర్ణః పరాంస్తారయతి' తాను తరించి, యితరుల దరింప జేయవలయునని విజ్ఞుల నుడి. కాని అజ్ఞమానవోద్ధరణ కార్యమును బూనువారు ప్రథమమున నీ సర్వ ప్రపంచవ్యామోహముల బోనాడవలెను. అప్పుడు వారు మోహముల ఛేదించు నుపాయముల బోధింపగలరు.

ఈ ప్రపంచమున అజ్ఞులధికము. ఇది సహజమే. నాయకు డొక్కడు, అనుచరులనేకులు. తల్లి ఒక్కతె, బిడ్డలనేకులు. వంట చేయువాడొక్కడు, భుజించువారనేకులు. చంద్రుడొక్కడు, నక్షత్రము లనేకము విజ్ఞుడొక్కడు, అజ్ఞులనేకులు గురువర్యుడొక్కడు, శిష్యులు బహుళము. భగవంతుడొక్కడు, భక్తులనేకులు, ఈ విధ ముగ విచారించి చూచిన నీ ఏకానేకసమ్మేళనమే యీ సర్వ ప్రపంచము. కాన, నీ విశ్వమోహిత మానవాళి నుద్ధరించు కార్యమున దీక్షబద్ధులై, అందు దక్షులైనవారు భగవదాదేశమున జన్మించి, ఆ కార్య మును నిర్వహింపగలరు. కేవల పాండిత్య,ఉపన్యాస, ఉపదేశాదికముచే లోకముసుద్ధరింప బూనుట హాస్యాస్పదము. అట్లు భగవతీ కాళికా దేవ్యనుగ్రహ సంజనితుడై, ఆమె ఆదేశమునకు బద్ధుడై, సమర్థుడై, మానవోద్ధరణకై దీక్షకంకణధారియైన శ్రీరామకృష్ణదేవునకు నమోవాకములు.

## 27. మోక్షానందరూపపరిభావిభాసితాయ నమః

మోక్షమానందదాయకమనియే శాస్త్రవచనము. శాస్త్రోక్తియే కాదు సుఖదుఃఖాతీతులై, సమదృష్టి కలిగి, నిత్య మానందమగ్నులై, తమ ప్రేమామృతవృష్టిచే నెల్లరను ఆనందింపజేయు చుండుట మహనీయుల జీవితమున గోచరించుచున్నదిగదా! ప్రాపంచికబంధవిముక్తులే యింత ఆనందముగ నుందురేమో యను భావన మనకు కలుగును. నిత్యతృప్తులై,

ఆశారహితులై యుండువారికెవ్వరును సాటిరారు. కాని, నేటి ప్రపంచ మున దేవుడు లేడని, ముక్తి లేదని ఎన్నివిధముల ప్రచారము సల్పినను. ఆ మహనీయులకు గల శాంత్యానందములుగాని, సమత్వముగాని, త్యాగవైరాగ్యములుగాని మనకు లేకుండుటచే నీర్ష్యాసూయామగ్నమాన సులమై, ప్రపంచమునకశాంతిని, సందేహములను కలిగించుచు, పలు బాధలకు గురియగుచుంటిమి. కారణము క్రమశిక్షణ లేకుండుట: శాస్త్రా ధ్యయనము గురువులవద్ద చేయకుండుట: సాధనాదులసలే లోపించుట! అట్లుకాక పరంపరావ్యాత్మికవిద్య నభ్యసించి; అనుభవమును గడించి, ఆ మోక్షముచే నానందరసాస్వాదనరూప కాంతిచంద్రికలచే ప్రకాశించు నా శ్రీరామకృష్ణ ప్రభువుకు ప్రణామములు.

## 28. భక్తరక్షాదక్షసర్వశక్తిసంపన్నాయ నమః

భక్తరక్షణ భగవంతునిదిగదా! రక్షణ అందరికి సాధ్యముకాదు. అది ఒక్క భగవానునిదే! లేక భగవదవతారమూర్తిదే: అట్టి భగవదవ తారమూర్తికాననే 'అవతారవరిష్ఠాయ' అని శ్రీరామకృష్ణుని అవతార వరేణ్యునిగ శ్రీ వివేకానందస్వామి స్తుతించుట సమంజసమే. గయాధి నాథుడు శ్రీ మహవిష్ణువు, కమార్పుకూరు వృద్ధేశ్వరుల సమైక్యరూపమున జన్మించినవాడు శ్రీరామకృష్ణుడు. ఆయన భగవత్త్వమునాయన జీవిత కాలముననే అనేకులు దర్శింపగలిగిరి.

దక్షిణేశ్వరీ కాళికాలయ నిర్మాణమొనరించినది రాణీ రాస్మణి. ఆమె జామాత మధురనాథ విశ్వాస్. అతడును దేవీ భక్తుడు. శ్రీరామ కృష్ణ దేవుని భక్తితత్పరతకుపొంగి, ఆయన సర్వసాధనలకు, సర్వదా

సకల సదుపాయముల నొనగూర్చిన పుణ్యశీలి. ఒకపరి మధురనాథుడు శ్రీరామకృష్ణుని దర్శనార్థము దక్షిణేశ్వరమున కేగుదెంచెను. శ్రీరామ కృష్ణుని గదికి ఎదురుగ మధురనాథుని కుటుంబమువారికొక గృహము కలదు. ఆ గృహమునకుగల వరండాలో మధురనాథుడు కూర్చుండి యుండెను. ఆ సమయమున గురుదేవుడు, తన గదిముందు వరండాలో నటునిటు బచారు చేయుచుండెను. అట్లు బచారొనర్చుచుండిన శ్రీరామ కృష్ణుని, మధురనాథుడు తదేకదృష్టితో జూచుచుండెను. గురుదేవుడు, కుడిప్రక్కకు తిరుగుచుండిన సమయములో దక్షిణభాగమున నీశ్వరుని, ఎడమప్రక్కకు తిరుగు సమయమున వామభాగమున మహేశ్వరినిగాంచి, వెంటనే ఆ యర్ధనారీశ్వరస్వరూపుని జేరి పాదాక్రాంతుడయ్యెను. నాటి నుండి మధురనాథుడు శ్రీరామకృష్ణుని శివశక్తియుక్తునిగ గ్రహించి, ఆ మహనీయునితోధికముగ ప్రేమించి గౌరవింపసాగెను.

అరువది నాలుగు తంత్రసాధనల నారిదేరి, శ్రీరామకృష్ణునికి దంత్రరహస్యముల బోధించుటకు, గాళికాదేవి యాజ్ఞానుసార మేతెంచిన సన్న్యాసిని భైరవీబ్రాహ్మణి. ఆమె ఇష్టదైవము శ్రీరామచంద్రుడు. ఆమె తన దైవము నర్చించుకొని, ఆ మూర్తి ఎదుట నివేదన పదార్థ ముల నిడి, గన్నుల మూసికొనెను. తన గదియందు ఆసీనుడైన శ్రీరామకృష్ణుడు మెల్లన లేచి, ఆ ప్రదేశమును జేరి, ఆ నివేదితాన్న మును భుజింపసాగెను. అంతలో, భైరవీబ్రాహ్మణి గన్నుల దెరచి జూడ, ఆమెకు దన ఆరాధ్యదైవమైన శ్రీరామచంద్రుడు శ్రీరామకృష్ణు నిలో గోచరింప, సాశ్రునేత్రయై, తన యిష్టదైవ మీ రూపమున సంచ రించుచుండినట్లు గ్రహించి దివ్యానందమనుభవించెను.

అట్లే, ఒక బాలుడు పంచవటియందు ధ్యాననిమగ్నుతినుండ, శ్రీరామకృష్ణుడటకేగి, అతడితో 'అబ్బాయీ: నీ ఇష్టదైవము నేడు

మానవాకారమున నహబత్ ఖానాలో నున్నది. ఆమెను సేవించుచో నీకు సర్వము లభింపగల'దని బలికెను. ఆ నాలుడే తర్వాత శ్రీ అమ్మ తానరిన స్వామియై విరాజిల్లెను.

పై విధమున భక్తుల రక్షించి, అనుగ్రహించుటలో సర్వశక్తి సంపన్నుడును, భగవంతుడునైన శ్రీరామకృష్ణ పరమహంస దేవునకు వందనములు.

## 29. భక్తిభాగవతభగవదాఖ్యత్రిపుటీ స్వరూపాయ నమః

ఈషణ త్రియము మానవునికి బంధహేతువు. అవియే ధన, దార, లోకేషణములు. అట్లే సత్త్వరజస్తమోగుణ త్రియమున రజస్తమములు బంధకారణములు. కాన సాధకుడు ఈషణత్రియములనుండి విడివడి; గుణత్రియమున సత్త్వమును పొంది; త్రిమూర్తుల నారాధించి; జ్ఞానేచ్ఛాక్రియా శక్తిత్రియమున జ్ఞానశక్తి నార్జించి; భూతభవిష్యద్వర్తమాన కాలత్రియమున వర్తమాన కాలమును గ్రహించి; ధ్యాతృ, ధ్యాన ధ్యేయముల, జ్ఞాతృ, జ్ఞాన జ్ఞేయ తత్త్వముల దెలిసికొని; ప్రారబ్ధ, ఆగామి, సంచితరూప కర్మత్రియయును నశింపజేసికొనును. ఈ పై సాధనావిధానము సక్రమముగ సాగించి, సిద్ధిని బొందవలయునన్న భగవదనుగ్రహము ముఖ్యము. అందుచే నీ భక్తి, భాగవత, భగవంతుడను త్రిపుటియందు మొదట భక్తిని గ్రహించి, తదుపరి భక్తుడై, అట భగవంతుడగును. అట్టి అనన్యభక్తిచే బరాశక్తియగు శ్రీకాళికాదేవి నర్చించుట; భగవతీ దర్శనము గాంచుట; తానే ఆ యథార్థ భక్తునిగా

చెలువొందుట; యను త్రిపుటీ స్వరూపమును సాధించినవాడును. త్రిపుటీ స్వరూపుడునునైన శ్రీరామకృష్ణ భగవానునికి నమస్కారములు.

## 30. భక్తిజ్ఞానవైరాగ్యాత్మికాధ్యాత్మికమార్గోప దేశికాయ నమః

భక్తి జ్ఞాన వైరాగ్యోపేతమైనదే ఆధ్యాత్మిక మార్గము. ఈ త్రియము లేనివాడు ఆధ్యాత్మిక గమ్యమును బొందజాలడు. ఇవి లేనిచో వాడుపదేష్ట కాజాలడు. భక్తి, జ్ఞాన ద్వయమునకు వైరాగ్యము పునాది. భగవంతునియందు మనస్సు లగ్నము కావలయుననిన ప్రపంచముపై విరాగము తప్పక కలుగవలయును, అప్పుడే భగవద్దర్శనము. అట్టి తీవ్ర వైరాగ్యోపేతుడై, శ్రీరామకృష్ణుడు ప్రథమమున గాళికాదేవిని, సీతారాములను, రాధాకృష్ణులను, ఆంజనేయుని సాక్షాత్కరింపజేసికొని ఆదర్శ భక్తుడై చెలరారెను. అంత సమస్తమును త్యజించి, తోతాపురీ శిష్యరత్నమై, జ్ఞానమునొందుటకు యత్యాశ్రమ స్వీకరణము గావించి, ఆధ్యాత్మికావధియగు నిర్వికల్పసమాధ్యనుభూతిని పొంది అత్యద్భుత జ్ఞానిపుంగవుడై యలరారెను.

ఒకపరి, మధురనాథుడు, తన యావదాస్తిని భక్తిపూర్వకముగ శ్రీరామకృష్ణున కొసంగనెంచి గురుదేవునెంతయో ప్రార్థించెను. కాని శ్రీరామకృష్ణుడు అందులకియ్యకొనలేదు, సరికదా 'ఈ ధనమే నిత్యమైనచో నా జన్మస్థలమగు కమార్పుకూరుగ్రామమునకే బంగారు తొడుగు చేయించెడివాడను' అను ఆయన వైరాగ్యజనిత వాక్యములు, సాధక లోకమునకు సర్వాదర్శకములు. అంతటి త్యాగధనుడు ఆ మహనీయుడు. అట్టి భక్తి, జ్ఞాన, వైరాగ్యసమరసమూర్తి కావననే ఆధ్యాత్మిక మార్గోపదేశకుడయ్యెను. ఆ పరమహంస గురువరేణ్యునకు ప్రణామములు.

# 31. భక్త్యున్మత్తమూర్తిశ్రీకృష్ణచైతన్యావతారాయ నమః

ప్రాపంచికులకు భక్తులు, జ్ఞానులు పిచ్చివారివలె గోచరింతురు. అందుచేతనే శ్రీరామకృష్ణుడు దేవీ దర్శనార్థము దుఃఖించు సమయమున ఆయనకు పిచ్చిపట్టినదని జనులు భావించెడివారు. 'ఒకడికి మదోన్మత్తత, వేరొకడికి ధనపిచ్చి, మరియొకనికి వస్తుపిచ్చి, నాకు దేవునిపిచ్చి. ప్రపంచమున నందరు పిచ్చివారలే' అని శ్రీరామకృష్ణ దేవుడు చమత్కరించెను. లౌకికపిచ్చి అశాంతిని కలిగింప, భక్తుని పిచ్చి ఆనందింప జేయును. ఇదియే వ్యత్యాసము.

అట్లు, తీవ్రభక్తిచే ఉన్మత్తుడై, నందకిశోరుని గీర్తించుచు, నృత్యము నల్పుచు, కృష్ణవియోగముచే, విరహముచే బాధనొందుచు, పరితపించు మహాభక్తుడు నవద్వీపవాసియైన శ్రీకృష్ణ చైతన్య మహా ప్రభువు. సర్వత్ర ఆ శ్రీకృష్ణ పరమాత్మనే దర్శించు అవతారవరేణ్యుడు. ఆయన భక్తి పరాకాష్ఠ నొందినది.

ద్వాదశవర్ష ప్రాయమున దీవ్ర విరాగముచే విలువెడలి, అరణ్యముల జేరి, తీవ్ర తపమొనరించి, ఇరువది యైదవ వత్సర ప్రాయమున గలకత్తకు జేరి, శ్రీరామకృష్ణునిగురించి విని, దక్షిణేశ్వరమునకరిగి, శ్రీరామకృష్ణుని ప్రథమమున దర్శించి, ఆ కృష్ణ చైతన్యుడే యీ శ్రీరామ కృష్ణుడను అనుభవము గాంచినది శ్రీ గౌరీమాయి యను బాల సన్న్యాసిని. తర్వాత, ఆమెయే శ్రీ శారదామాయి శిష్యురాలై, విదుషీమణియై, శ్రీ శారదేశ్వరీ ఆశ్రమమును స్థాపించి, శ్రీరామకృష్ణునితో ననేక స్థలములకు వెడలుచుండెడిది.

పై విధమున, భక్త్యున్మత్తుడును శ్రీకృష్ణచైతన్యస్వరూపుడైన శ్రీరామకృష్ణునకు వందనములు.

## 32. భవసాగరతరణోపాయనిధానస్వరూపాయనమః

'పునరపి జననం పునరపి మరణం పునరపి జననీ జఠరేశయనం' అను ఆదిశంకర విరచిత భజగోవింద శ్లోకమురీతి, సామాన్య మానవులకు జననమరణముల గ్రిమము తప్పదు. ఈ భవసాగరము అంతులేనిది. ఈ భవసంద్రిమునుండి, తప్పించుకొనుటకు భగవంతుడొక్కడే శరణ్యము. ఈ శరీరమను నావను పుణ్యధనముచే సంపాదించుకొనిన మానవుడు, దీనిని భవసాగరమును దాటుటకై వినియోగించుకొనుచున్నాడు. కాని, దీనికి నవరంధ్రిములు గలవని మరచి, వాని మూయకయే సముద్రమున దింపి, తీరమును చేర యత్నించుచున్నాడు. ఆ నవరంధ్రిముల ద్వారా లోపలికి విషయాసక్తియను నీరు చేరి, పడవను ముంచుచున్నది. అట్లుగాక నవరంధ్రిముల బంధించి అనగా ఇంద్రియనిగ్రిహముజేసి, లౌకిక విషయములను జలమును లోన చేరనీయకున్నచో నావ తేలుచుండును. అప్పుడది భగవదనుగ్రిహమున నీటిపై దేలుచు, గురువను గ్రిహమున ఆవలి యొడ్డును జేరి, జనన మరణములులేని అమృతత్వమును పొందగలదు. భవసాగరమగ్న జీవులు సాధకులై తనను ఆశ్రియింప, వారికి సాగరతరణోపాయముల తెలియజేయు పెన్నిధానమగు శ్రీ పరమహంస దేవునికి ప్రిణామములు.

## 33. భవతరణీచరణయుగ్మపూజానిరతవ్రిత శీలాయ నమః

భవమనగా జన్మము. జన్మలనుండి తరింపజేయునది కాన కాళికా దేవికి 'భవతారిణి' యను పేరు కలదు. అట్టి భవతారిణియగు జగన్మాత

పాదపంకేరుహముల నాశ్రయించి, తనన మరచి, దేవీ చరణయుగ్మము నందే మనస్సును లగ్నము గావించి, పూజాదుల భక్తితో నొనరించు వాడు శ్రీరామకృష్ణ దేవుడు. ఒక్క అరగంటకాలము పూజచేసి తృప్తిని పొందలేము ఆయన. బాటసారి. గమ్యమును జేరుదనుక ప్రయాణమును కొనసాగించురీతి దేవీ దర్శనము లభించువరకు శ్రీరామకృష్ణుడు తన నిత్య పూజాదికముల నెల్లవేళల సలుపుచుండెడివాడు. వ్రతసమాప్తి కావలెనుగదా: సాధకునకు బ్రథమమున నియమమత్యవసరము. నియమానుసారము సాధన సాగించిన, ఆ సమయమున యథార్థముగ మనస్సు లగ్నమైనచో దానివలన గతిన నియమముల నేర్పరచుకొనును. నియమము లేనిదే ఏదియు సాధ్యముకాదు. నియమముచేతనే సిద్ధి. అట్టి నియమమును పాలించి, పూజావ్రతమును సమాప్తి జేసి, శిష్యులకట్టి శిక్షణము నీయగల్గిన శ్రీరామకృష్ణ పరమహంస గురుదేవునకు నమోవాకములు.

## 34. భవిష్యత్ప్రపంచోద్ధారకదివ్యసందేశ ప్రదాత్రే నమః

సర్వ మతములు ఆ యా కాలములకన్వయించును. కాని ధర్మము మాత్రము సార్వకాలికమైనది. అందుచేతనే, సార్వకాలిక ధర్మానుష్ఠానము గావించిన మహనీయులు, సర్వజ్ఞులై ధర్మప్రబోధ నొనరించియున్నారు. వారు, తమ జీవితకాలమున ననేకుల నుద్ధరించుటయేగాక, భావితరములవారికిగూడ నీ ధర్మసూత్రరహస్యముల నందించుచున్నారు. వారికి ప్రాచీన ధర్మసంపద అనంతమై గోచరింప, వర్తమానమున దాని ననష్ఠించి, మరల భవిష్యత్కాలమునకు, వారి దివ్యసందేశముల బ్రసాదింతురు. ఇది వారి సర్వజ్ఞతకు నిదర్శనము.

నేటి ప్రపంచమున మానవాళిలో గోర్కెలు విశృంఖలముగా నుండ, ఆ కామ్యముల దీర్చుకొనుటకు ధనసంపాదన నక్రమముగా జేయుట, ఆ అక్రమ కార్యములచే నశాంతత ప్రజ్వరిల్లుచున్నది. కాన 'అశాంతస్య కుతస్సుఖమ్?' (గీత. 2. 66) అశాంతమనస్కునకు సుఖ మెచ్చట యని గీతావచనము. ఇట్టి ప్రజానీకమునకు, 'ధనేషణ, దారేషణముల ద్యజింపుము' అను ధర్మమును ప్రబోధించుటకు, ఆ ధన, దారలను కామకాంచనముల విడనాడి, త్యాగమూర్తియై, భావి ప్రపంచోద్ధరణకై దివ్యసందేశ ప్రదాతయైన శ్రీరామకృష్ణ సద్గురు పుంగవునకు వందనములు.

## 35. భరతఖండసంజనితవేదవిజ్ఞానాఖండ మూర్తయే నమః

విజ్ఞానము ద్వివిధము. 'ద్వే విద్యే వేదితవ్యే ఇతి హస్మ యద్బ్రహ్మవిదో వదంతి పరా చైవాపరా చ' (ముండక, 1.1.4) పరాపరములను విద్యలు రెండు కలవని బ్రహ్మవిదులు పలుకుచున్నారు. అందు 'అపరా ఋగ్వేదో యజుర్వేదః సామవేదోఽథర్వవేదః, (ముండక, 1. 1. 5) అపరమును తెలియజేయునవి వేద చతుష్టయము. అవి యును 'అస్య మహతో భూతస్య నిశ్వసితమ్' (సుబాల. 2) ఆ మహాద్భూత నిశ్వసితములుగా అభివర్ణితము. పరావిద్య యన బ్రహ్మవిద్య. ఆ బ్రహ్మవిద్యా ప్రబోధకములు ఉపనిషత్తులు. ఆ ఉపనిషత్తులు వేదములకు అంతముననుండి వేదాంతమని ప్రఖ్యాతము. పరాపర విద్యలను భౌతికాభౌతిక విజ్ఞానములుగ భావింపవచ్చును. భౌతిక విజ్ఞానము, ప్రపంచ విషయముల నన్వేషించుచు, ననేక మార్పుల నొందుచుండుట గమనార్హము. కారణము, ప్రకృతి నానాత్వమై యుండుటచే నేతద్వి

జ్ఞానమును నానాత్వమై యుండుట సహజమే. అంతియకాక ఒక భౌతిక విజ్ఞానవేత్త తెల్పిన విషయములను కొంతకాలమునకు మరియొక భౌతిక విజ్ఞాని త్రోసిరాజనును.

కాని 'ఏకం సత్' అనుటచే నీ ఆధ్యాత్మిక విజ్ఞానమేకమై విరాజిల్లుచున్నది. కారణము బ్రహ్మమొక్కటియే. బ్రహ్మవిషయమున మహాత్ముల అనుభవమంతయు నొక్కటియే. అందుచేతనే యిది అఖండ విజ్ఞానము. ఈ వేదవిజ్ఞానము భారతీయులకు నిధి. ఇది భరతఖండమున జనించినను. ముముక్షువు లెచ్చటెచ్చటనున్నను వారలకనుసరణీయమే. ఇది భరతఖండ సంజనితమైనను అఖండ బ్రహ్మమును, అఖండ బ్రహ్మజ్ఞానమును, అఖండ అనుభవరాశిని, అఖండ ప్రశాంతిని ప్రసాదించు ననుటలో సందేహములేదు. ఇది అమృతత్వము! ఇది శాశ్వతము! ఇది అజరామరము! ఇది నిత్యానందస్వరూపము! ఇది సర్వబంధ విచ్ఛేదకరము! ఇట్టి ప్రాచీన భారతీయాధ్యాత్మిక అఖండ వేద విజ్ఞానమూర్తియైన శ్రీరామకృష్ణ దేవునకు నమస్సులు.

## 36. భవ్యమధురసుధారససంజనకపాదయుగళాయ నమః

భగవత్పాదారవిందములయందు భక్తి కడు దుర్లభము. 'భక్త్యావినా బ్రహ్మజ్ఞానం కదాపి నోపజాయతే' (మహానారాయణ. 8) భక్తిలేనిదే బ్రహ్మజ్ఞానము కలుగదని ఉపనిషద్వచనము. 'కాళీపదైకశరణాత్' అను శ్రీరామకృష్ణ కరామృత శ్లోకమురీతి శ్రీరామకృష్ణుడు శ్రీ కాళీమాత చరణసరోరుహముల శరణు పొందుటవలన మధురమైన మకరందా

స్వాదనమును జేసియుండెను. ఆ సుధాప్రవాహము శ్రీరామకృష్ణునిలో ప్రవేశించి, ఆ పవిత్రమూర్తి పాదద్వయమునుండి బహిర్గతమై, ఆయన కు సాష్టాంగ ప్రణతులగావించు భక్తకోటికి ఆనందమును కలిగించు చున్నది. అవి దివ్యపాదములు! 'శ్రీ శారదాకరసరోరుహ లాలితాంఘ్రిః' శ్రీ శారదామాత పాణిపల్లవములచే లాలింపబడిన పాదపద్మములని శ్రీరామకృష్ణ కర్ణామృతము నుతించియున్నది. ఆయన పదముల స్పృశించినవారు ధన్యాతిధన్యులు. అట్టి మధురసుధారసజనకములైన పాదపంకేరుహములు గల శ్రీరామకృష్ణునకు వందనములు.

## 37. గయాపవిత్రక్షేత్రపురనాథశ్రీగదాధరాయ నమః

మనదేశము కర్మభూమి యనియు, ధర్మక్షేత్రమనియు ప్రసిద్ధి నొందినది. మానవుడు కర్మాధీనుడు. కర్మజన్య శరీరమును ధర్మాచరణముతో ధర్మక్షేత్రమొనరించుకొని, మానవుడు మోక్షసామ్రాజ్యాధినేత కావలయును. అంతవరకు జన్మ కర్మములు. మానవుని ఆశ్రయించియే యుండును. జాతకకర్మతో ప్రారంభమైన మానవ జీవితము అంత్యకర్మతో పూర్తియగుట లోకప్రసిద్ధముగదా! అంత్యకర్మల జేసి, పవిత్ర క్షేత్రమైన గయయందు పితృదేవతలకు పిండ ప్రదానముల గావించుట గృహస్థుల ధర్మము. ఆ గయాధి దేవత గదాధరుడు, అనగా శ్రీ మహావిష్ణువు.

గయలో పితృదేవతలకు పిండప్రదానమొనరింప పాదచారియై అరిగిన శ్రీరామకృష్ణ దేవుని దండ్రి యగు క్షుదీరామునకు, స్వప్నమున గయాక్షేత్రాధినాథుడు దర్శనము నొసంగి, తాను క్షుదీరాముని గృహమున

జన్మింపనున్నట్లు పలికి అంతర్హితుడయ్యెను. ఆ గదాధరుడే క్షుదీరాముని వంశోద్ధారకునిగ జన్మించి. యతిసార్వభౌముడై, పరమహంసచంద్రుడై, తన నాశ్రయించిన అర్హులను పరివ్రాజకులనుగ జేసి, లోకోద్ధారకుల దయాకొనర్చి, జ్ఞానమొసగి, వారికి పిండప్రదానములు లేకుండజేసిన కరుణాసముద్రుడు శ్రీరామకృష్ణ గురువర్యుడు. అట్టి గదాధరాఖ్యుడైన శ్రీరామకృష్ణునకు నమస్కారములు.

## 38. గంగాపావనోదకాధికతరపవిత్రచరితాయ నమః

సర్వ తీర్థములకంటె గంగానది పవిత్రమైనదిగ ప్రసిద్ధి నొందినది. ఆ గంగయందు మునిగినవారుమాత్రమే పవిత్రులగుదురు. అంతియకాక ఆ గంగయందు హెచ్చుతగ్గులుండుట ప్రకృతి సిద్ధము.

పవిత్రదృష్టి, పవిత్ర భావములు. పవిత్ర శీలము, పవిత్ర సంభాషణము, పవిత్ర చరితము, పవిత్ర హృదయము. మానవుని ఆధ్యాత్మిక ఔన్నత్యమును సూచించును. ఈ లక్షణములన్నియు నిర్మల బ్రహ్మజ్ఞానముచే లభ్యము. దీనిచే శరీరము పవిత్రవంతమై అపవిత్రతను దరికి జేరనీయదు. వీరి చరిత్ర గంగోదకముకంటె పవిత్రమైనది. ఈ మహనీయుల జ్ఞానగంగకు హెచ్చుతగ్గులుండవు. ఇది నిత్యస్రోత. ఈ పవిత్ర జ్ఞానగంగలో మునిగినవారు పవిత్రులై, జ్ఞానులై, మహాత్ములై, దేశదేశముల గ్రుమ్మరి, ప్రశాంతతను అనుగ్రహింతురు. కల్మషమెరుగని పవిత్ర హృదయుడైన శ్రీ క్షుదీరాముని తనయుడై; పవిత్ర ప్రేమమయి అయిన చంద్రామణిదేవి అంకతలమున పెరిగి; పల్లె వాతావరణమున జరించి; పవిత్ర కాళీమాత పవిత్ర పాదపద్మముల నర్చించి, పవిత్ర చరితుడై, పవిత్రమూర్తియై వెలసిన శ్రీరామకృష్ణునికి నమోవాకములు.

## 39. గగనోపమశుద్ధవిశాలవిశ్వతోముఖహృదయాయ నమః

బ్రహ్మము శుద్ధబుద్ధమని శాస్త్రము. 'శుద్ధం కామవివర్జితం' కామరహితమే శుద్ధమని వివరణము. శుద్ధ జలమున సర్వ వస్తుజాలము స్పష్టముగ గోచరించుచందము, శుద్ధమగు దర్పణమున ప్రతిబింబము విస్పష్టముగ చూపట్టురీతి, శుద్ధాంతఃకరణమున శుద్ధ పరబ్రహ్మము సుస్పష్టమగును. అగ్నికి చెదలు పట్టని యట్లు శుద్ధాత్మలను, ప్రాపంచిక కల్మషములు దరికి జేరవు. అందువలననే శుద్ధత్వమునకు, విశాలత్వమునకు నాకాశము నుదహరించుచుందురు. భూమిపై నేమి జరిగినను గగనమునకు అంటవు. ఆకాశమునకు అంతులేదు. సమీపమున నుండినట్లు గోచరించినను, దూరమును వ్యక్తముచేయు నాకాశము నీలత్వమును సూచించును. పై విధమున శుద్ధబ్రహ్మజ్ఞాన సంపన్నులు లోకమున నుండుచు విషయాతీతులై, విశ్వతోముఖమైన సువిశాల హృదయము గలిగి, ఆ విశాల హృదయముచే దేశదేశాంతర, ఖండఖండాంతర, లోకలోకాంతర సకల చరాచర జీవకోటిని ప్రేమింపగలరు. సర్వమత సామరస్యముచే ప్రపంచము నూగించిన శ్రీ వివేకానందుని, శ్రీరామకృష్ణుడు సప్తమలోకమునుండి తన కార్యనిర్వహణార్థము రప్పించుకొనెనుగదా! అట్టి తన శిష్యరత్నమైన వివేకానందునికంటె నమెరికా ఖండమునకు తాను ముందరిగి, ముఖ్యులకు ధ్యానమున, స్వప్నమున గోచరించి, కార్య సాఫల్యము నొనగూర్చెనుగదా! దేశదేశముల నేటికిని ఆ మహనీయుడు సర్వాదర్శమూర్తిగ నారాధింపబడుచున్నాడుగదా! అట్టి విశాల, విశ్వతోముఖహృదయుడైన శ్రీరామకృష్ణ దేవునకు వందనములు.

## 40. గణనీయసర్వసద్గుణగణనికరాయ నమః

దుర్గుణములు, మానవుని సంఘమర్యాదలనుండి దూరమొనరింప, సద్గుణములు గౌరవము నొసంగును. ఇది లోకవ్యవహారము. కొందరికి దుర్గుణములు సద్గుణములవలెను, కొందరికి సద్గుణములు దుర్గుణములవలెను గోచరించును. అది, వారి వారి సంస్కారమును వ్యక్తము జేయును.

సర్వ సల్లక్షణ సముపేతుడు, భగవంతునికి ప్రేమపాత్రుడు, భగవత్కృపాపాత్రుడు మహాభక్తుడుగదా! అదియే సద్గుణ సంపన్నత! నిర్మల ప్రేమ, పట్టుదల, ప్రసన్నత, శమదమాదులు, క్షమ, వినయాదులు సద్గుణములు. ఇవి సత్సాంగత్యమును కలిగించును. యథార్థ సత్సాంగత్యము 'సత్సంగత్వే నిస్సంగత్వం నిస్సంగత్వే నిర్మోహత్వం। నిర్మోహత్వే నిశ్చలతత్త్వం నిశ్చలతత్వే జీవన్ముక్తిః॥' అను శంకర వచనసరణి సత్సాంగత్యము నిస్సంగత్వమును, ఆ నిస్సంగత్వము నిర్మోహత్వమును, ఆ నిర్మోహత్వము నిశ్చలత్వమును, ఆ నిశ్చలతత్త్వము జీవన్ముక్తిని కలిగించును. అట్లు సర్వ సద్గుణగణములకు నిలయము శ్రీరామకృష్ణ దేవుడు. అట్లుగాకుండిన సర్వదేవతా సాక్షాత్కారము, సర్వమత సామరస్యములు సాధ్యమా? అందుచేతనే 'సమన్వయమహాచార్యం యుగధర్మస్వరూపిణం। సర్వదేవస్వరూపం శ్రీరామకృష్ణం నమామ్యహమ్॥' అని శ్రీ శారదా నందస్వామిచే గీర్తింపబడిన నా దివ్య సమన్వయమూర్తియగు శ్రీరామకృష్ణునకు నమస్సులు.

## 41. గంగాతటస్థపంచవటీతలతపోనిష్ఠా గరిష్ఠాయ నమః

నిష్ఠకు, శ్రద్ధ ముఖ్యము. శ్రద్ధాయుతమైన తపోనిష్ఠచే సర్వము సాధ్యము. అదే ఏకాగ్రత. 'బ్రహ్మచర్యేణ తపసా' అస్ఖలిత బ్రహ్మచర్యమును పాటించి తపస్సాచరించిన మహాత్ములను గాంచి, ప్రపంచము భయమొందును. కామ్యతచే రావణ, కుంభకర్ణ, హిరణ్యకశిపులు తపస్సు గావించిన, ఇంద్రాది దేవతలు భయభ్రాంతులైరి. కాని నిష్కామ్యత 'ఆత్మనో మోక్షార్థం' తమ ముక్తికై తపస్సు జేసిన మహనీయులగాంచి ముల్లోకములు నిర్భయతనుండును. కారణము, యీ మహాత్ములు లోక కంటకులుగాక శాంతికాముకులగుట, జితేంద్రియులగుట. గంగానది పవిత్రము. గంగాతీరమునగల శ్రీ దక్షిణేశ్వరీ దేవాలయము పవిత్రము. ఆ దేవాలయస్థ జగజ్జనని పవిత్రమూర్తి. ఆ దేవాలయ నిర్మాత్రి యగు రాణీ రాస్మణి పవిత్ర హృదయ- ఆ గంగా తీరముననే గల పంచవటీతలము పవిత్రము. ఆ పవిత్ర పంచవటి మూలమున పవిత్ర శరీరుడై, పవిత్రాంతఃకరణముతో, పంచేంద్రియ నిగ్రహుడై, పంచ మకారముల జయించి, పంచభూతప్రపంచతత్త్వమును గ్రహించి, పంచ భావముల నుపాసన గావించి, తపోసంపన్నుడై, బాహ్యాభ్యంతరముల మరచి, పవిత్రమూర్తియై చెలువొందిన శ్రీరామకృష్ణ పరమహంస గురుదేవునకు ప్రణామములు.

## 42. గభీరతత్త్వార్థవిజ్ఞానసాగరరూపాయ నమః

ఎల్లరు విజ్ఞానవేత్తలు కారు, ఎల్లరు పండితులు కారు, ఎల్లరు తత్త్వవేత్తలు కారు. 'అధ్యాత్మవిద్యా విద్యానాం' (గీత. 10.32) అను గీతావచనమురీతి నాధ్యాత్మిక విజ్ఞానమే యథార్థ విజ్ఞానము. సామాన్య

ముగ కేవల గ్రంథజ్ఞానమే పాండిత్యమని భావన. కాని యీ కేవల గ్రంథజ్ఞానము ఆచరణ రహితమగుటచే నీర్ష్యాసూయాదులను నశింపజేయ లేదు. అందుచేతనే 'పండా, ఆత్మవిషయా బుద్ధిర్యేషాం తే హి పండితాః, ఆత్మవిషయక బుద్ధి గలిగినవారే పండితులని శ్రీ శంకరులు తమ గీతాభాష్యమున వివరించిరి. శబ్దార్థములగాక అంతరార్థముల గ్రహింపవలెను. ఆ యంతరార్థముల నంతర్ముఖత్వమున దెలియనగును. ఆ అంతర్ముఖత్వము ఏకాగ్రతచే లభ్యము. ఆ ఏకాగ్రత సాధనాజన్యము. ఆచరణ సహితమైన శాస్త్రజ్ఞానము కలవారు శ్రోత్రియ బ్రహ్మనిష్ఠులు. వారు లోకోద్ధారకులు, అనుభవ స్వరూపులు. అట్టి బ్రహ్మ, జీవ, ప్రకృతి సంబంధముల గ్రహించి; ప్రకృతి నిరాసము గావించి; తన జీవభ్రాంతిని పారద్రోలి; 'అహం బ్రహ్మాస్మి' నేను బ్రహ్మమునను స్వస్వరూపస్థితిని పొందుటయే తత్త్వజ్ఞానము. తీవ్రతరమగు సాధనచే, అగాధాధ్యాత్మిక తత్త్వార్థ విజ్ఞానము సాగరమై శ్రీరామకృష్ణుని జేరినది. అట్టి దివ్యాధ్యాత్మిక విజ్ఞానసంద్రమైన శ్రీరామకృష్ణ ప్రభువుకు వందనములు.

## 43. గరిష్ఠాధ్యాత్మికసర్వోత్కృష్టసుఖాబ్ధి విహారాయ నమః

మానవునకు ధన సంపాదనమునగాని, కీర్తి గడించుటలోగాని, ఉన్నత విద్యాభ్యాసమునగాని, ఉన్నత పదవులలోగాని, సంఘ సేవలో గాని శాంత్యానందములగోచరము. సంపదకు న్యాయము, దానధర్మ ములు; యశస్సుకు భగవదనుగ్రహమును; విద్యకు, వినయమును; పదవులకు ఉపకారబుద్ధియు, సంఘ సేవకు దైవభక్తి, ప్రేమలు మూలము, లోకమునగల సర్వ సంపదలకంటె నత్యంత ఉత్కృష్ట

శాశ్వత సంపద అధ్యాత్మికసంపద. ఆ యాధ్యాత్మికసంపద మానవునికి ఉన్నత స్థానమును కలిగించును. ఆ సంపద విలువ గ్రహించిననాడు అన్యాయమునకు తావులేదు. ఆ సంపదలో మోసబుద్ధిలేదు: ఆ సంపదలో స్వార్థములేదు: ఆ సంపదలో దుర్వినియోగబుద్ధి అభావము: ఆ సంపదలో ద్వేషబుద్ధి శూన్యము: అట్టి ఆధ్యాత్మిక తత్త్వముగలవారు ఏ పదవులయందున్నను శాంతి సర్వత్ర నాట్యము సల్పును. ప్రజలు ధర్మబద్ధులై యుందురు. మహారాజైనను. యతిసార్వభౌముడైనను తమ ప్రజలను, తమ శిష్యులను గాంచి ఆనందింతురు. ధర్మము నున్నత స్థానమున నుంచి, ధర్మపరిపాలనము జేసిన ధర్మస్వరూపుడు శ్రీరామ చంద్ర మహాప్రభువు. లోక సంపదల నశ్వరత్వమును గ్రహించి, త్యాగమూర్తియై; అధ్యాత్మికతత్త్వ సర్వోత్కృష్టతను దెలిసికొని, ఆచరించి, అనుభవరూపుడై; ఆ యధ్యాత్మికతత్త్వ సాగరమున విహారము సల్పిన అవతారవరేణ్యుడును, సర్వ ధర్మ స్వరూపుడును, సర్వ సాధన స్వరూపుడును, సర్వమత సమరస మూర్తియైన శ్రీరామకృష్ణ పరమ హంస చక్రవర్తికి నమస్సులు.

## 44. గంభీరనిర్వికల్పసవికల్పాదిసమస్తవిధ సమాధిజన్యనిరుపమానందవిలోలాయ నమః

ప్రాపంచికముగ నెట్టి దుష్ట సంస్కారములుండినను ధ్యానమున మనస్సు లగ్నముకాదు. మూర్తీభవించిన పవిత్రవంతులకు మాత్రమే సమాధి సంస్థితులు. అట్టి సమాధి సంస్థితుల నుండువారికి లౌకికుల స్పర్శ భరింపరానిది. అందుచేతనే శ్రీరామకృష్ణుడు ఒకపరి సమాధ్యానంద మగ్నుడై. క్రిందపడుట తటస్థించెను. చేయి విరిగెను. అంత 'అమ్మా! నేను నీ దివ్య సందర్శనానందమున నుండి సర్వమును విస్మరింతును.

అట్టి సమయమున నన్ను పట్టుకొన నెంచినవారి స్పర్శ నాకు అమిత బాధను కలిగించును. కాన నొక పవిత్ర వ్యక్తిని నాకు తోడుగానుండి, నా బాధ్యతల వహించుటకు యిటకు బంపుము' అని ఆయన ఆ లోకమాతను ప్రార్థించెను. అవి సమాధి సంస్థితులు; క్రిందపడుట సమాధి లక్షణముకాదు. యథార్థముగ నా సమాధి సుఖముల జవి చూచినవారికిక లౌకిక విషయాసక్తి కలుగదు. సత్యము. ముమ్మాటికి సత్యము. ఆ సంస్థితుల నానందరసాస్వాదనము జేసినవాడు మరల లౌకిక వ్యాపారముల జేయజాలడు. అతడు సదానందస్వరూపుడు; అతడియందు ద్వేషము లేశమైనను గాంచము. ఈర్ష్యాసూయాదులు మృగ్యము. నిత్యోత్సాహము పొంగి పొరలుచుండును. కన్నుల ప్రేమ తొణికిసలాడుచుండును. ముఖమున ప్రసన్నత నాట్యము సల్పుచుండును. వైరాగ్యము మేరు తుల్యము. బలహీనతలు అతడి దారిదాపునకు జేరలేవు. ఇవి సమాధి రతుని లక్షణములు.

ఈ, సమాధులును ద్వివిధము. ఇవి ద్వైతాద్వైతపరములై, సగుణనిర్గుణములై, సవికల్ప, నిర్వికల్ప సమాధులని ప్రఖ్యాతి నొందినవి. భక్తిపరిపూర్ణుడైన శ్రీరామకృష్ణునకు సవికల్పసమాధులు నిత్యానుభవములు. జ్ఞానశిఖరారోహకుడైన శ్రీగురుదేవునికి నిర్వికల్పసమాధులు కరతలామలకములగుట సహజమేగదా! అట్టి సవికల్ప, నిర్వికల్ప సమాధి జన్య అతులితానందమున స్థితప్రజ్ఞుడైన శ్రీరామకృష్ణునకు వందనములు.

## 45. గంగాధరలక్ష్మీధరవాణీధరత్రిమూర్త్యాత్మక సర్వదేవతాధిష్ఠానమూర్తయే నమః

ఈ ప్రపంచ సృష్టిస్థితి, లయముల సక్రమరీతి నిర్వహించుటకు త్రిమూర్తులగు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల నా పరాశక్తి జనింప

జేసినది. వారును త్రిగుణాత్మకులై యుండిరి. వారి ముప్పురిలో సత్త్వసంశోభితుడై, నిత్యసమాధినిష్ఠాగరిష్ఠుడైన మహేశ్వరుడు గంగాధరుడు. రజోగుణ ప్రాధాన్యత, లోకపాలన కర్తయైన శ్రీ మహావిష్ణువు లక్ష్మీధరుడు. సృష్టికర్తయు, వాక్సుద్ధిగల చతుర్ముఖ బ్రహ్మ వాణీధరుడు. వాక్సుద్ధి, వాక్సిద్ధి తపోసాధ్యములు. అందుచేతనే 'సోఽకామయత బహుస్యాం ప్రజాయేయేతి। స తపో తప్యత స తపస్తప్త్వా ఇదం సర్వ మసృజత' (తైత్తిరీయ. 2.7) అనురీతి సంకల్ప సిద్ధికి తపోప్రాముఖ్యత నీ శ్రుతి బోధించుచున్నది.

సామాన్య జలము దాహమును దీర్చును. అట్టి గంగను ధరించినవాడు శంకరుడు. కాని యీ శ్రీరామకృష్ణేశ్వరుడుమాత్రము మరల దప్పిక కలిగింపని అమృతమును ధరించి, ఆధ్యాత్మిక జిజ్ఞాసాపరుల జ్ఞాన పిపాసను దీర్చును. అట్లే ధనమనిత్య సుఖముల నొసంగును. అట్టి ధనమును ధరించినవాడు విష్ణువు. కాని యీ శ్రీరామకృష్ణవిష్ణువు మాత్రము సాధనచే శాశ్వతానంద సంపదను ప్రసాదించును. సామాన్యముగ వాక్సుద్ధిచే మంచి వక్తృత్వము లభించును. మంచి వక్తకావచ్చును. కాని యీ శ్రీరామకృష్ణబ్రహ్మమాత్రము ఆ వాక్కును పరావాగ్రూపముగ మలుచుకొని, 'వాగ్వై బ్రహ్మేతి' అనురీతి వాక్కును పరబ్రహ్మముగ నుపాసించి, తన వాగమృతధారలచే సమస్త సాధకలోక హృదయముల శాంతింపజేసెను. ఆ మహనీయుని నాల్కపై ఒరాశక్తి వసించుటచే వాక్సిద్ధి కలిగినది. పై విధమున త్రిమూర్త్యాత్మకమై, సర్వ దేవతాధిష్ఠానమూర్తి యగు శ్రీరామకృష్ణ దేవునకు నమోవాకములు.

## 46. వంగబ్రాహ్మణవంశప్రదీపకరత్నాయ నమః

వంశోద్ధారకులగు సంతానమును బ్రాపంచికులు వాంఛింతురు. వారి వారి సంస్కారానుగుణ్యముగ జనించిన వారు, వంశోద్ధారకులో,

వంశవిధ్వంసకులో కాకతప్పదుగదా! కారణము తమ తమ కర్మాను సారులై వారు పుట్టొందుటయే. 'సుపుత్రో కులదీపకః' అనురీతి కుల దీపకుడు సుపుత్రుడు. అట్టివారు అరుదుగ జన్మింతురు,

'మోహాంధకారహరణో విషయోన్ముఖానాం స్నేహామృతాశనరతో నిజసేవకానాం। విర్భాసకో నిఖిలయోగమహాపథానాం దేదీప్యతే భువి గదాధర ధర్మదీపః॥' (శ్రీరామకృష్ణ కర్ణామృతము ...1) విషయాసక్తులకు మోహాంధకార విధ్వంసకుడును, నిజ సేవకులకు అనగా ఆశ్రితులకు ప్రేమామృతమును బంచియిచ్చువాడును, అఖిలాధ్యాత్మికమార్గముల బ్రకా శింపజేయువాడును అగు గదాధరుడను ధర్మదీపము భువిలో ప్రకాశించు చున్నది అని శ్రీరామకృష్ణ దేవుని జనన వర్ణనము. ఆ విధముగ శ్రీ గురుదేవుడు వంగదేశమున నవతరించి. ఆ దేశమును బవిత్రము గావించెను. అదేవిధముగ బ్రాహ్మణవంశ సంజాతుడై, ఆ వంశమును ప్రకాశింపజేసెను. ప్రకాశింపజేయునది రత్నమే. అందుచేతనే 'కులం పవిత్రం జననీ కృతార్థా వసుంధరా పుణ్యవతీ చ తేన' అట్టి మహ నీయులచే గులము పవిత్రమై జనని కృతార్థయై, వసుంధర పుణ్యవతి యగునను సూక్తి యథార్థము. అట్టి సర్వలోక ప్రదీపకుడైన శ్రీరామ కృష్ణ దేవునికి ప్రణామములు.

## 47. వటతరుమూలజన్యసర్వాధ్యాత్మికసార రూపాయ నమః

వటవృక్షము నీడ నధికముగ నొసంగును. వటపత్రశాయి శ్రీకృష్ణ పరమాత్మ. అశ్వత్థవృక్షము నాశ్రయించి, జ్ఞానోదయమొందిన

సిద్ధార్థుడు బుద్ధుడై వెలుపొందెను. అందుచేతనే 'అశ్వత్థ స్సర్వవృక్షా ణామ్' (గీత. 10.26) సమస్త వృక్షములలో నశ్వత్థమునునేనని కృష్ణ పరమాత్మ గీతలో వచించెను.

సామాన్యముగ వటవృక్షము శాఖోపశాఖల విస్తరించి, సర్వ పశు, పక్షి సంతతికి ఆశ్రియమై యొప్పును. అట్లే, అనేక సగుణ దేవతలతో, అనేక మతములతో, శాఖోపశాఖలుగా విరాజిల్లు సర్వాధ్యాత్మిక వటవృక్ష రాజము శ్రీరామకృష్ణ దేవుడు దేశదేశాంతరముల, ఖండఖండాంత రముల నా శ్రీరామకృష్ణ వటవృక్షము శాఖోపశాఖల సంస్థలరూపముగ వెలసినది. వృక్షము నాశ్రియించిన విహంగజాతి ఎటకెటకో ఆహారార్థ మరిగి, తిరిగి తమ స్వస్థానమునుచేరి విశ్రాంతి గైకొనునట్లు యీ శ్రీరామకృష్ణ వటరాజము నాశ్రియించిన ముముక్షుకోటిలో గొందరు యతీ శ్వరులై, దేశముల గ్రుమ్మరుచు, ఆధ్యాత్మికాసక్తులకు తమ గురువర్యుల సర్వమత సందేశములచే దాపమును బోగొట్టి, ప్రశాంతిని ప్రసాదించుచు, మరల తమ స్వస్థానమైన గురుమూర్తి దరికిజేరి విశ్రాంతి నొందు చున్నారు. సామాన్య వటవృక్షమూలమున నాసీనుడై, అత్యుగ్ర తపో సాధనలచే సరాధ్యాత్మికానుభవ రహస్యముల గ్రహించి, సారమును గ్రోలిన శ్రీరామకృష్ణునకు వందనములు.

## 48. పరమునిగణవందితచరణారవింద యుగళాయ నమః

పెద్దలకు నమస్కరించుట లోకవ్యవహారము. పూజ్యులైన మహాత్ములకు, భగవంతునికి సాష్టాంగవందనమొనరించుట మన భారతీయ సంప్రదాయము. నిత్య జీవనమునకు వలయు పంచభూతములను,

ఆ పంచభూతనిర్మిత శరీర నిర్వాహణమునకు పంచప్రాణ, పంచ జ్ఞానేంద్రియ, పంచ కర్మేంద్రియములను, ఆ దశేంద్రియ కర్మల వివేకముతో నాచరించుటకు నంతఃకరణ చతుష్టయమును ప్రసాదించి, యీ సర్వాధిష్ఠాన, సర్వాంతర్గత, సర్వాధార భగవత్తత్త్వమును గ్రహించుటకు విజ్ఞానము నొసంగిన సర్వరక్షకుడు భగవంతునికి నమస్కరింపవలయునుగదా! ఆ భగవానునికి మానవుడు మనస్ఫూర్తిగా కృతజ్ఞతలనైన నర్పింపక అహంకరించుచుండును.

దైవమును మరచి, ఇంద్రియాదికమును బ్రపంచమున కుపయోగించుచు, మానవుడు జన్మమరణ పరంపరల బొందుచుండును. కాని యీ సకల ప్రపంచమును, తద్రహస్యముల గ్రహించి, విజ్ఞానగవేషణ గావించి, లోకేశ్వరుని దర్శింప గుతూహలుడై, వేదరహస్యముల నధ్యయనము జేసి, సద్గురు సమాశ్రయుడై, సాధనచే సర్వేంద్రియ సంయమనమొనరించి, సమస్త ద్వంద్వముల నతీతించి, పవిత్రమూర్తియై, సదా బ్రహ్మానందరతుడైన మానవుడు అమృతత్త్వమును పొందును. మానవుడు మాధవుడై, జీవుడు దేవుడై చెలువొందును. అతడే మహాపురుషుడు! అతడే జగద్వంద్యుడు! అతడే బ్రహ్మజ్ఞాని! అతడే పరబ్రహ్మస్వరూపుడు! అట్టి మహాత్ములకు నమస్సుల నర్పింపవలయునుగదా!

పై విధమున నవతార శ్రేష్ఠుడై, సర్వధర్మ సమన్వయమూర్తియై, కామకాంచన విజేతయై, నిర్వికల్పానుభూతి నొందిన మహాత్ముడు శ్రీరామకృష్ణ దేవుడు. భగవతీపాదారవింద సమాశ్రయుడై తన జీవితమును ధన్యత నొనరించుకొనిన ధన్యుడు శ్రీరామకృష్ణుడు. అందుచేతనే ఆయన శరీరము పవిత్రమైనది. ఆయన పదపంకజముల నమస్కరించువారి దుష్ట సంస్కార సంచయము నశించి, సత్సంస్కారపుంజ

మభివృద్ధి పొంది, వారు పుణ్యాత్ములై తనరినట్లు ద్యోతకము. ఆ పాదకమలములు సామాన్యులేగాక, సాధకులేగాక, ధనికులేగాక, యతి శ్రేష్ఠులను ఆశ్రయించి అర్చించిరి. అట్టి శ్రీరామకృష్ణ దేవునకు నమస్సులు.

## 49. వశ్యేంద్రియనికాయపరిభూతశాంతి సామ్రాజ్యాధిపతయే నమః

మానవుని ఇంద్రియదళకము ఆధ్యాత్మిక జీవితమునకు అటంక దాయకము. ఇంద్రియ దుర్వినియోగము జన్మపరంపరలకును, సద్వి నియోగము జన్మరాహిత్యమునకు మార్గమగును. దశేంద్రియముల విచ్చల విడిగా ప్రవర్తింపజేసిన జంచలత్వము కలుగును. ఆ చాంచల్యముచే చిత్తమునకు ఏకాగ్రత చేకూరదు. ఆ ఏకాగ్రతలేనిచో నేదియు సాధ్యము గాదు. కావ యిట్టి అవలక్షణములకాలవాలమైన నీ యింద్రియముల నిగ్రహమత్యవసరము. ఈ ఇంద్రియ నిగ్రహము లేనివానికి అగ్రహ మును, నిగ్రహము కలవానికి భగవదనుగ్రహమును కలుగును. భగవ దనుగ్రహ సంపన్నుడు సాధకలోకముపై ననుగ్రహమును వర్షించును. ఆ ఇంద్రియ వశీకరణముచే ప్రశాంతి లభించును. ఇంద్రియ దశకమున జిహ్వేంద్రియ, గుహ్యేంద్రియముల జయించినవాడు సర్వలోకముల జయించును.

ఇహలోక పదవులు, పరలోక ఇంద్రపదవులు పతనము చెందును గాని శాంతిసామ్రాజ్యమునకు పతనభయములేదు. ఆశారహితులకు నిర్భ యమే; వారి స్థితియే అభయస్థితి. ఇంద్రియ సమూహ వశ్యతచే గలిగిన శాంతిసామ్రాజ్యాధిపతియైన శ్రీరామకృష్ణ పరమహంస దేవునకు వందనములు.

## 50. వందనీయశుభలక్షణాలక్షితాయ నమః

సల్లక్షణములు సత్యస్వరూపుడైన భగవానుని ప్రాప్తింపజేయును. దుర్గుణములు అసత్యరూప ప్రపంచమున ననేక జన్మల కలిగించును. పూర్వజన్మ సుకృతముచే గొందరికి జన్మతః సద్గుణములే వెలుగొందును. సహజముగా మంచి లక్షణములు లేకుండినను, గుణవంతుల సాహచర్యమున గొందరు ప్రయత్నముచే వానిని సాధింతురు. చూచినను, బోధించినను మార్పునొందనివారలు కొందరు. సద్గుణోపేతులైన పాండవులకనేక కష్టపరంపరలు కలిగినవి. అయినను వారు ఖేదము నొందక, సద్గుణముల విడనాడక, సర్వ భారముల భగవంతునిపై వైచియు ధర్మమును ద్యజింపలేదు. అందుచేతనే సాక్షాత్ భగవానుడగు శ్రీకృష్ణ పరమాత్మ 'యోగక్షేమం వహామ్యహం' అనురీతి పాండవుల యోగక్షేమముల నరయుచు, పార్థసారధియై వారికి విజయమును జేకూర్చెను. తన సల్లక్షణములచే భగవంతుని సాక్షాత్కరింప జేసికొనినవాడే సత్పురుషుడు, వందనీయుడు. అనేక మహాభక్తుల శుభలక్షణముల నీ దేహమున ధరించి, అనేకమంది మహనీయులచే వంద్యుడైనవాడు శ్రీరామకృష్ణుడు. వందనీయ శుభలక్షణములచే నొప్పు శరీరముగల శ్రీరామకృష్ణ గురుదేవునకు ప్రణామములు.

## 51. వనితాసువర్ణాదికప్రాపంచికవిషయసుఖవాంఛారహితవినిర్మలచిత్తయుక్తాయ నమః

'మాతృవత్ పర దారేషు పర ద్రవ్యేషు లోష్టవత్' పరస్త్రీలను మాతృభావముననను, పర ద్రవ్యమును మట్టివలెను మహాత్ములు గాంచుదురు. కామకాంచనములు అనగా అర్థ కామములు మానవుని భ్రష్టత నొందింప.

ధర్మమోక్షములు శాంత్యానందముల కలిగించును. ప్రథమమున నర్థ, కామ సంపాదనమనియు, ఆపైన ధర్మమోక్షములకు బ్రయత్నము చేయ వగుననియు, సామాన్యుల భావన. అందువలననే ధర్మమోక్షములు వారికి దూరము. కాని ప్రథమ స్థానము ధర్మమోక్షములకిడి, ముక్తిని బొందినవారికి భగవదనుగ్రహమున నెట్టి కామనలు చేరక, వారి సంకల్పము భగవత్సంకల్పమగుట, గార్యములు లోకశ్రేయస్సుకే అగుట, అప్రయత్నముగ నా కార్యములు పూర్తియగుటకు ధనము చేకూరును. ఎట్టి ఘనకార్యముల నొనరించినను, నిరహంకారులై, నిర్వికారులై, 'భగవంతుడు చేయించుచున్నా'డను నిష్కామ భావముతో బ్రశాంతులై యుండుట అంత సులభసాధ్యముకాదు. అది 'పసిడిన్ మట్టివి ఏకదృష్టి గని' అని 'శ్రీరామకృష్ణాంజలి'లో శ్రీ అనుభవానంద స్వాములవారు శ్రీరామకృష్ణునిగూర్చి వ్రాసినట్లుగా, సమదృష్టి గలవారికే లభ్యము. ఆ సమదృష్టి ప్రాపంచికవిషయసుఖాపేక్షారహితులకే అసాధ్యము. అట్టి వారిదే నిర్మలత్వము.

పరస్త్రీలయందు మాతృభావము అనుటకంటె సమస్త స్త్రీలయందును మాతృభావమను సమంజసమేమో! ఈ మాతృత్వభావనము భగవత్కృపాపాత్రునికే లభ్యము. శ్రీరామకృష్ణ దేవుడు తన వ్యవహారిక ధర్మపత్నిగా ప్రఖ్యాతి నొందిన శ్రీ శారదామాయి యందుగూడ జగన్మాతను దర్శింపగల్గిన మహనీయ దివ్య పురుషుడు. అస్ఖలిత బ్రహ్మచారిణి యగు శారదాదేవిని బూజాపీఠముపై గూర్చుండజేసి పూజించుట శ్రీ కాళికామాత అనుంగుపుత్రుడై, బ్రహ్మచర్యయుతుడైన శ్రీరామకృష్ణ యతిసార్వభౌమునికే సాధ్యము. ఇది అపూర్వము! అద్భుతము! ఇది ఆయన ఇంద్రియ నిగ్రహమునకు నిదర్శనము! ఇది శ్రీరామకృష్ణుని జీవితమున నొక వినూత్న విశేషము! ఇది సర్వసాధక లోకమునకు

దివ్య సందేశము. అట్టి దివ్యమూర్తిని వర్ణించుట అసాధ్యము. అట్టి వాంఛారహిత వినిర్మల మనస్కుడైన అవతారమూర్తికి నమస్సులు.

## 52. వరేణ్యస్వాత్మహృదయకుహరాంతర్గత సర్వోత్కృష్టాత్మానందాస్వాదనోన్మత్తాయ నమః

బాహ్య విషయముల నానందము కలదని, మానవుడు భావించి పరువులెత్తుచుండును. కొంతకాలమునకు, నిది తాత్కాలిక సుఖమనియు, దీనిచే దుఃఖము కలుగుననియు, నట దుఃఖ నివారణోపాయము నన్వేషించును. ఆ సమయమున భగవంతునిపై భక్తి యుద్భవింప తీర్థముల గ్రుంకులిడి, క్షేత్రరాజములగల దేవతామూర్తుల సందర్శించును. కాని, లౌకిక విషయములచే పాషాణతుల్యమైన ఆతడి హృదయమునకు ఆ మూర్తి అచేతనమై గోచరించి, చేతనమూర్తికై పరితపించును. ఆ తీవ్ర సంతాపముచే శిలాసదృశమైన నాతని హృదయము ద్రవీభూతమగును. శుద్ధ జలముల, వస్తుసముదాయము స్పష్టముగ గన్పడురీతి తన హృదయముననే గల భగవానుని సాధకుడు దర్శించును. తన హృదయాంతర్గత దివ్యజ్యోతిని గాంచును. తన హృదయాంతర్గత స్వస్వరూపమును దిలకించును. అదియే ఆత్మానందమని ఆనందించును. నాడు, ఆనందము బాహ్యవిషయములగాక, బాహ్య ప్రదేశములగాక, తనయందే గలదనియు, అది సాధనచే వ్యక్తమగుననియు దలచి, స్వాత్మానందమనుభవించి, బాహ్యభ్యంతరముల 'ఆనందో బ్రహ' అను రీతి బ్రహ్మానందరసాస్వాదనాయుతుడై చెలువొందును.

అదే విధమున అవతారవర్యుడైన శ్రీరామకృష్ణ దేవుడు, సామాన్య మానవులకాదర్శమగుటకో యనునట్లు, ప్రథమమున సాకారమూర్తియైన

జగన్మాతను దర్శించుటకై, దుఃఖించుచు, బరితపించుచు, ఉన్మత్తుడై యుండెను. దేవీ దర్శనభాగ్యముచే నానందించిన ఆ మహానుభావుడు, ఆ తల్లిదయచే సమస్త దేవతల దర్శించి, అంత అద్వైతశిఖరాధిరోహణము సలిపి, నిర్వికల్ప సమాధినిబొంది సర్వాదర్శమూర్తిగా వర్ధవిల్లెను. అత్యుత్కృష్టాత్మానందము హృదయకుహరాంతర్గతమై యొప్ప. దాని నాస్వాదించి, ఆనందించి, ఉన్మత్తునివోలె నుండిన శ్రీరామకృష్ణ దేవునకు వందనములు.

# 53. వసుంధరాతలజన్యసర్వమతోద్ధారక గురుమూర్తయే నమః

లోకమున ననేక మతములు కలవు. ఆ యా మత ప్రాముఖ్యములు, ఆ యా మత సంస్థాపకుని వ్యక్తిత్వమువై నాధారపడి యుండునుగదా! ఒక్కొక్క మతమును సంస్థాపించి ప్రచారము సల్పిన వారు కలరు. అట్టివారలే శ్రీ రామానుజాచార్యులు, శ్రీ వల్లభాచార్యులు మొదలైనవారు. కాని ఆదిశంకరులకు మాత్రము షణ్మతస్థాపకుడను బిరుదు కలిగెను.

మన మతములగాక నితరములైన మహమ్మదీయ, క్రైస్తవ మతముల గాంచి, ఆ యా మత ప్రాధాన్యతను గ్రహించి, ఆచరించి, ఆ యా మతదైవముల సందర్శించి, తదనుభూతిని పొంది, 'సకల మత గమ్యమొక్కటియే. విశ్వాసము ముఖ్యము. అవిశ్వాసముచే నేదియు లభింపదని ఎలుగెత్తి చాటిన సకల మతోద్ధారకుడు శ్రీరామకృష్ణుడు. ఆ మహనీయుడు చేయని సాధనలేదు, పొందనిగమ్యము లేదు. అందువలననే 'కాళీపాదాబ్జభక్తాత్, దశరథ తనయారాధనావిష్టచిత్తాత్, తంత్రోప

ష్ఠానవిష్ఠాత్. ప్రియవిరహ తపదాధికాభావమత్తాత్। అద్వైతానంద సక్తాత్, నిఖిలమతనిరతాత్ క్రీస్తుమార్గానురక్తాత్, నో జానే నో చ సేవే కుహచిదపి పరందైవతం రామకృష్ణాత్॥' (శ్రీరామకృష్ణ కర్ణామృతము....280) కాళీభక్తుడును, శ్రీరామచంద్రారాధనావిష్ట చిత్తుడును, తంత్రామష్ఠాన నిష్ఠుడును, కృష్ణునికై విరహమునొందిన రాధికాభావ మగ్నుడును, అద్వైతానందసక్తుడును మహమ్మదీయ మతాభిమానియు, క్రీస్తుమార్గానురక్తుడునునైన శ్రీరామకృష్ణ దేవునికంటె అన్యదైవమును గ్రహింపను, సేవింపను అనువిధమున శ్రీరామకృష్ణుని అవతార ప్రాశస్త్యము బహిర్గతమైనది. సర్వమతానుయాయి యగుటచే, నాయనను సకల మతస్థులు చేరి, అనుభవపూరితమగు ఆయన వాక్యసుధను గ్రోలి ఆనందించెడివారు. అట్టి సమస్త మతసామరస్యమూర్తియే జగద్గురువు. అట్టి శ్రీరామకృష్ణ గురువరేణ్యునకు నమస్కారములు.

# 54. వహ్నివత్సదాపరమపవిత్రత్వాయ నమః

లోకమున పవిత్రమైనది అగ్ని. ఆ యగ్నియందు దేనిని పడ వైచినను భస్మీపటలమొనర్పబడి, భస్మము మిగులును. అందుచేతనే అగ్నిదేవునకు సర్వభక్షకుడను నామధేయము కలదు. అట్టి వహ్నితో సమానమైనవారు మహాత్ములు. వారు పరమ పవిత్రులు. వారిని జేరిన, లౌకిక విషయాళి వారి జ్ఞానాగ్నిచే దగ్ధమగును. 'జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుః పండితం బుధాః' (గీత. 4.19) సర్వ కర్మలను జ్ఞానాగ్నిచే దహింపజేయువాడే పండితుడని నిర్వచనము.

అగ్నికిని, మహాత్ములకును అంతరము గోచరము. అగ్నిలో బడిన మానవుని స్థూల శరీరముమాత్రమే నశించును, కాని మహా

పురుషులను అగ్నిని సమీపించిన సాధకుల దుష్ట సంస్కారములు నశించి, వారు అగ్నివలె ప్రకాశింతురు. అట్టి పవిత్రత ఆ మహనీయులకే సాధ్యము. తనను జేరినవారి దుష్టత్వమును బారదోలి, తన పవిత్రతచే వారల బరమ పవిత్రులుగా జేసిన సంఘటనలు శ్రీరామకృష్ణ దేవుని జీవితమున ననేకములు గోచరము. వారు అదృష్టవంతులు. నాడు జన్మించుటయే ఒక సుకృతము! ఆయనను దర్శించుటయే ఒక పుణ్య విశేషము! ఆయన ఆనందవాక్సుధ గ్రోలుటయే ఒక అదృష్టము! ఆయన ననుసరించి జీవితముల ధన్యత నొనరించుకొనుటయే ధన్యాతి ధన్యము! నాడేగాక నేటికిని అట్టివారు కన్యులే. అట్టి పరమ పవిత్రమూర్తి యగు శ్రీరామకృష్ణ దేవునకు వందనములు.

## 55. తేజోనిధానసహస్రారమధ్యస్థాపనోపవిష్ట సమాధిస్థితాయ నమః

శ్రీ పతంజలిముని విరచిత యోగసిద్ధాంతమురీతి ప్రాణాయామముచే గుండలినీ శక్తి ప్రకోపింపబడి, షట్చక్రములద్వారమున పయనించును. మూలాధారచక్రమునుండి బయలుదేరిన యీ కుండలిని స్వాధిష్ఠానమును జేరి, అంత మణిపూరకమున బ్రవేశించి, ఆపై అనాహతమును జేరి, అటనుండి విశుద్ధమున బ్రవేశము సల్పి, తదుపరి ఆజ్ఞాచక్రమును చేరును. ఈ షట్చక్రములకు స్థానములు క్రమముగా నున్నవి. మూలాధారము గుదస్థానమునను; స్వాధిష్ఠానము మర్మస్థానమునను; మణిపూరకము నాభిస్థానమునను; అనాహతము హృదయస్థానమునను; విశుద్ధము కంఠస్థానమునను; ఆజ్ఞాచక్రము భ్రూమధ్యస్థానమునను కలవు. ఈ షట్చక్రముల సాగుచున్న కుండలినీ, ఆ యా స్థానముల నా యా అనుభవముల, దివ్యశక్తుల బ్రసాదించును. కావి

యథార్థ సాధకుడు యీ స్వల్పశక్తుల దృష్టి గాంచక, శిరస్సుపై గల సహస్రారమును జేరి, జన్మరాహిత్యప్రదాత్రి యగు నిర్వికల్ప సమాధి నిష్ఠాగరిష్ఠుడై విరాజిల్లును. అట్టివాని స్థితి వర్ణింపనేరికగును? 'వానికి చాడె సామ్యము ప్రవాహము వాని మనోబలంబు; నవ్వాని ప్రసంగమో స్థిరము, వాదవిదూరము, సున్నితంబు; నవ్వాని ప్రశాంతి సాగరము, వాని ముఖంబు ప్రకాశమూలమో; వాని వచింప నేరికగు? వాడె వచించిన వచ్చు చిత్తమా' అని 'పూర్ణప్రజ్ఞ' లో శ్రీ అనుభవానంద స్వామివారు రచించినట్లు లోకానుగ్రహమునకై, తన ఆశ్రితులకు, ముఖ్యులకు మాత్రము అవసరముమేరకు వచించునేమో? తన అనుభవముల బ్రక టించుకొనడు. ఇక ఉన్నవి లేనివి ప్రచారము చేసికొని, జనుల నాక ర్షించుటకు దావత్రియమొందునా? కాన తేజోవిభాసితమగు సహస్రార మును జేరి, సమాధిస్థితినుండి, ద్వైతాద్వైతసమన్వయావతారుడైన శ్రీరామకృష్ణునికి ప్రణామములు.

## 56. తేజోవిరాజితశక్తికృతసర్వమతసాధనానుభవసిద్ధాయ నమః

సాధనల సల్పువారలనేకులు. కాని 'యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః' (గీత. 7.3) ప్రయత్నము జేయువారలలో నొక్కడుమాత్రమే నన్ను తత్త్వతః గ్రహించునను శ్రీకృష్ణవాణి యథార్థము. సాధన ఎవరికవసరమో; ఎవరెవరికి ఏ యే సాధనలవసరమో; సాధనజేయు విధానమేదియో; ఎట్లు జేయవలయునో; సాధనకు ఆటంకములేవియో; వాని నివారించుకొనుట ఎట్టులో; సాధన గమ్యమేదియో; మొదలగు లక్షణముల దెలియకయే సాధనల గావించిన ఫలితమెట్లు కలుగును? అందుచేత నందరును సాధకులుకారు. యథార్థ బ్రహ్మానుభూతిని

ుగించుటయే సాధన! అట్టి ఒక్క సాధన గావించి, తత్సిద్ధిని బడయు
కు ఒక్కొక్కసారి ఒక్క జన్మముగూడ చాలదు. అయినచో సర్వ
ుత సాధనల నొనరించి, ఆ గమ్యమును సాధించి, తదనుభవరహస్య
ుల గ్రహించుటకు సామాన్యులకు ఎన్ని జన్మములు కావలయునోగదా.

కాని, జగన్మాతాశ్రితుడగు శ్రీరామకృష్ణుడు ఆ తల్లి యనుగ్రహ
శేషముతో, దివ్య శక్తిప్రపూర్ణుడై, సర్వమత సాధనలచే సర్వమతాను
వస్వరూపుడై, సర్వమత సమన్వయము గావించెను. ఈ సర్వమత
ామరస్యత శాస్త్రజ్ఞానముచే ముమ్మాటికిని కలుగదు. అది అనుభవము
లననే సిద్ధించునని బ్రకటపరచిన సమతామూర్తియు, సర్వమత
ాధనానుభవసిద్ధుడునైన శ్రీరామకృష్ణునకు నమస్సులు.

## 7. తేజఃపరిపూతవికసితవదనారవిందాయ నమః

పశు, పక్ష్యాదులకులేని యుక్తాయుక్త విచక్షణాజ్ఞానము మానవుని
ొక ప్రత్యేకత. అట్టి జ్ఞానముగల మానవులకు మందహాసమొకవరము.
ంతుజాలములు తమ సంతోషమును వాక్కుచే వ్యక్తము గావింపనేరవు
దా! కాన చిరునగవు మానవునకు భగవత్ప్రసాదమని దోచును. లౌకిక
వితమున రాగద్వేషములచే బుణ్యపాపముల జేయుచు, తజ్జనిత సుఖ
ుఃఖ ద్వంద్వమున బాధితుడైన మానవుడు హృదయపూర్వకానందమునకు
ోచుకొనలేడేమో! కారణము అతడు సంతత సమస్యల సతమత
ుగుటయే యననగును.

కాని ఆ మానవుడే భగవదనుభూతిచే సర్వద్వంద్వముల నతీతించి,
ర్వసంశయ విచ్ఛేదకుడై, సదానందమున నోలలాడుచుండును. ఆ
ుధ్యాత్మిక ప్రకాశముచే వికసిత పుష్పమురీతినతడు వికసిత వదనమున

్మతుడై యుండును. బాహ్య విషయములచే సుఖమును, అంతః పరిశుద్ధతచే నానందమును వెల్లి విరియును. ముఖము తేజోవంత ు. అందుచేతనే 'మోక్షద్వారే ద్వారపాలాశ్చత్వారః పరికీర్తితాః। విచారస్సంతోషశ్చతుర్థస్సాధుసంగమః॥' శమము, విచారము, షము సాధుసంగమమను నల్వురు ద్వారపాలకులు మోక్షద్వారమున ః యోగవాశిష్ఠమున వశిష్ఠమహర్షి ప్రబోధించెను. శమ, విచార, ంగత్యముల ఫలితము సంతోషమే. అట్టివారి సాంగత్యము దుఃఖ భరించుశక్తిని ప్రసాదించును. అట్టివారి సన్నిధి ప్రశాంతి గును: అట్టివారి సుమధురవాక్యతతి సకల సంశయముల బార ను: అట్టివారి పవిత్ర దృష్టి ఏకాగ్రతను కలిగించును: అట్టివారి ివాత్సల్యములు నిర్మలత నొసంగును: కావుననే సాధకునికి సత్స ాంగత్యమత్యవసరమని శాస్త్రవచనము. కాని అట్టి మహాత్ములు నటయే కష్టము. లభించినను అర్థముచేసికొనుట యింకను కష్టము. శ అర్థముచేసికొనినను వారి అనుగ్రహ సంపాదనము మరియు ు. మన సత్ప్రవర్తనచే వారి అనుగ్రహమును పొందుట సులభ ్యము.

అట్లు అధ్యాత్మికతేజోయుతుడై, మందహాసవదనారవిందుడైన ామకృష్ణునకు వందనములు.

## . తేజస్తేజోమూర్తయే నమః

తేజస్సు అగ్నిది. ఆ యగ్ని ప్రజ్వలించిన స్థలముననే కాంతి ించును. అట్లే తేజోరూపుడు సూర్యభగవానుడు. కాని ఆ ుడస్తమించిన వెంటనే అంధకారమావరించును. ఈ తేజస్సు

లకు దేజము నిచ్చునది ఆత్మస్వరూపము. ఆ యాత్మను గ్రహించిన వాడు ఆత్మవేత్త. అట్టి ఆత్మజ్ఞాని శ్రీరామకృష్ణ దేవుడు. ఆ తేజో మూర్తి సాధకహృదయముల బ్రకాశించి, వారి మోహాంధకారముల బటాపంచలు చేసి, దుష్ట సంస్కారముల రూపుమాపి, వారల తేజోరూపులుగ దయారొనర్చును. అట్టి తేజోమూర్తియగు శ్రీరామకృష్ణ దేవునికి నమస్కారములు.

## 59. తేజస్స్వరూపబ్రహ్మాత్మైకత్వజ్ఞానజన్య పరమానంద విశిష్టాయ నమః

ప్రాపంచికులకు సుఖానుభవము మాత్రమే తెలియును. ఆ సుఖమైనను వారికి సర్వత్ర కలుగదు. కొందరికి కొన్ని కాలములయందును, మరికొందరికి కొన్ని దేశములయందును, యింకను కొలదిమందికి కొన్ని వస్తువులయందును సుఖము లభ్యము. వారి సుఖము, దేశ కాల వస్తు బద్ధమై యొప్పి, కొన్ని సమయముల దుఃఖమును గూడ కలిగించును. కారణము భ్రాంతియే. భ్రాంతి మాయాజనితము. జీవుడు మాయావశుడు గాన యీ భ్రాంతి కలుగును. అదియు వానికి తాత్కాలికమే.

కాని జీవబ్రహ్మైక్యజ్ఞానముచే బరమానందమును బొందినవారు మహాత్ములు. బ్రహ్మమెట్లు దేశకాలవస్త్వతీతమో అట్లు వారి అనందము సర్వాతీతము, సర్వవ్యాపకము. ఇది బ్రహ్మజ్ఞానజన్యము. ఇందు సంకుచితత్వమునకు తావులేదు. ఈ పరమానందము విశాలమై యుండును. ఇది భ్రాంతిరహితులకే కలుగును. ఇది మాయను జయించిన వారికే కలుగును.

లోకమును బ్రకాశింపజేయు సూర్యాగ్నిచంద్రులకు బ్రకాశము నొసంగునది ఆత్మస్వరూపముగదా! 'తస్య భాసా సర్వమిదం విభాతి'

(కఠ 5.15) దాని కాంతిచే నీ సర్వము ప్రకాశించుచున్నదని శ్రుతి. అట్టి తేజోరూప బ్రహ్మాత్మైకత్వజ్ఞానముచే గలిగిన నిత్యానందవిశిష్టుడైన శ్రీరామకృష్ణ పరమహంస దేవునకు ప్రణామములు.

## 60. తేజఃపరివృతభాస్కరాదిదేవతాగణవందిత పాదారవిందయుగ్మాయ నమః

లోకబాంధవుడైన సూర్యభగవానుడు తేజోరూపుడు. మనకు అగ్నిదేవత. వర్షాధిపతి దేవత. సర్వమును దేవతామయమే. మన భారతీయ ఋషిపుంగవుల దృష్టి దివ్య దృష్టియే! ఈ దేవతలెల్లరు ఆత్మసామ్రాజ్యాధిపతియైన బ్రహ్మజ్ఞానికి పాదాక్రాంతులే. అందువలననే 'సన్న్యాసినం ద్విజం దృష్ట్వా స్థానాచ్చలతి భాస్కరః। ఏష మే మండలం భిత్వా పరంబ్రహ్మాధిగచ్ఛతి॥' (సన్న్యాసోపనిషత్తు. ౭) ఆజన్మబ్రహ్మచారియై, శాస్త్రాధ్యయనశీలుడై, తపోధనియై, విజ్ఞాననిధియై, అనుభవ సంపన్నుడైన సన్న్యాసిని గాంచి, 'ఇతడు నా మండలము ఛేదించి పరబ్రహ్మమును పొందుచున్నా'డని భాస్కరుడును తన స్థానమునుండి చలించునట। ఇది అనుభవపూరిత మహనీయుల ప్రతిభకు దార్కాణము.

శివవిష్ణ్వైక్యముచే శ్రీరామకృష్ణుని జననము. ఆ మహనీయుని ఉపాసనాశక్తిచే సకల దేవతలు ఆయనకు సాక్షాత్కరించి ఆయనలోనే మరల లీనమైరిగదా। కాన సర్వదేవతా నిలయుడైన శ్రీరామకృష్ణుడు సకలదేవతలచే వంద్యుడే. అట్టి శ్రీరామకృష్ణ దేవుని చరణయుగ్మమునకు నమస్కారములు.

## 61. తేజోజన్యత్రియస్త్రింశత్కోటిసురవరగణ పుణ్యస్వరూపాయ నమః

మన భారతీయాధ్యాత్మిక ఋషివరేణ్యులకు అంతయు భగవన్మయమే. అంతయు చిన్మయమే. అందుచేతనే ముప్పదిమూడుకోట్ల దేవతలని నిర్వచించియుండిరేమో! ఆ ముప్పదిమూడుకోట్ల దేవతలు మరల త్రియమై బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులుగ రూపొందిరి. ఆ త్రియమే మరల నేకమై పరబ్రహ్మమైనది. నానాత్వమునుండి ఏకత్వమునకు; సాకారమునుండి నిరాకారమునకు; సగుణమునుండి నిర్గుణమునకు; మానవత్వమునుండి మాధవత్వమునకు; జీవత్వమునుండి బ్రహ్మత్వమునకు గొనిపోవుట మన భారతీయ సాధనా వైశిష్ట్యము. అట్టి తేజోమయులైన ముక్కోటి దేవతలు త్రిమూర్తులై, ఏకరూపమైన బ్రహ్మమగుటయు, ఆ బ్రహ్మజ్ఞానము నొందినవాడు శ్రీరామకృష్ణుడగుట. ఆయన సర్వదేవతాస్వరూపుడే. అందువలననే ఆ మహాత్ముడు శ్రీ శారదాదేవికి శక్తిస్వరూపిణిగను; మధురనాథునికి అర్ధనారీశ్వరునిగను; భైరవి బ్రాహ్మణికి శ్రీరామచంద్రునిగను; అఘోరమణిదేవికి శ్రీకృష్ణపరమాత్మగను; గౌరీమాయికి శ్రీకృష్ణచైతన్యమహాప్రభువుగను దర్శనమునిడెను. అంతియగాక శ్రీరామకృష్ణుని శిష్యులు ఒక్కొక్కరు ఒక్కొక్క దేవత నుపాసించి, తమ తమ ఇష్టదైవముల, తమ గురుదేవునియందు గాంచి ధన్యాత్ములైరి. అట్టి పుణ్యస్వరూపుడగు శ్రీరామకృష్ణునికి వందనములు.

## 62. తేజస్స్వాంశసంభూతశాంతిప్రశాంతామల యుక్తరాజాయ నమః

బాహ్య కాంతిపుంజము ఆదిత్యుడు. ఈ కాంతిచే బయటి దృశ్యములు నేత్రములకు గోచరము. ఈ తేజము స్వయంప్రకాశము కాదు.

కాన స్వయంప్రకాశమైన ఆత్మస్వరూపమును మహాత్ములు తమ దివ్య చక్షువులచే దర్శింతురు. ఆ తేజము నిత్యమైనది. అట్టి స్వయం ప్రకాశమును, అంతర్గతమునైన ఆత్మతత్త్వగ్రహణముచే ప్రశాంత వాతావరణమున సుస్థిర శాంతియుతులై, మహాత్ములు నిత్యానందముగ నివసింతురు. దేశపాలన గావించు మహారాజులనేక సమస్యలకు గురియై. అశాంతిపాలగుచుండ, విశ్వపాలనజేయు నీ యతిసార్వభౌములు బాహ్యాంతరముల శాంతి తొణికిసలాడ నానందమూర్తులై యలరారగలరు. అట్టి శాంత, ప్రశాంత మూర్తియగు శ్రీరామకృష్ణ దేవునకు నమస్సులు.

## 63. తేజస్సాగరతరంగమధ్యశయనానంద లోలాయ నమః

మానవుడు సంసారసాగరతరంగముల నీదులాడుచు దుఃఖమును బొందుచున్నాడు గదా! కొందరికి జాగ్రదవస్థయందును దుఃఖమే. ఇక స్వప్నమునగూడ నీ జాగ్రదవస్థయందలి సంస్కారములే సూక్ష్మములై కొందరిని బాధించును. సుషుప్తియందును హాయిలేక అలమటించు వారెందరో! అజ్ఞానసాగరమగ్నులకు శాంతి ఎచ్చట?

అట్లుగాక అవస్థాత్రయమున నంతర్గతమై, ఏకమై, తేజోరూప మైన ఆత్మను గాంచువారు ధన్యులు. ఆ మహాత్ములకు మూడు అవస్థల యందును ఆనందమే. అసలు వారికి, ఏ అవస్థలనైన ఆనందమే గోచరము. వారి యా అవ్యయానందమునకు గారణమున్నది. తమ జీవితముల త్యాగమయమొనరించి, ఆ తేజోరూపమగు నాత్మానుసంధా నము జేయుటచే, నా తేజోసాగర తరంగముల శయనించి, నిశ్చింతత్వ మున మనగలరు. అట్టి ఆనంద మగ్నుడగు శ్రీరామకృష్ణునకు ప్రణామములు.

## 64. రామలాలశిశుపోషణకార్యధురంధరాయ నమః

సామాన్యముగ నొక ఉపాసకుడు ఒక దేవతోపాసనముగావించి, ఆ దేవతా సాక్షాత్కారమునొంది తృప్తిజెందును. కాని శ్రీరామకృష్ణుడట్లు గాక ప్రథమమున సర్వశక్తిమయి, సకల సృష్టిస్థితిలయకారిణియు, నాదిశక్తియు, పరాశక్తియు నగు గాళికాదేవి నుపాసించి, ఆ లోకైక మాతను దర్శించి, ఉప్పొంగి 'అమ్మా! నేను పిలిచినప్పుడు పలుకు చుండుము. నా సందేహముల నివారించుచుండుము. ఇదియే నా అభ్యర్థ నము' అని ఆమెను బ్రార్థింప, నామె అందులకు సమ్మతించెను. 'అమ్మా సకల దేవతలు నీలో నంతర్గతములేగదా! నేను వారి నొక్కొక్కరినే వేరువేరుగ దర్శింప గోరిక కలదు, నా కోరికను దీర్పవే! అమ్మా! రాముడన నెవరు?' అని ఆ జగన్మాతను బ్రశ్నింప నా మాతృమూర్తి వాత్సల్యయుతయై, 'వల్లె' యని, 'జటధారి' యను నొక వైష్ణవోపాస కుని దక్షిణేశ్వరమునకు రప్పించెను. ఆ జటధారికడ నొక చిన్ని రామ లాలా విగ్రహము గలదు. పరులకు విగ్రహముగ గానుపించు నా విగ్రహము జటధారికిమాత్రము బాలరామునిగ నతనివెంట దిరుగాడు చుండును. పవిత్రమూర్తి యగు శ్రీరామకృష్ణునకును ఆ దృశ్యము గోచరింప, పులకితశరీరుడై తన్మయత్వము నొందెను. అంత నా బాలరాముడు శ్రీరామకృష్ణునికి జేరువై, ఆడుచు, పాడచు, అన్నపానాది కములకు జటధారివచ్చి పిలిచినను వెడలకుండెను. దీని జూచిన జటధారి ఆనంద భరితుడై, తన ఉపాసనాదైవమైన బాలరాముని శ్రీరామకృష్ణుని వద్దనుంచి, దక్షిణేశ్వరమునుండి నిష్క్రమించెను. అంత శ్రీరామ కృష్ణుడా బాలరాముని సర్వబాధ్యతల వహించి, ఆనందించుచుండెను. కొంతకాలమునకు ఆ బాలరాముడు శ్రీరామకృష్ణునియందు లీనమయ్యెను.

అట్లు దశరథనందనుడైన బాల రామచంద్రుని పోషణ కార్యమును చక్కగ నిర్వహించిన శ్రీరామకృష్ణునకు వందనములు.

## 65. రామచంద్రపదకంజయుగళసేవా నిరతాయ నమః

పూజ్యుల ఎడను, దేవునియందును 'సేవకుడ'నని భావించుట అభివృద్ధిసూచకము. తల్లిదండ్రులను యథార్థముగ దైవభావనజేసి సేవించినను, తన బాధ్యతను సక్రమముగ నిర్వహించినను, భగవంతుడు సన్నిహితుడగును. మరి 'సంఘసేవ' యన నర్థమేమి? సంఘమును ప్రత్యక్షదైవముగ దర్శించినవారు సంఘసేవ గావించిన అందు లోపము లభావము. భగవత్సేవ, మాతాపితరుల సేవ, ఆపై సంఘసేవ. పై రెండు లోపించిన సంఘసేవయందు స్వార్థమధికమగును. 'నిస్స్వార్థం ఆత్మసంస్కారం నిర్వ్యామోహం క్రమశిక్షణా। సంఘసేవాధురీణానాం అవలంబనీయం సదా॥' స్వార్థరహితత్వము, ఆత్మసంస్కారము, నిర్వ్యామోహము, క్రమశిక్షణలను, నాల్గు లక్షణములు సంఘసేవా ధురీణులు ఎల్లప్పుడు అవలంబింపవలయునని పై శ్లోకము ప్రబోధించుచున్నది. యథార్థ సంఘసేవకులు కీర్తి ప్రతిష్ఠలకు, బిరుదులకు దాపత్రయమొందక, 'మేము చేయుచున్నా'మను కర్తృత్వమును వహింపక ఆ సేవాకార్యమును భగవదనుగ్రహముగ భావింతురు.

కాళికాసేవా నిరతుడై, తల్లిదండ్రులగు చంద్రామణి, క్షుదీరాముల దైవసమానముగ సేవించిన శ్రీరామకృష్ణునకు శ్రీరామచంద్రుని సేవించుట యొక కష్టముకాదు. అయన సేవ కుప్పొంగియే జటధారిని విడిచి, బాలరాముడు శ్రీరామకృష్ణుని జేరినది. అయన భాగ్యమే భాగ్యము!

ఆ చిన్ని బాలరామునికి స్నానము చేయించుట; వాని నంకతలమున గూర్చుండబెట్టుకొని అన్నము దినిపించుట; భుజములపై నెక్కించుకొని ఆనందించుట; అల్లరి చేసినపుడు దండించుట మొదలగునవి జేసి, దివ్యా నందము ననుభవించినవాడు శ్రీరామకృష్ణుడు. ఆ రఘుకులేశుని సత్య వాక్పరిపాలనము, ధర్మనిరతి, త్యాగముల గ్రహించి, శ్రీరామచంద్ర పదసరోజముల సేవించుటయందు ఆయన అపర పావనియై చెలరారెను. తరువాత హనుమదుపాసనచేసి, ఆ రామభక్త శిరోమణిని గూడ దర్శించి, తృప్తినొందిన శ్రీరామకృష్ణ దేవునకు ప్రణామములు.

## 66. రాగవిరాగాదిసర్వద్వంద్వరూపప్రపంచ రహిత చిత్తాయ నమః

ప్రపంచము బాధాకరము కాదు. కాని ఆ ప్రపంచమున వసించు వారు యితరుల బాధింతురు. కారణము, ఒక వ్యక్తిగాని, ఒక సంఘము గాని అభివృద్ధిజెందుటచూచి ఓర్వలేని యీర్ష్యా సూయాదులే. నేటి ప్రపంచమున నివియే అధికము. మంచిని గ్రహించుటకును, ఒక సత్సంస్కారము కావలయునుగదా! రాగ విరాగములు, పుణ్యపాపములు, సుఖదుఃఖములు ద్వంద్వములు. ఇవి మానవుని బంధించుచున్నవి. తాము వీని చేబట్టి పీడింపబడుచున్నను బరుల హింసించుట లోకుల లక్ష ణము. అందుచేతనే 'మృగమీనసజ్జనానాం లుబ్ధకధీవరపిశునా నిష్కారణ వైరిణో జగతి॥' (భర్తృహరి. నీతిశతకము) అని భర్తృహరి వచనము. క్రూరత్వములేక, లేతపచ్చికను మేయుచు, అరణ్యమున స్వేచ్ఛగా నుండిన హరిణములను బోయవాడును; భూమిపైగాక జలముల సంచ రించుచుండిన మత్స్యములకై వర్తకుడును; అపకారబుద్ధియే లేక తను

జీవితమును త్యాగము జేసి, సంఘమునకు మంచిని ప్రబోధించుచు, నియమబద్ధులై యుండిన సత్పురుషుల దుర్జనులును అకారణముగ బాధించుట సహజమేగదా,

అట్లుగాక నీ ద్వంద్వముల నతీతించి సమత్వ భావము కలిగి, త్యాగస్వరూపులైన మహాత్ములకు సర్వత్రశాంతియే గోచరము. వారేమి చేసినను సంఘశ్రేయస్సుకే. లోకులది గ్రహింపక వారికి ఆటంకముల గల్పింతురు. ద్వంద్వరహితులైన వారిని యివి బాధింపవు. వారికి భగవదనుగ్రహము, గుర్వనుగ్రహములు పుష్కలముగదా! ద్వంద్వాతీతున కెల్లప్పుడు చిత్తశాంతియే. కాననే దేనికివిచలింపక నిశ్చలుడై, మేరు సమానధీరుడై వెలుగొందును. అట్టివానిగాంచి లోకము వెనుకంజ వేయవలసినదే. అట్టి సకల ద్వంద్వాతీతస్థితి నుండిన శ్రీరామకృష్ణ భగవానునికి వందనములు.

## 67. రాధాభక్తిసుగంధపరిపూతశరీరాయ నమః

నాడు, వ్రేపల్లెలో బాలకృష్ణుని దివ్య స్వరూపమును గ్రహించినది రాధాదేవి. ఆమె భక్తికి అవధులులేవు. భక్తిసాత్విక, రాజసిక, తామసికములని త్రివిధము. త్రిగుణరూపమున, త్రిగుణాతీతమున నుండునది ఆ సర్వనియామక శక్తియే. 'యా దేవీ సర్వభూతేషు నిద్రారూపేణ సంస్థితా' అనుటలో దామసికమును; 'యా దేవీ సర్వభూతేషు తృష్ణారూపేణ సంస్థితా' అనుటలో రాజసికమును; 'యా దేవీ సర్వభూతేషు ప్రేమరూపేణ సంస్థితా' అనుటలో సాత్వికమును గోచరించుచున్నవి గదా! అందు ప్రేమ భక్తి అనగా సత్త్వప్రధానమైన భక్తిగలది రాధికాదేవి. శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య మధుర, భక్తి పంచకమున

మధురభక్తితో గృష్ణకిశోరునామె నుపాసించినది. అట్టి మధురభక్తి కాదర్శమైన రాధాదేవిని ఆదర్శముగా గొని, సాధన జేసినవాడు రామకృష్ణుడు. తన పురుష వ్యక్తిత్వమును మరచి, స్త్రీవలె సున్నిత హృదయుడై, స్త్రీ వేషము ధరించి, పరపురుషుల గిగంటనైన గాంచక, కృష్ణునికై పరితపించిన రామకృష్ణుడు మధురభావనతో సాధనజేసి, శ్రీకృష్ణుని సందర్శించెను. అందుచేతనే, 'హే। రామకృష్ణ। మధురం తవ సచ్చరిత్రం, త్వత్పుణ్యనామ మధురం, మధురం త్వదంగమ్। సంభాణం చ మధురం, మధురం చ గానం, తత్ కిం ను యన్నమధురం భవతి త్వదీయమ్॥' (శ్రీరామకృష్ణ కర్ణామృతము ...12) ఓ రామకృష్ణా। నీ సచ్చరిత్ర మధురము. నీ నామము మధురము. నీ శరీరము మధురము. నీ సంభాషణ మధురము. నీ గానము మధురము. అసలు మధురము కానిది నీది ఏది ఉన్నది? అని ఆ గ్రంథకర్త ఆ మధురత్వము నంతయు గ్రోలి వ్రాసియుండనోపు। శ్రీకృష్ణుని మధురత్వమును వర్ణించు 'మధురాష్టకమును' శ్రీ వల్లభాచార్యులు వ్రాసిరిగదా! కాని, శ్రీరామకృష్ణుని మధురత్వమును, మధురముగా శ్రీ ఒత్తూరు బాలభట్టు ఒక్క శ్లోకముననే రచించుట ఆనందదాయకముగదా।

అట్టి మధురభక్తి తత్పరుడైన శ్రీరామకృష్ణుని, స్త్రీ వేషమున, చిరపరిచితులుకూడ ఆయనను గ్రహింపలేకపోయెడివారట। అట్టి రాధికా భక్తియను సుగంధముచే ప్రపూతగాత్రుడైన శ్రీరామకృష్ణునికి నమస్సులు.

## 68. రాజాధిరాజసంసేవ్యమానసర్వభోగాతీత సుఖసముదాయ నమః

పూర్వపుణ్యవశముననే ధనము ప్రాప్తము. ఆ ధనధాన్యసంపద కలిగినను భోగముల మునిగి, భగవంతుని మరచి, కృష్టసమయముల

దైవస్మరణ జేయుట మానవ లక్షణము. అట్లుగాక తమకు కలిగిన సంపద భగవత్ప్రసాదముగ నెంచి, దానధర్మాదిక మొనర్చి, దేవాలయముల నిర్మించి, భగవత్కృపాపాత్రులగుటకై కొందరు ప్రయత్నము సల్పుదురు. అట్టివారు లోకమున అరుదు. దేవాలయములలో, ఆశ్రమములలో కీర్తికై, పదవులకై, వ్యామోహము నొందనివారు ధన్యులు. అట్టి ధన్యులలో ప్రథమస్థానము దక్షిణేశ్వరమున దేవాలయమును నిర్మించిన రాణిరాస్మణి, దానిని సక్రమముగా నిర్వహించిన మధురనాథులదే అనుటలో నెట్టి సందియమును లేదు. ధనము సద్వినియోగమగుట చాల కష్టము.

శ్రీరామకృష్ణ దేవుడు దక్షిణేశ్వరమున నివసించు కాలమున, కోటీశ్వరుడైన మధురనాథుడే ఆయనకు ప్రథమ సేవకుడయ్యెను. సేవకులలోగూడ ప్రథమస్థానము మధురునిదే. ఇక, నాడు కలకత్తానగర కోటీశ్వరులు, ధనికులు, శ్రీరామకృష్ణునికి బాదాక్రాంతులే. సర్వ భోగములు, సమస్త సుఖసముదాయము ఆ దివ్యమూర్తికి అందుబాటులో నున్నవి. జమీందారులు, అధికారులు, ధనికులు, లౌకికులు, విద్యావంతుల మధ్య వసించినను లోకైకమాత అనుగ్రహపాత్రుడగుటచే 'అమ్మా! నేను యంత్రమును. నువ్వు చోదకురాలివి. నేను నీ పసిబిడ్డను. నీదే భారము' అని సంపూర్ణ శరణాగతినొందిన శ్రీరామకృష్ణుడు సకల భోగాతీతుడై, త్యాగస్వరూపుడై వెలుగొందెను. రాజాధిరాజులు సేవించినను భోగాతీతుడై మెలగుట త్యాగధనులకే సాధ్యము. మహారాజాంతఃపురముల నుండినను, భోగభూమియగు పాశ్చాత్యఖండమున వసించినను, త్యాగమూర్తియై విరాజిల్లినవాడు

శ్రీ వివేకానందయతిసార్వభౌముడు. త్యాగీశ్వరుడైన శ్రీరామకృష్ణుని శిష్యుడేగదా యీ యోగీశ్వరుడు! అది శ్రీరామకృష్ణ దేవుని శిష్యులకే సాధ్యమేమో! ఈ ధన, ధాన్యసంపదల దృణముగ ద్రోసిరాజని శాశ్వతానందసంపదల నానందించు శ్రీరామకృష్ణునకు ప్రణామములు.

## 69. రాజసాదిసర్వప్రాకృతికగుణావిలక్షణ మహిమాన్వితాయ నమః

ప్రకృతి త్రిగుణాత్మకము. ఆ ప్రకృతిలో ప్రకృతితత్త్వమున జనించిన జీవులును త్రిగుణాత్మకులేగదా! 'సత్త్వం రజస్తమ ఇతిగుణాః ప్రకృతి సంభవాః' (గీత. 14.5) సత్త్వరజస్తమోగుణములు ప్రకృతి జన్యములు. తమోగుణము 'అజ్ఞానజం' అజ్ఞానజనితము. ప్రాపంచిక విషయాసక్తత, నిద్ర, ఆలస్యములు తమోగుణోద్భవములు. రజోగుణము 'తృష్ణా సంగసముద్భవం' కోర్కెలు, విషయసంగములచే బుట్టొందును. కర్మాసక్తియు, లోభిత్వము, ఆశాదులు, రజోగుణ జనితములు. సత్త్వగుణము 'సుఖే సంజయతి' సుఖజన్యము. భగవద్భక్తి, ధీశక్తి సత్సాంగత్యమొనర్చుట, వివేకవైరాగ్యాది సుగుణ సంచయము సత్త్వగుణజన్యములు. 'ప్రమోదమోహౌ తమసః' ప్రమాద, మోహములు తమస్సునుండియు, 'రజసో లోభ ఏవ చ' లోభాదులు రజస్సువలనను, 'సత్త్వాత్ సంజాయతే జ్ఞానం' జ్ఞానము సత్త్వగుణము వలనను పుట్టుచున్నవని గీతాకారుని వివరణము.

కాని, యథార్థముగ రజోగుణము సత్త్వ, తమస్సుల మధ్యనుండుటచే నది ఉభయ లక్షణముల బొంది, సత్త్వగుణమధికమైనచో సత్త్వమునకును, తమోగుణమధికమైనచో దమోగుణమునకును ఉప

యుక్తమగుచున్నది. ఈ రజోగుణము సద్గుణరాశియగు సత్త్వమునుజేరి, తనకుగల పట్టుదల, చురుకుదనము, కుశాగ్రబుద్ధి, కార్యసాధనాదుల నా సత్త్వగుణమునకు దోడ్పడజేయుచు నా వ్యక్తిని మహాపురుషునిగ దయారొనర్చును. అట్లుగాక యీ రజోగుణము తమోగుణమును జేరిన, అనవసర బట్టుదలలబెంచి చురుకుదనమును మోసమునకు వినియోగించి, హింసాదికముగావించి, ఆ వ్యక్తిని అథఃపాతాళమునకు ద్రొక్కి జీవితమును నాశనము చేయును. కాన నీ ప్రకృతి సంబంధ రజోగుణ లక్షణముల సత్త్వసంపన్నముజేసి, పట్టుదలచే గాళికాదేవి దర్శనముపొంది, ఆపై సకలదేవతల సందర్శించిన మహిమాన్వితుడైన శ్రీరామకృష్ణ పరమహంస దేవునకు వందనములు.

## 70. రామణీయకకమనీయవేదాంతజ్ఞాన రసాస్వాదనోన్మత్తభృంగాయ నమః

మధుపము కుసుమముపై వ్రాలి, అందలి మధువును గ్రోలును. ఈ మధువు అనిత్యము. కాని మహాత్ములను భృంగిమములు, భగవత్పాదారవిందములందలి జ్ఞానమను మకరందము నాస్వాదించును. ఈ జ్ఞానమకరందము నిత్యము. ఈ జ్ఞానము వేదముల జివరనుండుటచే వేదాంతమైనది. ఈ వేదాంతము నర్థము చేసికొనుటయే కష్టము.

ప్రథమమున, నజ్ఞానములో బ్రహ్మ, జీవ, ప్రకృతులు మూడు గలవనియే విశ్వసించును. బ్రహ్మము సత్యమనియు, తాను జీవుడననియు, ప్రపంచము లేనిదనియు శాస్త్రములద్వారా గ్రహించును. తదుపరి యీ ప్రకృతి బాధాకరమైనదనియు, తన జీవత్వమును బ్రహ్మత్వముచే బోగొట్టుకొనుటకై సాధకుడుగ మార్పుచెందును. అంత సద్గ

రుపు నాశ్రయించును. యథార్థ సాధన గావించును. అప్పుడు తాను సర్వవేళల బ్రహ్మమునేగాని జీవుడ గాననియు, ఉన్నదొకటే అనియు, లేని ప్రపంచమును పారద్రోలుటయు, లేని జీవత్వమును తొలగద్రోయుటయు హాస్యాస్పదమని అనుభవపూర్వకముగ గ్రహించును. లేనివి ఎప్పుడును లేనివేగదా! ఉన్నదెప్పుడును ఉన్నదియే. కాని, లేనిదానిని పోగొట్టుటకు, ఉన్నదానిని పొందుటకు మానవుడు సాధనజేయుట ఆశ్చర్యము, అద్భుతము. ఇట్టి రమణీయమును కమనీయమునైన వేదాంత జ్ఞానమును, అనుభవపూర్వకముగ నాస్వాదనముచేసి, ఆనందోన్మత్తుడై యాడిన శ్రీరామకృష్ణ దేవునకు నమస్కారములు.

# 71. రాధాగోవిందార్చనతత్పరతాజన్యభక్తిచైతన్య బాష్పయుక్తచక్షుద్వయాయ నమః

'అర్చన' అనునది మానవుని నిత్యజీవితమున నొక ప్రశాంతిని కలిగించును. జప, ధ్యానములు ఏకాగ్రతను కలుగజేయును. శరీర పోషణమునకు ఆహారమెంత అవసరమో అట్లు మనో పోషణమునకు పూజా, జప, ధ్యానములంత అత్యవసరములు. కేవల శరీరపోషణచే మానవునకు బలత్వమభివృద్ధి గాంచు. మనోపోషణచే మానవునకు దైవత్వము సిద్ధించును.

సర్వేంద్రియ సంయమనమే పూజ. అందుచేతనే 'కమలాక్షు నర్చించు కరములు కరములు, శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ....'అని పోతనామాత్యుని కథనము. ప్రథమమున శ్రోత్రేంద్రియము భగవత్కథలను శ్రవణము జేయవలెను. అంత, నా సుగుణములు మనమున హత్తుకొనిపోవును. ఆ పైన నా సుగుణముల నష్టోత్తర శత,

సహస్రరూపముగ, సర్థయుక్తముగ జదువుచు బూజల సలుప వలయును. ఇందు జదువుటచే వాక్కు, అర్చనచే గరములు సద్వినియోగమగుచుండును. అటుపైన, నాసనబద్ధుడై గూర్చుండుటచే నాసనసిద్ధియు లభించును. ఆ సుగుణ, సుందరమూర్తిని నేత్రముల దిలకించుటచే నేకాగ్రత చేకూరును. ఇట్లు సర్వేంద్రియ సద్వినియోగము అర్చన నాబడును.

దక్షిణేశ్వరమున దేవాలయమునకు బ్రక్కన శ్రీరాధాగోవిందుని ఆలయము కలదు. ఆ రాధామనోహరుని భక్తితత్పరత బూజించి, పులకాంకితశరీరుడై, ఆ భక్త్యుద్రేకముచే శ్రీరామకృష్ణుని నేత్రద్వయ మానందబాష్పములచే నిండినది. అదియే భక్తికి పరాకాష్ఠ! అదియే భక్తితత్పరత! అదియే మహాభక్తుని భక్తి సంపన్నత! ఆ మహనీయుల భక్తి తరంగములు భక్తులకు ఆనందమొసగునుగాని దుఃఖము కలిగింపవు. ఆభక్తిబాష్పములు మానవుని హృదయ మాలిన్యముల దొలగద్రోయును. ఆభక్తి బాష్పములు సద్భక్తిని కలిగించును. అట్టి భక్తిపరిపూర్ణుడైన శ్రీరామకృష్ణునకు వందనములు.

## 72. రాస్మణీమణీభక్తిపరిపోషకాయ నమః

కలకత్తాకు నాలుగుమైళ్ళ దూరమునగల దక్షిణేశ్వరమున కాళికాలయమును నిర్మించినది దేవీభక్తురాలును, జమీందారిణియునగు రాణీ రాస్మణీదేవి. ఆమె కట్టించినది అనుటకంటె, తన సంకల్పము నెరవేర్చుకొనుటకును, రాబోవు తన భక్తునికై, ఆ జగజ్జననియే ఆ స్థల నిర్దేశమును గావించి, తన భక్తురాలైన రాణికి ఆ దేవాలయమును నిర్మించు నవకాశమొసంగి, ధన్యతను గలిగించినదనుట సమంజసమేమో! ఎవరిచే నెట్టి అద్భుత కార్యముల నా భగవతి నిర్వహింపజేయునో ఎవరికెరుక?

ఎవరిపై నా లోకమాత కృపాకటాక్ష వీక్షణముల బ్రసరింపజేయునో ఎవరికి దెలియును? ఎవరిపై మాతృవాత్సల్యమున, మందహాస వదనారవిందయై దర్శనమొసంగునో; ఎవరిపై కినుక వహించి భీకరమూర్తియై భయమును కలిగించునో; ఆ జగద్ధాత్రికే అవగాహన మగునుగాని సామాన్యులకెట్లు తెలియును?

దేవాలయ నిర్మాత్రి అయిన రాణి, ఒక దినము గంగాస్నాన మొనరించుకొని, దేవాలయమున బ్రవేశించి, దేవికి నమస్కరించి ఒక ప్రక్క ఆసీనయైనది. ఆ సమయమున శ్రీరామకృష్ణుడు భక్తితత్పరుడై, తన్మయత్వమున దేవిని అర్చించుచుండెను. అంతలో శ్రీరామకృష్ణుని ఏకాగ్రతకు భంగము కలుగ, ఆయన ఆసనమునుండి లేచి, రాణి రాస్మణినిజేరి, 'ఇచ్చటగూడ నీ అపవిత్ర ఆలోచనములా,' యని రాణి చెంపపై నొక్క దెబ్బ వేసెను. రాణి సేవకులు శ్రీరామకృష్ణునిపై ఆగ్రహింప, ఆమె వారిని వారించి, 'తప్పు చేసినవారిని శిక్షించుట జగన్మాత బాధ్యత. తప్పు చేసినది నేను. పవిత్ర దేవాలయమున, పవిత్ర దేవీ సన్నిధానమున గూర్చుండి, అపవిత్రమైన కోర్టువ్యాజ్య విషయమై ఆలోచించుచుంటిని. బిడ్డ దోషమును గ్రహించి, జనకుడు దండించును. అందుచేతనే జగన్మాత శ్రీరామకృష్ణ దేవునిచే నన్ను శిక్షింపజేసినది' అని తన తప్పిదమును క్షమింపుమని ప్రార్థించిన సహృదయ రాణీరాస్మణి. ఆ విధముగ ఆమె భక్తికి ఆటంకముల గ్రహించి, వాని నివారించి, ఆమె భక్త్యభివృద్ధికి దోడ్పడిన మహనీయమూర్తియగు శ్రీరామకృష్ణునకు నమస్కారములు.

# 73. మహాదేవిపరాశక్తికాళికాభక్తినిమజ్జనోద్భూత మహదానందతన్మయాయ నమః

'యా దేవీ సర్వభూతేషు శక్తిరూపేణ సంస్థితా' (సప్తశతి) ఏ దేవి సర్వభూతములలో శక్తిరూపమున గలదో ఆ శక్తికి నమస్కారమని సప్తశతియు, 'శక్తిజ్ఞానం వినా దేవి నిర్వాణం నోపలభ్యతే' (నిరుత్తరతంత్రము) శక్తిజ్ఞానములేక ముక్తి లభ్యముకాదని తంత్రము ను వచించుచున్నవి. శక్తి వినా మానవుని మనుగడయే లేదుగదా! ఆ పరాశక్తి, ఆద్యశక్తి, సర్వశక్తి ప్రథమమున మూర్తిత్రయమును సృజించి, యీ లోక, జీవ, సృష్టిస్థితిలయాది కార్యనిర్వాహణార్థము వారికి, మరల శక్తిత్రయమును బ్రసాదించెను. అంత నా త్రిమూర్తులు, వారి వారి కార్యముల నిర్వహింప సమర్థులైరి. ఈ పరమ రహస్యమును గ్రహించిన రామకృష్ణుడు మొదట మహామాయియైన కాళికాదేవినే శక్తితో నర్చించెను. ఆమె వదనమున చిరునగవునే ఆయన గాంచెను. ఆమె అభయహస్తమునే ఆయన జూచెను. ఆమె హృదయమునగల వాత్సల్య వాహినియే ఆయనకు దృగ్గోచరమయ్యెను. ఆమె నేత్రములగల కరుణా రసమే ఆయన హృదయమున జొచ్చెను. తాను పసిబిడ్డనని భావించి. పసితత్త్వమలవడుటచే నామె దిగంబరత్వమాయనకు గోచరింపలేదు. అట్టి మాతృమూర్తి, ప్రేమమూర్తి, వాత్సల్యమూర్తి నావేదనతో నారాధించి, దుఃఖించి, తపించి, ప్రార్థించెను. ఆమె దర్శనభాగ్యమును పొంది, ఆమెతో సంభాషణల నలుపుచు, తన సందేహముల నామెకు దెలిపి నివారించుకొనుచు, ఆమె ఆజ్ఞలను పాటించుచు, ఆమె కనుసన్నల మెలగుచు, కర్తృత్వరహితుడై సర్వభారముల నామెకే వదలి, మహదానందమూర్తియైన శ్రీరామకృష్ణునకు వందనములు.

# 74. మహనీయగుణగరిష్ఠశిష్యకోటిపరి వృతాయ నమః

గ్రంథములు లభించుటయు, గ్రంథపాండిత్యముగలవారు లభ్య మగుటయు నీ లోకమున సులభమే. కాని యథార్థగురువు దొరకుట పూర్వజన్మ సుకృతము. అటే విధముగ అనుభవమూర్తియైన గురువ రేఖ్యనకు, యోగ్యుడును, సుసంస్కార శోభితుడైన శిష్యరత్నము లభించుట భగవదనుగ్రహము. శిష్యులు గురువు నన్వేషణ చేయుచు వెడలుటయేగాని గురువు శిష్యులకై వెదకుట ఎచ్చటనులేదు. 'పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేద మాయాత్ ...తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్' (ముండకము. 1-2-12,) కర్మార్జిత లోకముల బరీక్షించి, నిర్వేదము నొందిన బ్రాహ్మణుడు, ఆ జ్ఞాన సంపాదనమునకై గురువును చేరవలయును అని శిష్యుని అర్హతను నిరూపణము గావించిన శాస్త్రము 'శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం' (ముండకము. 1.2.2) గురువు శ్రోత్రియుడు, అనగా శాస్త్రజ్ఞానము గలవాడును. బ్రహ్మనిష్ఠుడును అయి ఉండవలెనని నిర్ణయమొనరించినది. ఇట్టి యథార్థ గురుశిష్యులనుండి జ్ఞానము జనించి, ప్రవహించి, సాధకులకు మనశ్శాంతిని ప్రసాదించును. అట్టి గురుశిష్యులరుదుగ నుందురు. అందరు గురువులు కాజాలరు. అందరు శిష్యులు కాజాలరు. అది ఒక పవిత్ర సంబంధము.

శ్రీరామకృష్ణ దేవుని గురుత్వమత్యద్భుతము. తనవద్దకు వచ్చు వారలను జగన్మాత, ముందుగనే తనకు గోచరింపజేసెడిదని శ్రీరామ కృష్ణ వచనము. దీనిననుసరించి జూచిన గురు శిష్య సంబంధము భగవ త్ప్రసాదితము కావలయునని భావించనగును. అట్టివారలే శ్రీరామకృష్ణ

దేవుని శిష్య వర్గము. ఉన్నతభావములు గలవారును, త్యాగమూర్తులును ప్రపంచమును లెక్కచేయని మనస్తత్వము గలవారును, ధీరులును, ధీశక్తి సంపన్నులును, అయిన నరేంద్రనాథ్, శశి, కాళి, రాఖాల్, బాబూరామ్ శరత్, నిరంజన్ మొదలగు యువకులగు శిష్యులచే పరివృతుడైన శ్రీరామకృష్ణుని నాడు గాంచినవారి జీవితములు ధన్యాతిధన్యములు. ద్వాపరయుగమున శ్రీకృష్ణుడు, గోపాలుర గూర్చుండ నియమించి చల్దుల నారగించెనుగాని, కలియుగావతారుడై జన్మించిన శ్రీరామకృష్ణుడుమాత్రము, విద్యాధికులును, సుసంస్కారవంతులును, భావి జీవితమున పరివ్రాజకులై, దేశదేశముల తమ ఆధ్యాత్మిక శక్తిచే ప్రపంచమును కదిలించు శక్తిగల యువక బృందమును తనవద్ద గూర్చుండ బెట్టుకొని, వారికి శాశ్వతానందసుధ నొసంగెనేమో! చంద్రునిచుట్టు నక్షత్రములు ప్రకాశించుచుండినట్టుండెనేమో నాటి దృశ్యము! అట్టి గుణగరిష్ఠులైన శిష్యకోటిచే పరివృతుడైన శ్రీరామకృష్ణ గురువర్యునకు నమస్సులు.

## 75. మథురనాథాద్యనేకరాజసేవకగణసంసేవిత పూజ్యపాదాయ నమః

ధనికులచెంత సేవకులుందురు. వారు, ధనలోభమున వారి నాశ్రయించి సేవించుచుందురు. ఇందు పుణ్యమావంతయులేదు. జీతముల సరిగ నీయకుండిన ఆ సేవకులే మరొకరిని చేరుదురుగదా! కాని ఆధ్యాత్మికానందశోభితులను సేవించుట మహద్భాగ్యము. అట్టివారలకు సాధకులు తమ జీవితముల నంకితము చేసి ఆనందింతురు. ఇట ధనికులు, పేదలను భేదములేదు. అట్టి భేదరహితుడైన శ్రీరామకృష్ణ

దేవుని ఉన్నతాధ్యాత్మికశక్తికి, సర్వసమత్వమునకు దాసానుదాసులై, తాము ధనవంతులమనుమాట మరచి, ఆ మహనీయుని తమ జీవితాంతము గొల్చి, అనేకమంది గలగత్తా నగరమున నాడు ఆయనను సేవించిరి. అట్టివారలే మధురనాథుడు, బలరాంబోస్, అధరసేన్, కేశవచంద్రసేన్ మున్నగువారు. అట్లయినను శ్రీరామకృష్ణుడు పరమ త్యాగస్వరూపుడే! అట్టి ధనికవర్యులైన, రాజసేవకగణముచే సేవింపబడిన పూజనీయుడైన శ్రీరామకృష్ణునకు వందనములు.

# 76. మమతాహంకారాదివిక్షేపావరణద్వయరూప మాయా విదూరచిత్తాయ నమః

మానవుని బంధించునది నేను, నాది. అవియే మమకారాహంకారములు. మమకారము తమోగుణజన్యము. అహంకారము రజోగుణజనితము. మమకారముచే ధృతరాష్ట్రుడును, అహంకారముచే దుర్యోధనుడును బాధితులైరి. మమత్వము జీవులబంధించి అధ్యాత్మిక జీవనమున కాటంకమును కలిగించును. 'అహంకారావిష్టస్సంసారీ జీవః స ఏవ పశుః' అహంకారముతోకూడిన సంసారి జీవుడనియు, అతడు పశుతుల్యుడనియు ఉపనిషద్వచనము. అవియే విక్షేపావరణద్వయమై యున్నవి. ప్రథమమున ఆవరణము, పిదప విక్షేపము. యథార్థ సత్స్వరూపమును మరపింపజేయునది ఆవరణమాయ. ఈ నిత్యాత్మస్వరూప భావనను కలిగించి ప్రవృత్తిని కలిగించి, కామాద్యరిషడ్వర్గమును, రాగద్వేషములను, సుఖదుఃఖములను, వేయేల సర్వవికారములను విక్షేపమాయ కలిగించును, ఆవరణము తమోగుణముకాగ, విక్షేపము రజోగుణమై యున్నది. అందుచేతనే 'మాయాంతు ప్రకృతిం విద్యాత్

మాయినం తు మహేశ్వరం' (శ్వేతాశ్వతరము. 4.10) మాయను వశ పరచుకొనినవాడు శివుడని వచించుచున్నది. భగవదాశ్రియమైన మాయ సత్త్వప్రధానమై యొప్పుచున్నది. అట్టిమాయ జ్ఞానసాధనమై. మానవుని మాధవునిగ, సాధకుని సిద్ధునిగ, జీవుని శివునిగ మార్చగలదు. కాని ఆ మాయయే జీవాశ్రియము నొంది, రజో తమోగుణములగూడి జీవునికి అనేక యాతనల కలిగించును. అట్టి మానవుడు లౌకిక విషయాసక్తి పెంపొంద, జీవితమును వ్యర్థము చేసికొని, అహంమమత్వముల బడి, భగవంతునే విస్మరించును.

'ఏకం సత్' భగవంతుడొక్కడే యనుటచే నిట మాయకు స్థానము లేదు. భగవచ్ఛక్తి నాబడు మాయ భగద్విరుద్ధము కాదుగదా! సామాన్య మానవులు మాయకు ప్రత్యేకత నిడి, మాయను మాయగ నెంచి. ఆ మాయకు లోబడి, అహంకార మమకారబద్ధులై, కర్తృత్వభోక్తృత్వముల నొంది, అనేక బాధల మ్రగ్గుచుందురు. కాని శ్రీరామకృష్ణుడుమాత్రము మాయను 'మాయి'గ అనగ తల్లివలె భావించి, అమాయకుడై, మాయాతీతుడై, ఆనందమూర్తియై చెలువొందెను. మాయారహితునికే యథార్థ ఆనందముగాని మాయల జేయువానికి ఆనందమెచ్చటిది? అందువలననే ఆయన చిత్తము మాయావిదూరమయ్యెను. ఆయన అహంకారము దేవీ సాక్షాత్కారముతోడనే నిష్క్రమించినది. 'నేను' అను మాటనే ఉచ్ఛరింపక, ఆ జగజ్జనని ఇచ్ఛానుసారియై ప్రవర్తించు నా దివ్యాత్మునకు అహంకారమేది? అట్లే ఆయన మమకారమంతయు నా లోకేశ్వరిపైననే గదా! ఇక ఆయనకు విక్షేపావరణములు ఎట్లుండును? దైవదర్శనము లభింపనంతవరకే యీ అహంకారమమకారముల విజృంభణము. భగవద్దర్శనము వానిని నశింపజేయును. అందుచేతనే మాయకు దొరకని వారును, విషయవిదూరులును, నిర్మల హృదయులును, త్యాగసంపన్ను

లైనవారుమాత్రమే ఆయన సన్నిధిని దివ్యానందము ననుభవించి తన్మయత్వము నొందెడివారు. మాయకులోబడి, మాయావశులైనవారు ఆ దివ్యమూర్తిని గ్రహింపజాలక యీర్ష్యాసూయల మ్రగ్గుచుందురు. ఈర్ష్యాసూయాగ్రస్థులకు విశాల హృదయములేక యథార్థానందము లభింపదు. అది సహజమేగదా! శుద్ధ దర్పణమున ముఖము చక్కగా గోచరించి, ధూళిచే నిండిన అద్దమున ప్రతిబింబము కనుపింపనట్లు పరిశుద్ధ హృదయమున భగవత్తత్త్వము బాగుగ ప్రకాశించి, కల్మష హృదయమున ప్రతిఫలింపదుగదా! అట్లు సకల మాయాదూరుడై, కాళికామాయి పసిబిడ్డడై, మాయావిదూరచిత్తుడైన శ్రీరామకృష్ణునికి నమోవాకములు.

## 77. మత్స్యకూర్మాదిదశావతారజనకమూలకారణ పరబ్రహ్మస్వరూపాయ నమః

'మృత్పిండమేకం బహుభాండరూపం సువర్ణమేకం బహుభూషణాని గోక్షీరమేకం బహు ధేనుజాతం ఏకం పరాత్మా బహు దేవవర్తి॥' అనేక భాండములకు మట్టి ఒక్కటియే కారణమైనట్లు; అనేక భూషణములకు ఒక్క సువర్ణమే కారణమైనట్లు; అనేక గోవులనుండి వచ్చిన క్షీరము ఒక్కటియే యైనట్లు, అనేక దేవతలయందును ఒక్క పరమాత్మయే అంతర్గతమై యున్నదిగదా! అట్లే మత్స్యకూర్మాద్యవతారములకు మూలకారణము పరబ్రహ్మము. బ్రహ్మముకంటె పైన నిక వేమియులేదని 'సా కాష్ఠా సా పరా గతిః' శ్రుతి బోధించినది. అందుచేతనే 'ఇంద్రియాణి పరాణ్యాహురింద్రియేభ్యః పరం మనః మనసస్తు పరా బుద్ధిర్బుద్ధేరాత్మా మహాన్ పరః॥' (కఠోపనిషత్తు. 3.10) ఇంద్రియములకంటె మనస్సును, మనస్సుకంటె బుద్ధియు, బుద్ధికంటె పరమైనది ఆత్మగ బ్రహ్మము. ఆత్మకంటె పరమికలేదు. మత్స్యాద్యవతారదశకము

సగుణమై యొప్పగ, ఆ యవతార అవతరణమునకు మూలకారణమైన పరబ్రహ్మము నిర్గుణమగుచున్నది. ఈ అవతారములు భక్తిమార్గమును సూచింప, పరబ్రహ్మము జ్ఞానమార్గమును దెలుపుచున్నది. ఈ దశావతారములు ద్వైతముకాగ, పరబ్రహ్మ మద్వైతమై యున్నది. పై విధమున సగుణ, నిర్గుణ, భక్తి, జ్ఞాన, ద్వైతాద్వైతముల సాధించి, సమన్వయించిన పరబ్రహ్మస్వరూపుడగు శ్రీరామకృష్ణునకు నమస్కారములు.

## 78. మథితకామక్రోధాదివైరిషడ్వర్గాయ నమః

కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు ఆరు. సాధకునకి యివి శత్రువులు. అందుచేతనే వీనికి అరిషడ్వర్గము నా పేరు కలిగెను. ఈ అరిషడ్వర్గమునకు లోబడినవాడు తానశాంతిపాలై, ఇతరులగూడ నశాంతిపాలుజేయును. ఒక్క కోరిక కవకాశమొసంగినచో మిగిలిన పంచకము ఆహ్వానింపకయే చేరును. 'కామజానామి తే మూలం సంకల్పాత్ త్వం హి జాయసే, ఓ కామమా! నీ మూలమును నేను గ్రహించితిని. సంకల్పమునుండి నీవు పుట్టొందుచున్నావు అనురీతి కోరికకు కారణమును గ్రహించి సంకల్పరహితుడై, అరిషడ్వర్గ జయమును పొంది, సాధకుడు నిత్యానందమును గాంచును.

ఈ అరిషడ్వర్గమును ప్రపంచమునకుగాక భగవంతుని దెసకు త్రిప్పిన అవి మానవునేమియు జేయజాలవు. భగవంతుడు కావలయునని కోరికయు; ఇంకను భగవంతుడు గోచరింపలేదని క్రోధమును; భగవానుడు నావాడను లోభమును; ఆ భగవానుని విడనాడలేని మోహమును; ఆ భగవంతుడు నాకుగాక ఎవరికి దర్శనము నిచ్చునని మదమును; నా

దైవముకంటె ఉత్తమదైవము ఎవరికి లేకుండుగాక యను మాత్సర్య మును బొందుటచే మానవుడు సర్వదా భగవత్స్మరణమే చేయును.

ఆ కామాదులనే ప్రపంచముదెస ద్రిప్పి, హాలాహలము నుద్భవింపజేసి, లౌకికులు తాము బాధచెంది పరులను బాధింతురు. కాని మహాత్ములు ఆ కామాద్యరిషడ్వర్గమును మథించి, భగవదున్ముఖము చేసిన, అందుండి అమృతము పుట్టొంద, దానిచే తాము ప్రశాంతులై, లోకమునకు శాంతిని ప్రసాదింతురు. అట్టి అరిషడ్వర్గమును నిగ్రహించి, జయించిన శ్రీరామకృష్ణునకు వందనములు.

## 79. మంత్రతంత్రయంత్రాత్మకసర్వాగమశాస్త్ర ధ్దారకమూర్తయే నమః

'మంత్రాధీనంతు దైవతం' మంత్రాధీనము దైవమనియు, 'మంత్రో దేవాది సాధనం' దేవతాదికమునకు మంత్రమే సాధనమని ఆర్యోక్తి. 'మననాత్ త్రాయతీతి మంత్రః' అను నిర్వచనమురీతి మననమునుండి రక్షించునదిగాన విది మంత్రమగుచున్నది. ఈ మంత్రజపముచే నేకాగ్రత సిద్ధించును. ఆ ఏకాగ్రతయు అనుభవమూర్తులైనవారి మంత్రోపదేశమువనే లభించును. 'మంత్రార్థం మంత్రచైతన్యం యో న జానాతి సాధకః। శతలక్షప్రజప్తేఽపి తస్య మంత్రో న సిధ్యతి॥' (మహానిర్వాణతంత్రము) మంత్రార్థమును, మంత్రాధిష్ఠాన చైతన్యము నెరుగని సాధకుడు, నూరులక్షలు జపించినను వానికి మంత్రసిద్ధి కలుగదని స్పష్టము.

'తన్యతే విస్తార్యతే అనేనేతి తంత్రం' జ్ఞానమును విస్తారముగ బ్రవరింపజేయుటచే దంత్రమని అర్థము. ఈ తంత్రరహస్య గ్రహణముచే

స్థిరత్వము లభించును. అనుభవనీయులవలననే యీ తంత్రవిషయముల గ్రహింపవలయును. 'తనోతి విపులానర్థాన్ తత్త్వమంత్ర సమన్వితాన్। త్రాణం చ కురుతే యస్మాత్తంత్రమిత్యభిధీయతే॥' (కామికాగమము) తత్త్వమంత్రాన్వితమగు విపులార్థముల నిడి, రక్షణ జేయునదిగాన తంత్రము నా ప్రఖ్యాతము. ఇందు అర్థజ్ఞానము చాల ముఖ్యము.

సాధారణముగ ప్రతిష్ఠా సమయముల బీజాక్షరముల నొక సువర్ణ ఫలకమున వ్రాయుదురుగదా। అదియే యంత్రము. అది బీజాక్షర యుక్తము. ఆ యంత్రబలము ప్రతిష్ట గావించు వ్యక్తిసాధనా, సంకల్పశక్తిపై నాధారపడియుండును.

'ఆగతం శివవక్త్రేభ్యో గతం చ గిరిజాశ్రుతిం. మతం చ వాసుదేవస్య' అని ఆగమ నిర్వచనము. వాసుదేవుని మతము, శివుని ముఖమునుండి బహిర్గతమై, పర్వతరాజపుత్రియైన పార్వతిని చేరినది ఇందు వైష్ణవ, శైవ, శాక్తేయత్రయము గోచరము. వాసుదేవుని మతమైన వైష్ణవము శివునిజేరి శైవమై, అంతశక్తినిజేరి శాక్తేయమైనది. మత సమన్వయము యిందు వ్యక్తము. దీనియందే మన ప్రాచీన భారతీయాధ్యాత్మికౌన్నత్యము సుస్పష్టము.

'ప్రశాసనాత్ శాస్త్రం' శాసించుటచే శాస్త్రము నా ప్రతీతి. 'ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యాచంద్రమసౌ విధృతౌతిష్ఠతః' (బృహదారణ్యకము. 3.8.9) ఓ గార్గీ! ఆ అక్షరు శాసనమువలననే యీ సూర్యచంద్రులు తమ స్థానముల బ్రవర్తించుచున్నారని ఉపనిషద్వచనము. సత్యం వద; ధర్మం చర; సత్యం బ్రూయాత్; న పరదారాం

గచ్ఛేత్, అనునవి శాసనములై, మానవుని ప్రశాంత జీవనమున కాధారములై యున్నవి. ఆ శాసనవాక్యముల నాలకించి, ఆచరించువాడు ధన్యుడు.

ఈ పైన వివరింపబడిన మంత్ర, తంత్ర, యంత్ర, ఆగమ, శాస్త్రవేత్త శ్రీరామకృష్ణుడు. మంత్ర మర్మముల గ్రహించి, మంత్రాను ష్ఠానతత్పరుడై, సర్వదేవతల దర్శనము నొందినవాడు శ్రీరామకృష్ణుడు.

భైరవీ బ్రాహ్మణి సన్నిధిని, తంత్ర రహస్యముల దెలిసికొని, తంత్రానుష్ఠానమొనరించి, సర్వత్ర స్త్రీలను మాతృదృష్టిని దిలకించిన వాడు శ్రీరామకృష్ణుడు.

బీజాక్షర ప్రాశస్త్యమును గ్రహించి. ఏ ఏ బీజాక్షరములు, ఎవ రెవరికవసరమో అనుభవముచే గ్రహించినవాడగుట, ఒక్కొక్క శిష్యునకు, ఒక్కొక్క విధమున బీజాక్షరముల సమకూర్చి, లిఖించి, యంత్రబలమును వారికి చేకూర్చినవాడు రామకృష్ణుడు. ఆ శిష్యవర్గకీర్తి ప్రతిష్ఠలన్నియు ఆ శ్రీరామకృష్ణుని యంత్రబలమే. దేవతలకు యంత్ర ప్రతిష్ఠగాక సాధకులకు యంత్రప్రతిష్ఠ గావించిన మహనీయమూర్తి శ్రీరామకృష్ణుడు.

ఆగమాంతర్గత శైవ, శాక్త, వైష్ణవముల ననుసరించి, బాల్యము వనే శివరాత్రి పర్వదినమున శివునిచందము సమాధినిష్ఠా గరిష్ఠుడగుటచే శైవమును; పరాశక్తియగు గాళికారాధనా మగ్నుడగుటచే శాక్తేయమును; శ్రీరామ, శ్రీకృష్ణాది వైష్ణవ దేవతల దర్శించుటచే వైష్ణవమును, సమ న్వయము గావించినవాడు శ్రీరామకృష్ణుడు.

శిష్యుల మాతృమూర్తివలె ప్రేమించినను, సాధన విషయమున చండ ప్రశాసనుడు, శిష్య శిక్షణాదక్షుడు శ్రీరామకృష్ణుడు.

పై విధమున సర్వ మంత్ర, తంత్ర, యంత్ర, ఆగమ శాస్త్ర వేత్తయై బహుముఖ ప్రజ్ఞాశాలియై, అనుభవమూర్తియై లోకోద్ధారకుడైన శ్రీరామకృష్ణునికి నమస్సులు.

## 80. మరుమరీచీసామ్యసర్వారిష్టవిషయసుఖ వ్యర్థార్థదర్శనాయ నమః

'న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి' (నారద పరివ్రాజకము. 3) భోగముచే గామములు శాంతింపవనునది ఉపనిషద్వాక్యము. ఈ లోకసుఖములు కోరికల నధికము చేయును. అందువలననే వీనిని ఎండమావులతో బోల్చి, యివి అరిష్టదాయకములనియు, తాత్కాలిక సుఖప్రదాయకములనియు, బుద్బుద ప్రాయములనియు అనుభవజ్ఞుల వాక్యము. కావుననే 'దుర్లభో విషయత్యాగో దుర్లభం తత్త్వదర్శనం' (మహోపనిషత్తు. 4) విషయ నిరాసము, తత్త్వదర్శనములు దుర్లభముగ వచింతురు. వైరాగ్యము, మనసా త్యాగము, భగవద్విశ్వాసము పూర్వపుణ్యలభ్యము. కాన నీ సర్వారిష్ట విషయసుఖముల భ్రాంతిగ దలచి, ఆ లౌకిక విషయములు వ్యర్థమనియు దోసి, త్యాగీశ్వరుడై మనిన శ్రీరామకృష్ణునకు నమోవాకములు.

## 81. మతమతాంతరసాధనాతీరసన్నివేశాయ నమః

ఒక్క మతవిషయమును గ్రహించుటయే కష్టము. కాని సర్వమతవిషయముల దెలియుట ఎంతయు అసాధ్యము. ఇక మతాంతర

ముల విషయమనిన దుస్సాధ్యము. మన మతములగు వైష్ణవ, శైవ, శాక్తముల సాధనజేసి, ఆ యా దేవతా సాక్షాత్కారముల బడసినవాడు మన రామకృష్ణ దేవుడు. అట్లే మతాంతరములగు మహమ్మదీయ, క్రైస్తవముల సాధించెను. 'ఏకం సత్ విప్రా బహుధా వదంతి' సత్స్వరూపమేకమే. దానిని పలువిధముల పలుకుచున్నారని గ్రంథ జ్ఞానముచేగాక ననుభవపూర్వకముగా శ్రీరామకృష్ణుడు వచించియున్నాడు. 'మా కమర్పుకూరు గ్రామమున నొక చెరువు కలదు. దానికి నలువైపుల మెట్లుకలవు. నాలుగు భాషలవారు నీటికై వెడలి, తెలగువైపుల దిగి నీటిని తెచ్చుకొనిరి. ఆంగ్లేయుడు 'వాటర్' అనియు, ఉత్తరదేశస్థుడు 'పానీ' అనియు; తమిళదేశస్థుడు 'తన్నీ' అనియు; తెలుగువాడు 'మంచి నీరనియు; వారి వారి భాషాపద్ధతిని పలికిరి. కాని అందరు తెచ్చినది ఒక చెరువునుండియే. అవి భాషాభేదములు, పాత్రభేదములేగదా! అట్లే 'సర్వ మతములు ఒకే సిద్ధిని కలుగజేయు'నని శ్రీరామకృష్ణుడు సర్వులకు గ్రాహ్యమగురీతిని సోదాహరణముగ నీ కథను చెప్పెను. కాన నామ, రూప భేదమే కాని అట అంతయు నేకమే అని సాధనాతీరమును జేరి, అనుభవ సంయుతుడై పలికిన శ్రీరామకృష్ణునికి వందనములు.

## 82. కృష్ణవర్ణవిశిష్టభరతరణీపదకంజయుగళ సేవారక్తియుక్తాయ నమః

కాళికాదేవి కాలస్వరూపిణి. ఆమె వర్ణము నలుపు. నలుపు రంగు ఆకాశమును సూచించును. ఆకసము నూచుటకు సమీపమున నుండినట్లుండినను సుదూరముగ నుండును. కల్మషములు దానిదరిజేరవు. అట్లే నీలవర్ణశోభితయైన కాళికాదేవి భవసాగరమును దరింపగోరువారికి

భవతారిణియై, భక్తులకు అభయ ప్రదాత్రియై, మాతృప్రేమ నారాధించు వారికి వాత్సల్యమూర్తియై, దుష్టులకు భయంకరమూర్తియై, శిష్టులకు రక్షణమూర్తియై, విద్యార్థులకు విద్యాశక్తియై, ప్రాపంచికులకు మాయాశక్తియై చెలువొందినది. కాని శ్రీరామకృష్ణుని దృష్టిలో నామె దయామయి: ఆమె కారుణ్యమూర్తి: ఆమె వాత్సల్యహృదయ: ఆమె ప్రేమ పరిపూర్ణ: ఆమె ఆనందరూపిణి: ఆమె అనురాగనిలయ: ఆమెమందహాస వదన: అట్టి సంపూర్ణవిశ్వాసమున నామె పాదపంకేరుహముల సేవించి, ఆ సేవాభాగ్యనిరతుడైన శ్రీరామకృష్ణునకు నమస్కారములు.

## 83. కృపాసుధారసపరిపూర్ణమృదుల హృదయాయ నమః

సర్వ జీవరాసులకు హృదయము కలదు. హృదయము ప్రేమకు చిహ్నము. పశుపక్ష్యాదులలోగూడ నీ ప్రేమ అంతర్గతమై తమ బిడ్డల బ్రేమించుచున్నవి. మానవుడుకూడ పశుతుల్యుడే: తన పశుత్వమును స్వార్థమును వదలిననాడు వాని హృదయమునగల దయ యింకను సుస్నిగ్ధమై యుండును. అట్టివానికే ఆధ్యాత్మిక జ్ఞానార్హత:

వర్షజలము అగ్నిచే దప్తమైన ఇనుముపై బడ, అది వెంటనే అదృశ్యమగుచు. ఆ వర్షజలమే, తామరాకుపై బడినచో పత్రమున కంటక ముత్యమువలె గోచరించును. కాని ఆ వర్షజలమే, ముత్యపు చిప్పయందు బడినచో ముత్యమై రూపొందును. అదేవిధముగా లౌకిక విషయాగ్నితప్త హృదయముపై భగవదనుగ్రహము ప్రవహించినను అగోచరము. లౌకికవిషయములనిత్యములని భావించువానికి దాత్కాలికముగ భగవదనుగ్రహము గోచరించును. కాని విషయములశాశ్వ

తములవి దృఢసంకల్పుడై, సంస్కారహృదయుడై, సద్గురు సమాశ్రయుడై, సాధనాదులచే జ్ఞానమును పొందగోరు ముముక్షువునకు భగవదనుగ్రహము లభ్యమై, తానే ముక్తమై తనరారును. ఆ యా వ్యక్తిగత సంస్కారములచే నా భగవానుని గ్రహింప యత్నింతురుగదా!

దేవీ కృప అపారమైనది. అమృతతుల్యమైనది. అట్టి దివ్యమాత కృపను పొందిన రామకృష్ణుని హృదయము సున్నితమైనది. ఒకప్రక్క కఠినముగనుండక సంపూర్ణ మృదుత్వమునొందినది. ఆ పరిపూర్ణత దేవీప్రసాదలబ్ధము. అట్టి మృదు మధురసంశోభితుడైన శ్రీరామకృష్ణునకు ప్రణామములు.

## 84. కృత్రిమబాహ్యాచారనిబిడీకృతప్రాచీన సంప్రదాయ విచ్ఛేదకాయ నమః

ఒక్కొక్క దేశమునకు ఒక్కొక్క సంప్రదాయమున్నది. మన ప్రాచీన భారతీయ సంప్రదాయము ఆధ్యాత్మికత్వము. మానవుడు పశుత్వమును బాసి, మానవత్వమును నిలుపుకొని, దైవలక్షణోపేతుడై, బ్రహ్మత్వమును పొందు సంప్రదాయము భారతీయ సంప్రదాయము. ప్రథమమున 'శరీరమాద్యం ఖలుధర్మసాధనం' ధర్మసాధనమునకు శరీరము ముఖ్యముగదా! ఈ శరీరశుభ్రతకు స్నానాదులు, శరీర పోషణకు భోజనాదులను నియమముగ నైకొనిన ఆరోగ్యము బాగుగానుండును. ఉదయము 8 గంటలకు స్నానముగాక, తెల్లవారుజామున లేచి స్నానము చేసిన మంచిదని విజ్ఞుల అభిప్రాయము. అందులకే కార్తీక స్నానములు, మాఘ స్నానములు. అట్లే శరీరపోషణకూడ మితముగా నుండవలెనను భావముతో నుపవాసముల నేర్పరచిరి. మనోపోషణకు ధర్మా

చరణము, సద్గ్రంథ శ్రవణము, పూజాదికముల నిర్ణయించిరి. మన సంప్రదాయములకు, మన పర్వదినములకు, మన ఆచార వ్యవహారములకును పై జ్ఞానికాధ్యాత్మిక అంతరార్థములు గలవు. అట్లుగాక కేవల అర్థరహిత బాహ్యాచారములను వ్యతిరేకించినవాడు శ్రీరామకృష్ణ దేవుడు. అట్టి వ్యర్థ సంప్రదాయముల ననర్థమని, వానిని విచ్ఛేదమొనర్చి ప్రబోధించిన శ్రీరామకృష్ణ దేవునకు నమోవాకములు.

## 85. కృపణాధునికప్రపంచపరిరక్షాదక్ష యుక్తాయ నమః

భౌతిక విజ్ఞానమభివృద్ధి చెంది, సుఖము నొందుటకు నేటి మానవుడు కొన్ని వసతుల నేర్పరచుకొనెను. భౌతిక సుఖాపేక్షలకై నేటి మానవుడు తపించి, భౌతికవిజ్ఞానశాస్త్రము నభివృద్ధిజేయుచు, సర్వ సుఖముల నేకకాలమున పొంద ఆశ అధికమైనది. శరీర సౌందర్య సాధనముల నేర్పరుప, ఒకపరి అవియే వికారముల గలిగించును. శీఘ్రముగ నేగుటకు అనేక వాహనముల నిర్మింప, వానిచే మానవుడు శీఘ్రముగ మృత్యువు నొందుచున్నాడు. వివిధములైన విద్యుద్దీపముల కాంతిచే, బుట్టిన నాటినుండియే గంటియద్దముల నుపయోగింపవలసిన స్థితి ఏర్పడినది. ధనముచే నన్ని సౌకర్యములు గలుగునను భావము మానవునకు స్థిరపడి, అక్రమ ధనార్జనకు బూనుకొనుచున్నాడు. ఇన్ని సౌకర్యముల నేర్పరచుకొనినను అశాంతి నొందుచు, గాఢ నిద్రాసుఖమునకుగూడ నోచుకొనక నిద్రకై మాత్రల మ్రింగుచున్నాడు. ఇది నేటి ప్రపంచస్థితి, మానవుని మనస్థితి.

ఈ అధునిక సుఖములు నాటి ప్రాచీనులకు దెలియదనుట హాస్యాస్పదము. ధనముచే శాంతి లభింపదు. ధనముచే మహాత్ములు లభింపరు.

ధనముచే శాశ్వతానందమలభ్యము. అవసరమగునంతవరకు అనగా మన ధార్మిక జీవితమునకాటంకము కానంతదనుక వీనిని ఉపయోగించుకొన వచ్చును కాని అనవసరముల బెంచుకొని అశాంతిని పొందరాదు.

ఆధునిక ప్రపంచమున, ఆధునిక సుఖ సంపదల మునిగి, ఆధునిక సమస్యలగూడ బెంపొందింప జేసికొని, అత్యాధునికముగ నుండుటకు ప్రయత్నము సలుపుటయే నేటి మానవుని ఉద్దేశము. ఇట్టి ఆధునిక ప్రపంచమును రక్షించుటలో సమర్థవంతుడు శ్రీరామకృష్ణుడు. ఆయన జీవితోపదేశముల బఠించినచో నీ సత్యము దెలియగలదు. ఇట్టి ఆధునిక ప్రపంచముననే, లౌకిక సుఖములన్నియు గలిగిన మహానగరమగు గలకత్తాలో జన్మించి, ధనవంతులై విద్యావంతులైన, యువకుల మనస్సులను ప్రాచీనాధ్యాత్మికసంపదలపైపు మరల్చినవాడు శ్రీరామకృష్ణుడు. అట్టి సర్వ సమర్థుడైన శ్రీరామకృష్ణ దేవునికి నమస్సులు.

## 86. కృష్ణమేఘమండలస్థశ్వేతవిహంగదర్శనోద్భూతసమాధిరతాయ నమః

ఆబాల్య సమాధిరతుడు రామకృష్ణుడు. అట్టి సమాధి స్థితులనొందిన దివ్యాత్ముల జీవితవిధానములో నొక ప్రత్యేకత గోచరించును. బాల్యము నుండి ఏకాంతవాసమభిలషించుట, దివ్యదృశ్యముల సందర్శించుట, సర్వకాలముల భగవత్సంబంధమగు సంభాషణముల నొనరించుట, ఎల్లప్పుడు ఆనందమున నుండుట, అను లక్షణములు వీరియందు గనిపించును. పూవు మొగ్గరూపమున నుండినప్పుడే సువాసనలు అందంతర్గతముగ నుండినట్లు మహాత్ముల బాల్యముననే సత్సంస్కారములంతర్గతమై యుండును.

గదాధరునకు (అనగా శ్రీరామకృష్ణుని బాల్యనామము) ఆరు వత్స రముల ప్రాయము. సాయం సమయమున నొకనాడు పేలాలను దీసి కొని, గదాధరుడు పొలముగట్టుపై నడచుచుండెను. అంతలో నాకసమున నల్లని మేఘము క్రమ్మెను. వెంటనే ఒక్క ఉరుముకూడ ఉరిమెను. గట్టువెంటగల వృక్షముపై వసించుచుండిన శ్వేత విహంగములు భయ ముతో లేచి బారులుదీర్చి వెడలుచుండెను. ఆ దృశ్యము చూచుటకు హృదయంగమమై యున్నది. ఆ నీలమేఘముపై బయనించుచుండిన ఆ తెల్లని కొంగలబారును గాంచిన యీ బాలగదాధరునకు, నల్లని మేఘము నీలమేఘశ్యాముడును, గోపాల బాలుడును, మురళీధరుడును, హృదయచోరుడును, ముగ్ధమోహనుడును, దేవకీనందనుడైన శ్రీకృష్ణ పరమాత్మవలెను, ఆ కొంగలబారు శ్యామసుందరుని కంఠమున గల మత్యముల హారమువలెను గోచరింప, నా బాలుని మనస్సు ఆ పరిసర ముల మరచి, బాహ్యస్మృతినివీడి, అవ్యయానంద సమాధి సంస్థితుల లయమొందెను. ఈ విధముగ బాల్యముననే సమాధ్యనుభూతుల నొందిన శ్రీరామకృష్ణునకు వందనములు.

## 87. కృచ్ఛ్రసంజనితాఖిలసంస్కృతికారణసంస్కార దూరస్థాయ నమః

బాల్యమునుండియు మానవుడు సత్సంస్కారముల, దుష్ట సంస్కా రముల గలిగియుండును; సత్సంస్కారాభివృద్ధిచే సత్పురుషుడగును దుష్టసంస్కారాభివృద్ధిచే దుష్టుడగును. దుష్ట సంస్కారములు దుర్బు ద్ధిని పెంపొందించి, చెడుమార్గమును ద్రొక్కించి బాధించును. సత్సం స్కారములు సద్బుద్ధిని కలిగించి, సన్మార్గమున నడిపించి ఆనందమును

కలిగించును. దుష్టసంస్కారములు మానవుని బంధింప, సత్సంస్కారములు మానవుని బంధములనుండి విడివడజేయును. అందుచేతనే మానవుడు సత్సంస్కారవంతుడై, సన్మార్గగామియై, సత్సాంగత్యము నభిలషించి, సత్స్వరూపమును బొంది,సత్పురుషుడగుటకు బ్రయత్నము సలుపవలయును.

అవిద్యాజన్యములును, సంసృతి హేతువులునగు సంస్కారములను దూరముగ నుంచుదురు మహాత్ములు. అందుచేతనే వారు మహాత్ములగుదురు. అట్టి మహనీయుడైన శ్రీరామకృష్ణునకు బ్రణామములు.

## 88. కృతాదిచతుర్యుగబద్ధకాలచక్రనిబద్ధసర్వ జీవోద్ధారకాయ నమః

అనంతకాలమునుండి యీ ప్రపంచమును, యిందలి జీవులను 'ధాతా యథాపూర్వమకల్పయత్' అనుచందము బ్రహ్మ యథాపూర్వముగ సృజించుచుండెను. 'పరివర్తిని సంసారే మృతః కో వా న జాయతే' సంసారమున పరిభ్రమించుచుండిన మృతులు మరల జన్మింతురను భర్తృహరి వచనమురీతి యీ జీవులు ఎన్ని యుగములనుండి జనించుచున్నారో గదా! ఎంతమంది బద్ధ జీవులో! ఎంతమంది ముక్తపురుషులో! ఎంత మంది మహనీయులో!

కృత, త్రేతా, ద్వాపర, కలియుగములుగ యుగములు చతుర్విధము. పరిణామసిద్ధాంతప్రకారము అచరములు చరములగుచు, స్థావరములు జంగమములగుచున్నవి. ఆ ద్వివిధములో మరల జంగమముల బరిణామము. దానవుడు మానవుడగుట, మానవుడు మాధవుడగుట, జీవుడు శివుడగుట గోచరము. అందువలన చతుర్యుగముల

బద్ధులై, కాలచక్రమున జననమరణములమధ్య నలుగుచున్న సకల జీవుల నుద్ధరించుట ఒక్క భగవంతునికే సాధ్యము. అట్టి భగవత్స్వరూపుడగు శ్రీరామకృష్ణునకు నమస్సులు.

## 85. కృష్ణకిశోరదేవమధురామృతప్రేమవీచికాజాల నిమగ్నచిత్తాయ నమః

మానవుని బాల్యములో నానందము కలదని సామాన్యుల భావన. లోకమున ప్రతి తల్లి, తన శిశువును గాంచి పొంగిపోవును. తరువాత వాడి, భావి జీవితమున నీ శిశుత్వము అనగా పసిభావమభావమై, ఆ స్థానమును పశుత్వ, స్వార్థములు ఆక్రమించుటచే నానందమగోచరము. యౌవనమున యౌవనగర్వము. ఉన్నతోద్యోగమున అహంకారము అభివృద్ధి చెంద, వృద్ధత్వమున సర్వేంద్రియ పటుత్వము తగ్గి కోపతాపములు అధికమైనప్పుడు యిక ఆనందమెక్కడిది?

కాని లోకోద్ధారకులైన మహాత్ములు జన్మించుటచేత తల్లిదండ్రులకేకాక లోకమునకే ఆనందము కలుగును. వారి బాల్యమున నితరులే ఆనందించునప్పుడు కన్నతల్లికి ఎంత ఆనందమో! శ్రీరామచంద్రుని గని, పెంచిన ఆ కౌసల్యాదశరథులు నాడెంత ముదమొందిరో! అట్లే శ్రీరామకృష్ణ దేవుని జన్మకు గారణభూతులైన ఆ చంద్రామణీఖుదీరాముల మోదమును వర్ణించుట అసాధ్యము. బాల్యలక్షణములగు సుకుమార, అమాయక, నిర్మల ప్రేమలు బాల్య, యౌవన, వృద్ధత్వములలోగూడ మహాత్ములలో సువ్యక్తము. అది సాధన, బ్రహ్మచర్యము, భగవదనుగ్రహములచే లభించును. సాధనాపటిమచే సౌకుమార్య,

అమాయకత్వ, నైర్మల్యతలు వృద్ధి పొంది, వారిని దర్శించువారికి ప్రశాంతతను ప్రసాదించును. శరీరమునకు మార్పులు కలిగినను, వారు మాత్రము నిత్యము పసివారై యుండగలరు. సామాన్య బాల్యత్వ లక్షణములగు చంచలత్వ మూర్ఖత్వములుగాని; యౌవనమున నుండు విషయ వాంఛ, పశుత్వ, మమత్వములుగాని; వృద్ధత్వమున గల చపలత, క్రోధాదికముగాని ఆ మహనీయులయందభావమై, నిశ్చలులై, విషయ విముఖులై, మమకారాహంకారాదికమునకు దూరులై, పరమ పవిత్రులై, సర్వమున దైవమునే దర్శించు పసిమనస్తత్వముగలవారు మహాత్ములు. అది యథార్థ స్థితి। లౌకికులు. లౌకికవిషయములు వారికి దూరమే.

అట్టి పసితత్త్వసంయుతుడు శ్రీకృష్ణుడు. ఆయన ఎల్లప్పుడు కృష్ణకిశోరుడే। ఆనాడు పెంచిన తల్లి యశోదకేగాక పసితత్వము, హృదయపవిత్రతలచే గాంచువారికి నాటికి, నేటికి, ఏనాటికైనను ఆయన కిశోరుడే। అదే శ్రీకృష్ణుని ప్రత్యేకత। అది అందరికి అర్థముకాదు. దానిని లౌకికులు గ్రహింపజాలరు. అది ఆధ్యాత్మికౌన్నత్యముచే లభించును. ఆ తత్త్వమును భక్తులు, జ్ఞానులుమాత్రమే గ్రహింపగలరు.

పై విధమున అట్టి అమాయకత్వాది సద్గుణ శోభితుడైన శ్రీరామకృష్ణుడు ఆ కృష్ణకిశోరుని మధురామృతప్రేమవీచికా సమూహమునందు మగ్నచిత్తుడై, ఆధ్యాత్మిక జ్ఞానముచే ప్రకాశించెను. అట్టి శ్రీరామకృష్ణునకు వందనములు.

# 90. కృష్ణదర్శనపావిత్రజానందసాగర విహారాయ నమః

భగవద్దర్శనముచే నానందము గోచరము. భగవంతుడొక్కడే సత్యమనియు, నీ సర్వలౌకిక సంపద అశాశ్వతమని భావించి, భగవ ద్దర్శనమునకై పరితపించి, దుఃఖించి, వియోగముచే బాధనొందినవానికి భగవద్దర్శనమెంత అనందదాయకము! ఆ యానందము లోన నిలువదు. బయటకు వ్యక్తమగుచుండునుగదా! ఇక అతడికి వేరొకరిని జూచిన ఈర్ష్యా సూయలు కలుగునా? ప్రాపంచిక విషయముల నతడు బ్రవేశింపగలుగునా? తనను గూర్చి ప్రచారము చేయుటకు సమ్మతించునా? మోసము చేయ నిచ్చగించునా? యథార్థ భగవత్సందర్శనమున నివి నశించి ఆనందము ద్యోతకమగును. ఆ యానందము రాను రాను విశాలమగును. కాని సంకుచితము కాదే! సంకుచితమను పదము ఆ భక్తులకు వర్తింపదు. ఇది సత్యము. ముమ్మాటికి సత్యము.

భగవద్దర్శనమందరికి సాధ్యముకాదు. పవిత్రధనునికే దైవ సందర్శనము! యథార్థ భక్తిసంపన్నునికే భగవదనుభూతి! అనవరత ఉపాసనాసిద్ధియే భగవత్ సాక్షాత్కారము. అట్టి అలౌకిక భక్తి, పూర్వ జన్మసుకృత లభ్యము. శ్రీరామకృష్ణునకు పూర్వ జన్మ లేకుండినను ఉపాసనాపటిమచే గృష్ణకిశోరుని దర్శింపగలిగెను. ఆ దర్శనముచే నాయన చిత్తము ఆనందమయమై, ఆ యానందము సాగరోపమమై, ఆ సాగరమున నానందవిహారము సల్పుచుండెను. అట్లు శ్రీకృష్ణ సందర్శనా నందముచే ధన్యుడైన శ్రీరామకృష్ణునికి నమోవాకములు.

## 91. షాక్షరసూచితషడ్భావవికారశూన్యనిర్వికార తత్త్వాయ నమః

జీవికి షడ్భావ వికారములుండును. అవియే 'అస్తి, జాయతే, వర్ధతే, పరిణయతే, అపక్షీయతే, వినశ్యతే' (గర్భోపనిషత్తు) అని షడ్విధములు. అస్తి (ఉన్నది), జాయతే (పుట్టుచున్నది), పరిణమతే (మార్పునొందుచున్నది), అపక్షీయతే (క్షీణించుచున్నది) వినశ్యతే (నశించుచున్నది) అని అర్థము స్పష్టము. ఈ వికారములు శరీరమునకు మాత్రమే కలవు. ఇట్టి వికారభూయిష్ఠ శరీరమును ధరించి, దేహముతోబాటు మనోవికారముల నొందుచు, దానిచే రాగద్వేషములఁబొందుచు, పుణ్యపాపముల నలపుచు, నిర్వికారమగు పరబ్రహ్మతత్త్వమును గ్రహింపనేరక పలుబాధల మ్రగ్గుచుండువాడు జీవుడు. కోటానుకోట్ల జన్మముల నొందుచు దరిగానక దుఃఖించువాడు జీవుడు. శాస్త్రప్రబోధముల ద్రోసిరాజని, అనుభవమూర్తులైన మహాత్ముల బరిహసించి అశాంతి పాలగువాడు జీవుడు 'ముక్తిర్నో శతకోటిజన్మసుకృతైః పుణ్యైర్వినా లభ్యతే' (వివేకచూడామణి: 1) శతకోటి జన్మసుకృతపుణ్యము వినా ముక్తి లభ్యముకాదనుచందము పరంపరగ నేతెంచు బంధముల నివారించుకొనుట కష్టసాధ్యము. వికారములు ఆత్మకుకూడ కలవను భావనము దూరీకృతము చేయుట కష్టసాధ్యము. ఈ షడ్భావవికారసంచయములేనిదే పరబ్రహ్మమని అనుభవపూర్వకముగ గ్రహించుట యింకను కష్టసాధ్యము.

'షా' అను అక్షరమున గల 'ష' కారము షడ్భావవికారరహిత నిర్వికారతత్త్వమును నిరూపించుచున్నది. అట్టి షడ్భావ వికారయుక్తమైన

శరీరమును దరించినను, నిర్వికారతత్త్వ పరబ్రహ్మానుసంధానమున నిర్వికల్పసమాధి నొంది, నిర్వికార స్వరూపుడైన శ్రీరామకృష్ణునకు వందనములు.

## 92. 'ష్ణా' నిరూపితషణ్మాససహజనిర్వికల్పస్థితాత్మానందనిమగ్నాయ నమః

ఏడు సెకెండ్లు కాలము మనస్సు నిలిచిన ధ్యానమనియు, $7 \times 7 = 49$. నలుబది తొమ్మిది సెకెండ్ల కాలము నిలిచిన ధారణ అనియు, $49 \times 7 = 343$, మూడువందల నలుబది మూడు సెకెండ్లు, అనగా ఐదు నిమిషముల నలువది మూడు సెకెండ్లు నిలిచినచో సమాధి అనియు శ్రీ పతంజలిమునివరేణ్యుడు తన యోగసూత్రగ్రంథమున వ్రాసియుండెను. ఈ సమాధి సంస్థితులైనను 'పరం వైరాగ్యమాశ్రితాః' అనురీతి వైరాగ్యశిఖామణులకు, విషయవిదూరులకు, నిష్కళంకులకు లక్ష్యముకాని విషయలంపటులై, ప్రాపంచికభావముల మగ్నువారికి దుస్సాధ్యము, అసాధ్యము. అసలు ధ్యానమే కుదరని మనస్సు దివ్య సమాధ్యానందమున మగ్నత నొందుటయా! పూజ చేయుకాలముననే లౌకిక విషయముల వెన పర్వులెత్తుచు, స్వేచ్ఛగా సంచరించుమనస్సు నరికట్టుట బహు కష్టసాధ్యము. అధికకాలము ప్రాపంచిక జీవితమున నవవిరుగ దిరుగు మనస్సు నిర్వికల్పసమాధిలో విహరించుట సామాన్యులకు సాధ్యమా?

ఆ సమాధ్యనుభూతులు పసిహృదయులకే సాధ్యము! అయ్యవి సమస్త స్త్రీలయందును లోకైకమాతను దర్శింపగలవారికే సాధ్యము!

మరియు, నయ్యది బాహ్య మనకు పత్నియని వ్యవహృతమగు శ్రీ శారదా దేవియందును, జగజ్జనని కాళికామాతను వీక్షింపగలిగిన పుణ్యమూర్తి, బ్రహ్మచర్యనిష్ఠా గరిష్ఠుడైన శ్రీరామకృష్ణ పరమహంస గురువరేణ్యునికే సాధ్యము! అయ్యది, శ్రీ కాళికామాత కృపాకటాక్షవీక్షణాలబ్ధుడును, శ్రీ కాళికాదేవి అనుగ్రహపుత్రుడునైన శ్రీరామకృష్ణ దేవునికే సాధ్యము! అయ్యది, సర్వతంత్రవిశారదయైన భైరవీ బ్రాహ్మణికడ సకల తంత్రవిద్యా రహస్యముల గ్రహించి, దేవ్యనుగ్రహమున సాధించిన శ్రీరామకృష్ణ గురుపుంగవునికే సాధ్యము! అయ్యది, అద్వైతానుభూతియగు నిర్వికల్పసమాధ్యనుభవ రహస్యముల నబ్బ్యనకు బోధింపనేతెంచిన ఆ తోతాపురీ శిష్యరత్నమగు శ్రీరామకృష్ణ దేవునికే సాధ్యము! అట్టి సహజ నిర్వికల్పసమాధి స్థితులలో నారు మాసములుండుట సామాన్యులకు సాధ్యమా? అదియు నా పరమహంసచంద్రునికే సాధ్యము!

అట్లు ఒక పర్యాయము ఆరు మాసములు నిర్వికల్ప సమాధ్యనుభూతుల నుండుకాలమున శ్రీరామకృష్ణ దేవుని శరీరపోషణ, సంరక్షణ, భారముల హృదయరాముడు వహించెను. శీతకాలమున, నొక చిన్న మంటను జేసిన హృదయుడు, సమాధి స్థితినున్న శ్రీరామకృష్ణుని ఆ మంట ప్రక్కను పరుండబెట్టి, ఏదియో పనిగలిగి బయటికి వెడలి, వెంటనే తిరిగి వచ్చెను. అంత శ్రీరామకృష్ణుడు ఆ మంటలోనికి దొర్లి అందే యుండెను. శరీరము కాలుచున్నను ఆయనకు బాహ్య స్మృతి లేదు. దానిని గాంచిన హృదయుడు చింతించుచు, శ్రీరామకృష్ణుని బయటకు లాగి, మందుల రాసి ఆ గాయమును మాన్పెనట! అదియే సమాధి మగ్నత! ఆ ఉన్నతాధ్యాత్మికస్థితుల నెవరు గ్రహింపగలరు? 'షా, నిరూపితమైన షకారము, షణ్మాసములు సమాధిస్థితుల మునిగినట్లు

నిర్వచించుచున్నది. ఆ విధమున షణ్మానములు సహజ నిర్వికల్ప స్థిత్యానందవిభూతుల నోలలాడిన శ్రీరామకృష్ణ దేవునకు నమస్సులు.

## 93. 'ష్ణ' రూపకషట్చక్రసవిష్టషడ్దేవతాసంసేవిత దేవాధిదేవమూర్తయే నమః

మానవునిలో బాహ్యమునకు గోచరించని అనేక దివ్యశక్తులు కలవు. ఆ శక్తులను గ్రహించిన శక్తివంతుడగును. గ్రహింపకుండిన శక్తిహీనుడగును. మానవునిలో కుండలినీ శక్తి ఒకటి కలదనియు, ఆశక్తి మూలాధారమున గలదనియు, దానిని ప్రాణాయామముచే మేల్కొలిపి ఊర్ధ్వగమనము జేయించిన, నది సహస్రారమును జేరి,సమాధి సంస్థితుల లయమొనరించుననియు యోగసిద్ధాంతము. ఆ కుండలినీశక్తి వెన్నెముకయందుగల షట్చక్రములద్వారమున బ్రయాణము సాగించును. అవియే 1. మూలాధారము. 2. స్వాధిష్ఠానము. 3. మణిపూరకము. 4. అనాహతము. 5. విశుద్ధము. 6. ఆజ్ఞా చక్రములు. ఈ ఆరు చక్రములకు ఆరుగురు అధిష్ఠాన దేవతలు కలరు. వారు క్రమముగ గణపతి. బ్రహ్మ, విష్ణువు, ఈశ్వరుడు, శివుడు, సదాశివుడు. సాధకుడు షట్చక్ర స్థానముల గ్రహించి, షడధిష్ఠాన దేవతా రహస్యముల దెలిసి కొని, ఆ యా దేవతల లక్షణముల గుర్తెరిగి సహస్రారమును జేరును. శ్రీరామకృష్ణ దేవుడు యీ సాధనా రహస్యముల నామూలాగ్రముగ గ్రహించి, అనుభవించిన యోగస్వరూపుడు అందువలననే 'ష్ణ' అక్షరమునందు గల షకారము షట్చక్రములను, ఆ షట్చక్రాధిష్ఠాన షడ్దేవతల నిరూపించుచున్నది. ఆ యా సాధనలచే, ఆ యా అధిష్ఠాన దేవతల బొంది వారిచే సేవింపబడిన దేవాధిదేవుడును, యోగసామ్రాట్ అనదగు శ్రీరామకృష్ణ యోగిపుంగవునకు బ్రణామములు.

## 94. 'ష్ఠా'నిర్దిష్ట షోడశకళాపరిపూర్ణాధ్యాత్మికశశి స్వరూపాయ నమః

పరిపూర్ణాధ్యాత్మికస్థితి నొందినవారు లోకమున అరుదుగనుందురు. కళాస్వరూపుడగు భగవంతుడు, సకల కళలకు నిలయమైనవాడు. ఆ సకల కళలలో ఏ ఒక్క కళనైనను భగవంతునికి అర్పించువాని జీవితము ధన్యము గదా! శిల్పము, చిత్రలేఖనము, నాట్యము, సంగీతము, సాహిత్యము, కవిత్వము, వక్తృత్వములు కళలు. మనకు కళలు అరువది నాలుగు. అవి మరల ముప్పది రెండుగ అయినవి. అవి మరల క్లుప్తమై పదునారుగ చెప్పబడినవి. అవియే షోడశ కళలు నా ప్రసిద్ధి కలదు. ఈ లౌకికమైన కళలలో నొక్కటి గలిగిన 'కళాపరిపూర్ణ' యను బిరుదు లభించును. కాని షోడశకళానిష్ఠాతులైనవారి నేమనవలయును? వారిని మహాత్ములు, అవతార పురుషులు అననగును. వారు సర్వ కళాకోవిదులు.

ఈ షోడశకళా వివరణమున ఒక్కొక్క ఉపనిషత్తు ఒక్కొక్క విధానమును సూచించినవి. ఏది ఎట్లున్నను షోడశ కళాపరిపూర్ణత్వము ఆధ్యాత్మికానందస్వరూపులకే సాధ్యమనునది ముమ్మాటికీ సత్యము. ఆ కళావైభవము అలౌకికులకే! ఆ కళాపరిపూర్ణత సమాధినిష్ఠాగరిష్ఠులకే! ఆ కళాప్రాభవము ఇంద్రియ విగ్రహులకే!

ప్రణవమే బ్రహ్మమనియు, బ్రహ్మమే ప్రణవమనియు అన్వయము. అందుచే 'బ్రహ్మ ప్రణవః షోడశమాత్రాత్మకః। సోఽవస్థా చతుష్టయ గోచరః। జాగ్రదవస్థాయాం జాగ్రదాది చతస్రోఽవస్థాః। స్వప్నే స్వప్నాది చతస్రోఽవస్థాః। సుషుప్తే సుషుప్త్యాది చతస్రోఽవస్థాః। తురీయే తురీయాది చతస్రోఽవస్థాః।' బ్రహ్మము

ప్రణవము. అది పదునారు మాత్రలు కలది. అందు అవస్థా చతుష్టయము జాగ్రత్స్వప్నసుషుప్తి తురీయములు. ఒక్కొక్క అవస్థయందు మిగిలిన మూడవస్థలు కలవు. కాన మొత్తమునకు షోడశ అవస్థలను, పరమహంస పరివ్రాజకోపనిషత్తు వివరించెను.

అంత, ఛాందోగ్యోపనిషత్తు ఆ షోడశకమునే వేరొక విధమున వివరించెను. ఆ బ్రహ్మము ప్రకాశవాన్, అనంతవాన్, జ్యోతిష్మాన్, ఆయతనవాన్ అను పాద చతుష్టయముగ నుండి; మరల ఒక్కొక్క పాదము చతుర్విధమై; 'ప్రాచీదిక్కలా, ప్రతీచీదిక్కలా, దక్షిణదిక్కలా, ఉదీచీదిక్కలా' (4.5.2). 'పృథివీకలా, అంతరిక్షం కలా, ద్యౌః కలా, సముద్రః కలా' (4 6 3) అనియు; 'అగ్నిః కలా, సూర్యః కలా, చంద్రః కలా, విద్యుత్కలా, (4.7.3) అనియు; 'ప్రాణః కలా, చక్షుః కలా, శ్రోత్రం కలా, మనః కలా' (4.8.2) అను షోడశకళలతో నలరారుచున్నది.

ఇక, ఓంకారమును ప్రధానముగ స్వీకరించినది నారద పరివ్రాజకోపనిషత్తు. ఓంకారము అకార, ఉకార, మకార, అర్ధమాత్రలను గలిగియున్నదిగదా! ఆ ఓంకారమున గల మాత్రాచతుష్టయమును గ్రహించి, వానికి నాద, బిందు, కళ, కళాతీత, శాంతి, శాంత్యతీత, ఉన్మనీ, మనోన్మనీ, పురీ, మధ్యమా, పశ్యంతీ, పరా అను ద్వాదశకమును గలిపి మొత్తమునకు షోడశకములుగ ప్రబోధించినది.

బాహ్యదృష్టికి భిన్నముగ గోచరించు నీ షోడశకళలకు గమ్యమొక్కటియే! సాధననుండి సిద్ధత్వమువరకు నిందే గలదు. శ్రోత్రాదీంద్రియ స్వాధీనుడై; సూర్యచంద్రాగ్నులవలె ప్రకాశవంతుడై;

అవస్థా చతుష్టయమును సాధనాదులచే సాధించి; తురీయుడై యొప్పారి; అకార ఉకార మకారములచే పరాపశ్యంతి మధ్యమాదుల ఉనికిని గ్రహించి; నాద బిందు కళల కతీతుడై; ఉన్మని, మనోన్మనీ స్థితుల నోలలాడి; శాంత శాంత్యతీత స్థితుల సర్వ దిక్కులకు, సకల లోకములకు ప్రసాదింప గలిగినవాడు షోడశకళాప్రపూర్ణుడనుటలో నెట్టి సందియమును లేదు. షోడశకళాప్రపూర్ణుడైన చంద్రుడు వృద్ధిక్షయములను పొందుచు, సామాన్య మానవులకు మాత్రమే ఆహ్లాదమును కలిగింప. నీ ఆధ్యాత్మిక షోడశకళాప్రపూర్ణుడైన మహనీయుల గాంతి కిరణములు సర్వవేళల సాధకకోటికి బ్రహ్మానందమును జేకూర్చుచున్నవి.

అట్లు 'ష్ణా' నిర్దిష్టమగు షకారము షోడశకళను బోధించుచున్నది. అట్టి షోడశకళల నవలీలగ దైవ్యానుగ్రహమున సాధించినవాడు శ్రీరామకృష్ణ పరమహంస దేవుడు. ఆ దివ్యమూర్తి సాధకులకు రంజనీకరుడై, ఆధ్యాత్మికానుభవచంద్రికల వెదజల్లి, తన శీతల స్పర్శచే సాధకుల బరిదాపమును నశింపజేసి, వారిపై సుధావర్షమును గురిపించెను. ఆ మహాత్ముని దివ్య స్పర్శామాధుర్యము వివేకానందాది యువకబృందమునకే దెలియును. ఆ అవతారమూర్తి చల్లని కరస్పర్శ ఎట్టివారినిమార్చి, వారికెంతటి ఆనందమొసగూర్చినదో నాడు దానిని గ్రోలినవారికే గ్రాహ్యము. అట్టి పరిపూర్ణ షోడశకళలచే నలరారు శశిస్వరూపుడైన శ్రీరామకృష్ణునికి వందనములు.

## 95. 'ష్ణా'నామకనానాత్వసంపీడితజీవావరణా మాయావిచ్ఛేదకాయ నమః

బంధమున దగుల్కొనియుండుట జీవ లక్షణము. ఆ బంధ విచ్ఛేదనకై గాంక్షించుట ముముక్షు లక్షణము. ఆ బంధ విముక్తిని

పొందుట ముక్తుని లక్షణము. ఆ బంధమునుండి విడిపడుటకే సాధన. ఆ సాధనగూడ గురు సన్నిధానమున గావింపవలెను. ఆ గురు పుంగవుడును భగవదనుగ్రహ ప్రాప్తము.

బంధము మాయా జనితము. మాయ యన 'యా మా సా మాయా' ఏది లేనిదో అదియే మాయ యని అర్థము. లేనిమాయ, లేని బంధముల, లేని జీవత్వమును కల్పింప, వానిని నిత్యములుగ భావించి, సత్యమునకై చపించువాడు బద్ధుడు. లేనివి బాధించు టేమి యనియు, సత్యస్వరూపము తానే యనియు గ్రహించువాడు ముక్తుడు. తానొక్కడే అయినను ఆవరణ మాయచే భ్రాంతుడై, అనేకత్వముచే పీడింపబడి, నానా బాధలనొందుచు, సంసారమున పరిభ్రమించుచు 'జాతస్య హి ధ్రువోమృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ' (గీత. 2.27) అను గీతా వాక్యముచందము జన్మమరణముల నొందుచు జీవుడు దుఃఖించుచున్నాడు. ఆ దుఃఖనిర్మూలనము ఏకరూపమగు బ్రహ్మమును పొందినవానికే సాధ్యము. ఆ బంధవిముక్తి ముక్తునికే సాధ్యము! ఆ మాయను దూరీకృతము జేయుటకు మాయాతీతునికే సాధ్యము! అంత, గుర్వను గ్రహమున సాధనచే మోక్షసామ్రాజ్యాధిపత్యమును సంపాదించును.

'ష్ణా'ంతర్గతమగు నకారము నానాత్వమును సూచింప, ఆ నానాత్వ పీడిత చతుష్యగ బద్ధజీవుల ఆవరణమాయా విచ్ఛేదకుడగు శ్రీరామ కృష్ణునికి నమస్కారములు.

# 96. 'షా'లక్షితనశ్వరమాయాప్రపంచవిషయ విషదూరాయ నమః

పంచ భూతాత్మకము ప్రపంచము. ఆ పంచభూత కర్త భగవానుడు. ఆ పంచ భూతములచే దయారొనర్పబడినవాడు జీవుడు. ఆ పాంచ భౌతిక శరీరయుతుడై, పంచ భూతనిర్మిత దశేంద్రియములకు వశీకృతుడై, శబ్దాది విషయములచే జన్మ పరంపర బొందుచున్నాడు. అందుచేతనే అనుభవజ్ఞుడైన అది శంకరుడు, తన 'వివేకచూడామణి' గ్రంథమున 'శబ్దాదిభిః పంచభి రేవ పంచ పంచత్వమాపుః స్వగుణేన బద్ధాః। కురంగ, మాతింగ, పతంగ, మీన, భృంగాః నరః పంచభిరంచితః కిం॥' (వి.చూ.78) అని వచించియుండెను. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు నాబడునవి గుణపంచకము. శబ్ద గుణముచే కురంగము, అనగా లేడియు, స్పర్శచే మాతంగము అనగా గజరాజును, రూపముచే పతంగము అనగా మిడుతయు, రసముచే మీనము అనగా మత్స్యమును, గంధముచే భృంగిమయు నొక్కొక్క గుణముచేతనే బంధింపబడుచున్నవి. కాని యీ శబ్దాది పంచకముతోగూడిన మానవుని విషయవేమి? అని ప్రశ్నించుట ఆశ్చర్యము. ఆ సమాధానము ఎవరికి వారు వచింపదగినదే!

కాన మాయ నశ్వరము. మాయానిర్మిత ప్రపంచము నశ్వరము. అందలి విషయములు నశ్వరము. మరియు విషతుల్యములు. 'ఉపభుంక్తం విషం హంతి విషయాస్స్మరణాదపి' విషయ భుజించిన వానినే హతమార్చునుగాని, యీ విషయముల స్మరించినంతమాత్రముననే నాశనము జేయునవనరీతి విషయలోలురకు అధ్యాత్మికానుభూతి దుర్లభము. విషయవిదూరులకు, అనంధామభవము కరతలామలకము.

ష్ణాంతర్గత నకారము, నశ్వర ప్రపంచ విషయముల దెలుపు చున్నది. ఆ నశ్వర మాయావిషయముల గ్రహించి, ఆ విషయము లకు దూరుడై, నిర్విషయాసక్తుడైన శ్రీరామకృష్ణ గురువరేణ్యునికి వందనములు.

## 97. 'ష్ణా' నిర్దిత నేతి నేతీతి క్రుపాణ ఘట్టిత భిన్న సంసారాయ నమః

ఆత్మస్వరూప గ్రహణమునకు ఉపనిషత్తులు ద్వివిధోపాయముల బోధించినవి. అహంకార మమకార సంయుతుడుగదా జీవుడు। ఈ రెండును ఆత్మకాదు 'నేతి నేత్యాత్మా' (బృ హ. ౪.౩.౬) అని ఉపనిషత్ప్రబోధము. న + ఇతి = నేతి నేతి నేతియనగా 'ఇది కాదు ఇది కాదు' అని అర్థము. ఏది కాదు? అహంకారముగాని, మమకారముగాని, ఆత్మ కాదని స్పష్టము. అహంకారయుతుడైన సంసారి జీవుడనియు, నా జీవుడు మమకారముచే బంధితుడనియు బ్రత్యక్షముగ గోచరించుచున్నది గదా। 'అహంకారమమకార త్యాగ ఏవ సన్న్యాసో వక్ష్యతే। నాశేష శాస్త్రార్థత్యాగః' అహం, మమల త్యాగమే సన్న్యాసమనియు, శాస్త్రార్థ త్యాగము కాదనియు మహాత్ములు ప్రబోధించియుండిరి.

'ష్ణాం'తర్గత నకారము 'నేతి నేతి' యని సూచించుచున్నది. అహంకారమమకారములచే నేర్పడిన సంసార బంధమును 'నేతి నేతి' అను ఖడ్గముచే దెగగోసి, నిస్సంగుడును, నిర్వికారుడును, నిరంజనుడును, నిత్యానందస్వరూపుడును అగు శ్రీరామకృష్ణ యతివరేణ్యునకు నమస్కారములు.

## 98. స్వాభావితజ్ఞానశక్తిజనితేచ్ఛాక్రియాశక్తి ద్వయయుక్తాయ నమః

జ్ఞానేచ్ఛాక్రియారూపమున శక్తి త్రివిధము. కేవల జ్ఞానశక్తికి కార్యమును నిర్వహింపజాలదు. జ్ఞానము సంపూర్ణ ఆనందస్వరూపమగుటచే నట, కర్తృ కర్మ క్రియలు, జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయములు నాబడు త్రిపుటి అగోచరము. జ్ఞానము సమాధిస్థిత్యంతర్గతము. అందుచేతనే నిత్య సమాధిసంస్థితుడైన శంకరుడు నిర్వ్యాపారుడై యుండ ఆ జ్ఞానస్వరూపుడైన శివుని జ్ఞానశక్తినుండి ఇచ్ఛారూపమగు కాళికాశక్తి జనించెను. జ్ఞానము హృదయగతము. అందువలననే కాళికాదేవి పాదము శివుని వక్షస్థలమున నుండినట్లు ద్యోతకము. సంకల్పము హృదయజన్యము. ఆ సంకల్పమే ఇచ్ఛ. ఆ ఇచ్ఛాశక్తియే క్రియారూపమై ప్రపంచమును సృజించుచున్నది.

పై విధముగ శ్రీరామకృష్ణ దేవుడు నిర్వికల్పాద్యనుభవముల నొందిన జ్ఞానశక్తిస్వరూపుడు. ఆ జ్ఞానమూర్తికి సంకల్ప వికల్పములు లేవు. అందుచే నా జ్ఞానశక్తికి, ఇచ్ఛాశక్తియైన కాళికాదేవి సహాయభూతమై, తన సంకల్పప్రభావమున పండిత ప్రకాండుల, ధనిక వర్యుల, విద్యావంతుల, ఉద్యోగస్థుల, యువకుల, గృహస్థుల, స్త్రీల, భక్తుల, జ్ఞానుల, సన్న్యాసుల శ్రీరామకృష్ణుని సన్నిధికి రప్పించెను. అంతియకాక తానే క్రియాశీలకశక్తియై పరిఢవిల్లి పండితపామరుల, పేదల, ధనికుల, వారి వారి స్థానముల నిలిపి; సుసంస్కారవంతులైన యువకులమాత్రము ఆయనకు శిష్యులుగ జేసి, తన సంకల్పమును నెరవేర్చుకొనెను. ఆయనలో నుండి, సకల బాధ్యతల నా జగజ్జననియే.

వహించి, జ్ఞానేచ్ఛాక్రియా శక్తిత్రియరూపమై, సర్వ హృదయసంచారము గావించినది. అందువలననే శ్రీరామకృష్ణ దేవుడు గురు పదవిని వాంఛింపలేదు. కీర్తి యశస్సుల నార్జింప గాంక్షింపలేదు. ధనికుల పాత్రపకమునకై ప్రాకులాడలేదు. తాను వైరాగ్య శిఖర మనధిష్ఠించి, సమాధినిష్ఠాగరిష్ఠుడై చెలువొందెను. జ్ఞానశక్తిజన్యములైన ఇచ్ఛాక్రియా శక్తిద్వయమే నిర్మాణాత్మక కార్యముల సలుపగలవుగాని కేవల ఇచ్ఛాక్రియలు ఏమియు చేయజాలవనుట యిందు సువ్యక్తము. అందువలననే శ్రీరామకృష్ణుని ఆధ్యాత్మిక తేజోపుంజము సర్వలోకవ్యాప్తమై, ఆయన దివ్య బోధనలు ఆచంద్రతారార్కములై, సర్వకాలముల, సర్వ దేశముల అనుసరణీయములై యొప్పుచున్నవి.

'ష్ణాం'తర్గత నకారము జ్ఞానశక్తిని వ్యక్తీకరించుచున్నది. తజ్జనిత అనగా జ్ఞానశక్త్యుద్భవములైన ఇచ్ఛాక్రియా శక్తిద్వయయుక్తుడైన శ్రీరామకృష్ణునకు వందనములు.

## 99. ష్ణాంతర్గత'ష'కారసూచితసర్వవిషయవిచ్ఛేదన రూపవ్యతిరేకతత్త్వ'న'కారయుక్తాయ నమః

జ్ఞానమునుండి పై దొలగించునవి విషయములు. ఆధ్యాత్మికమార్గము నుండి పతనము కలిగించునవి విషయములు. ఏకాగ్రతకు భంగము వాటిల్ల జేయునవి విషయములు. భగవంతుని పొందుటకు ప్రయత్నించు శక్తునికి, ఆటంకదాయకములు విషయములు. ఇంద్రియ నిగ్రహము నకై తపించు సాధకుని మనస్సును, లౌకికసుఖముల వెంట పరుగులు వేయించునవి విషయములు. 'ఈ ప్రపంచము లోపభూయిష్ఠ'మని

మనసా గ్రహించి, వైరాగ్య సంపాదనమునకు గృషి సలుపుచుండిన విరాగికి బాధాకరములు విషయములు. 'దుఃఖమూలమిదం జగత్' అని దుఃఖించి దుఃఖించి, శాశ్వతానందసాధనమునకై ఆవేదన నొందువానికి, అంతయు సుఖమయముగ గోచరింపజేయునవి విషయములు. ఊర్ధ్వగామి యగు మానవుని అథోగామి యొనర్చునవి విషయములు, ఇట్టి యీ విషయసమూహము మానవునికి జంచలత్వమును కలిగించును. ఇట్టి సర్వానర్థదాయకవిషయముల 'ష్ట' కారమున గల 'ష'కారము సూచించుచున్నది.

'ఈ ప్రపంచము నిత్యముకాదు. ఇందలి సుఖముల సత్యములు. ఇందు శాంతి లేదు. ఇది బంధమును కలిగించునదీ కాని మోక్షమును కలిగింపలేదు' అను వ్యతిరేకత్వమును తెలియజేయునది 'న,కారము.

'ష్ణా' అను అక్షరమునగల 'ష'కారము సర్వవిషయములను, 'న'కారము విచ్ఛేదకత్వమును బోధించుచున్నవి. సర్వబంధముల విచ్ఛేదనమొనర్చుకొనినవాడే యితరుల బంధముల ఛేదింపగలడు. క్రోధ విజేతయే ప్రశాంతుడై, క్రోధమును నశింప జేయగలడు. వైరాగ్యశీలుడే విరాగమునుగూర్చి ప్రబోధ చేయగలడు. సత్సంస్కారవంతుడే దుష్టసంస్కారముల రూపుమాపగలడు. సర్వసాధన- సకల మత, సమస్త ఉపాసనావిధుల, విజయము సాధించిన శ్రీరామకృష్ణుడు సర్వవిజేత యననగును. అట్టి దివ్య పురుషుడగు శ్రీరామకృష్ణ సద్గురు పుంగవునకు నమోవాకములు.

## 100. యతిగణసంసేవ్యమానానంతకల్యాణగుణ సంసేవితాయ నమః

దాన, ధర్మముల జేయుచు, దయాదాక్షిణ్యాది మానవతా లక్షణముల కలిగి, కొలదిగ ఉపకారగుణము కలిగినవానిని లోకము

'మంచివాడు' అని పలుకును. ఆ సల్లక్షణములతోబాటు సత్యనియతి, మితభాషణ, త్రికరణ శుద్ధి, భగవద్భక్తి, భగవదనుభూతి కలిగినవానిని మహాత్ముడనును. ఏదియో ఒక సాధనజేసి తత్సిద్ధిని పొందినంతనే గురువగును. అనేక సాధనల గావించి, ఆయా సిద్ధుల నొందినవాడు జగద్గురువగును. ఒక ఆదర్శమును పొందినవాడు ఆదర్శవ్యక్తి. సర్వాదర్శముల నాచరించిన వ్యక్తి లోకాదర్శవ్యక్తి. అందరికి వలసిన అనంతకల్యాణగుణముల పొందుట అందరికి సాధ్యము కాదు, కొందరికే సాధ్యము. ఆ కొందరిలో, నదియు భగవదవతారమూర్తులకే సాధ్యమగునని దోచును.

సర్వమత సాధనల గావించి, సకల ఉపాసనా రహస్యముల కనుగొని, సమస్త దేవతల సందర్శించి, సర్వానుభవములపొంది, 'సర్వసాధనసంయుక్తం సర్వ ధర్మసమన్వయమ్। సకలానుభవసంపన్నం రామకృష్ణం నమామ్యహమ్॥' అనురీతి సకలలోకవంద్యుడైన శ్రీరామకృష్ణ దేవుడు, జటధారివంటి వైష్ణవ సంప్రదాయ సన్న్యాసులకు; శైవ మతస్థులకు; శాక్తేయులకు; వైష్ణవచరణుడు, కేనారాంభట్టాచార్యవంటి భక్తవరేణ్యులకు; భైరవీ బ్రాహ్మణివంటి తంత్రసాధకులకు; తోతాపురి వంటి జ్ఞానిపుంగవులకు; గోవిందరాయ్‌వంటి మహమ్మదీయులకు, క్రైస్తవులకును ఆదర్శమూర్తియై, వారందరిచే సేవింపబడుటయు సుస్పష్టము. అట్టిది చరిత్రలో గానరాదు. అది అద్భుతము। ఇంకను మనకు దెలియనివారెంతమంది ఆయనను నాడు పూజించి, సేవించి, ఏ ఏ అనుభవముల ఆయననుండి గ్రహించి ఆనందించిరో మనకు దెలియదుగదా। ఇదియే శ్రీరామకృష్ణ దేవుని ప్రత్యేకత। ఇదియే శ్రీరామకృష్ణ గురువ

తేజ్యాని ప్రత్యేక ఆకర్షణ! అట్టి అనంత కల్యాణగుణములచే సేవింపబడిన శ్రీరామకృష్ణునికి వందనములు.

# 101. యమనియమాసనాద్యష్టాంగయోగాధిష్ఠాన పురుషోత్తమాయ నమః

భక్తి సంస్థితులు, జ్ఞానానుభూతులు సాధనవినా అలభ్యము. దీనికి త్రికరణ శుద్ధి అత్యవసరము. త్రికరణశుద్ధిచే సిద్ధి తథ్యము. అసలు సాధన అన నేమియో, అది ఎవరికి అవసరమో అది ఎటునుండి ప్రారంభమో, దేనితర్వాత ఏ సాధన చేయవలయునో తెలియక సిద్ధులు కలిగినవనియు, సమాధులు లభించినవనియు జెప్పుకొనుచుండుట లోకమున గాననగును. ప్రాపంచిక జీవితమున నెట్టి మార్పులును లేక, కొన్ని శక్తుల కలిగినట్లు నటించి, ప్రాపంచిక కీర్తికై ప్రాకులాడుచు, దైవదర్శనమునకు దూరులైనవారలనేకులు. దీనికి కారణము గురు శిక్షణ లేకుండుటయే. పునాది దృఢముగా లేకుండుటయే! మెల్లమెల్లగ పునాదిని నిర్మించుకొనుచు సాధన చేయువాడు, శాంతిని పొంది శాంతి ప్రదాత కాగలడు. పునాదిరహిత సాధన చేసి, శాంతిని పొందినట్లు నటించి, ఆశాసూయాదులు వీడకుండుటచే తాను అశాంతిపాలై, యితరులకు శాంతిని కలిగించనగదా!

ఈ మానవ మనస్తత్త్వమును, ప్రాచీన విషయములను గ్రహించిన శ్రీ పతంజలిమునిచంద్రుడు, తన యోగసూత్ర గ్రంథమున అష్టాంగ యోగమును ప్రతిపాదించెను. 'యమ నియమాసనప్రాణాయామప్రత్యాహారధ్యానధారణసమాధయః' అని అష్టాంగముల సూచించి, సాధకుడు యమనియమాదుల కట్టుదిట్టములతో సాధన ప్రారంభించిన.

సమాధిస్థితుల నొందుననియు వివరించెను. యమనియమాదుల సక్రమముగ పాటించువాడు అమృతత్త్వమును బొందును. అట్లుగాక బాహ్యమునకు ఆకర్షణీయమగు ఆసన, ప్రాణాయామముల ననుసరించిన బుద్ధి అంతర్గతమగుటకు యత్నించినను. ప్రాణాయామములచే గొన్ని శక్తులు కలిగి ఆ శక్తులు బహిర్గతమై, లౌకికుల నాకర్షించును. దానిచే సమాధ్యనుభూతులు అలభ్యము. అట్లుగాక ఆ శక్తుల నంతర్గతము చేసిన అమృతానందమగు బ్రహ్మానందమును చవిజూచును. ఇదియే వ్యత్యాసము.

కాన ప్రథమమునుండి సాధకునికి నియమము అత్యవసరము. నియమమునుండి నియామాతీతస్థితి. సగుణమునుండి నిర్గుణము, సాకారమునుండి నిరాకారము. సావయవము నుండి నిరవయవము, ద్వైతమునుండి అద్వైతము. ఈ యమనియమ సమ్మేళనము శ్రీరామకృష్ణ భగవానుని జీవితమున గోచరము. అట్టి యమనియమాద్యష్టాంగయోగాధిష్ఠానము గావించి పురుషోత్తముడైన శ్రీరామకృష్ణునకు నమోవాకములు.

## 102. యశోవిరాజమానయతికులసంప్రదాయ పరిపాలకచక్రవర్తినే నమః

ఒక్కొక్క దేశమునకు ఒక్కొక్క విషయము ప్రధానమై యుండ, మన భారతదేశమునకు మాత్రము ఆధ్యాత్మికతయే ప్రధానమై యున్నది. 'ఓం నమశ్శివాయ' అను శివ పంచాక్షరితో అక్షరాభ్యాసము ప్రారంభమై, ఉపనయన సమయమున జతుర్వింశతి అక్షరముల నమరు గాయత్రి మంత్రము నుపదేశము నొంది; ఆపైన వేదాధ్యయనముచే

సకల రహస్యముల గురు సన్నిధిని గ్రహించి; ఏ కార్యముల నొనర్చి
నను 'సర్వం బ్రహ్మార్పణమస్తు' అని పూర్తి చేయు. నీ భారతీయ
జీవిత విధానము మానవుని సర్వవిధముల నభివృద్ధి నొందించుచున్నది.
త్యాగస్వరూపుడును, నిత్య సమాధిసంస్థితుడునైన శివుని ఆదర్శముగ
నుంచుము, పంచ భూత, పంచ కర్మేంద్రియ, పంచ జ్ఞానేంద్రియ,
పంచ ప్రాణ, పంచ కోశ, పంచ శబ్దాది విషయములతోనుండు మాన
వునకు తారకోపాయమును అక్షరాభ్యాసకాలముననే శివపంచాక్షరి
బోధించుచున్నది. ఆ శివపంచాక్షరీ రహస్యమును, మిగిలిన భూతాది
విషయముల గ్రహించుటకు, ఇంద్రియ నిగ్రహమునకు జ్ఞానము చాలనము
గదా! అంత మాత్ర దేవతారాధనముచే నింద్రియ నిగ్రహము శీఘ్ర
ముగ లభ్యముగాన శక్తియగు గాయత్రీ మంత్రోపదేశముచే జ్ఞాననేత్ర
మును తెరచి, ప్రపంచ విషయముల నామూలాగ్రముగ పరిశీలించుట
నారంభించును. అంత ఆ గాయత్రీ ఉపాసనమున బుద్ధి వికసింప,
గురుసన్నిధానమున నేకాగ్రతచే బహు శాస్త్రముల నభ్యసించి, విశేష
జ్ఞానము సాధించుట గోచరమగును. మరల ప్రథమమున అక్షరా
భ్యాసకాలమున జేసిన శివుని త్యాగము జ్ఞప్తికి వచ్చి 'త్యాగేనైకే అమృ
తత్వమానశుః' త్యాగముచేతనే అమృతత్వసిద్ధి యని గ్రహించి,
బ్రహ్మత్వమును పొంది, 'సర్వం బ్రహ్మార్పణమస్తు' అని సర్వ
కర్తృత్వభోక్తృత్వముల విడనాడి మానవుడు ఆనందసంపదల మునిగి
యుండును. ఏ జీవితమునకైనను గమ్యము బ్రహ్మస్వరూపమే యని
భారతీయ విద్యావిధానము బోధించుచున్నది. త్యాగశిఖామణులకాలవాలమై,
విరాగవతంసులకు నిలయమై జ్ఞానిపుంగవులకు ఆయతనమైనది భారత
దేశము. బ్రహ్మజ్ఞాన సంపన్నులై, పరివ్రాజకులై, తపోధనులైన
యతిసార్వభౌములచే ధర్మపరిపాలన చేయబడిన ధర్మభూమి భారతదేశము.

రాజాధిరాజులను శాసింపగల విద్య బ్రహ్మవిద్య! పండితప్రకాండుల వాదోపవాదముల గాంచి, 'నైషా తర్కేణమతిరాపనేయా' (కఠ. 2.9) అది తర్కముచే లభ్యముకాదని బోధించునది బ్రహ్మవిద్య! వేదాంతమును చిలుకపలుకులవలె బలుకుటకాక అనుభవ వేదాంతముగ పరిణమింప చేయవలయునని తెలుపునది బ్రహ్మవిద్య!

అట్టివారలే కపిల ఋషివర్యుడు, కణాద మునిచంద్రుడు, పతంజలి యోగివర్యుడు, గౌతమ మహర్షి పుంగవుడు, జైమిని మునిపరేణ్యుడు, వ్యాస భగవానుడు, ఆదిశంకరులు, మొదలైనవారు. అట్టివారు ప్రబోధించిన యత్యాశ్రమసంప్రదాయ పరిపాలకమూర్తియు, యతివరేణ్యుడును, అవతారశ్రేష్ఠుడును అయిన శ్రీరామకృష్ణ పరమహంస దేవునకు వందనములు.

## 103. యమునాతీరవిహారికృష్ణపదపంకజజన్య సుధాపరిపానభరితోన్మాదచిత్తాయ నమః

మధురలో కారాగారమున దేవకీవసుదేవులకు బుట్టొందిన శ్రీకృష్ణ పరమాత్మ, వ్రేపల్లెలో యశోదానందుల గృహమున బెరిగి, తన దివ్య బాల్యలీలలు వారికి జూపి, పుత్రునివలె వారి నానందపరవశుల గావించెను. తన ఆటపాటలతో గోపాలకుల స్నేహితుడై వారికి స్నేహ మధురిమను జవిజూపెను. గోపాలుడై గోవుల నలరించెను. తన సుందరసుకుమార బాల్యచేష్టల వ్రజవనితల హృదయముల కానంద మును చేకూర్చెను. తన వేణుగానముచే ననురాగహృదయులపై, రాగము వర్షించెను. కాని ఆ యమునాతీరవిహారియైన కృష్ణచంద్రుడు, ఈ [illegible]

బరాకాష్ఠయైన ఒక్క రాధాదేవికిమాత్రమే తన యథార్థ అగాధాధ్యాత్మిక జ్ఞాన పరిపూర్ణతను గోచరింపజేసెను. 'భక్తివశః పురుషః' అనురీతి భగవంతుడు భక్తికి వశ్యుడుగదా।

పై విధమున శ్రీరామకృష్ణ దేవుడు కమార్పుకూరు నాబడు చిన్న కుగ్రామమున జన్మించి, తన బాల్యలీలలచే జననీజనకులగు చంద్రామణీ క్షుదీరాములనేగాక ఆ గ్రామవాసులందరిని ఆనందపరచెను. తన సున్నిత హృదయముచే స్త్రీలందరిచే ప్రేమింపబడెను. తన కమనీయ గానమాధుర్యముచే నెల్లర హృదయములపై నమృతమును వెదజల్లెను. తన తన్మయావస్థలచే భక్తుల హృదయములకు భక్తి పారవశ్యమును కలిగించెను. ఆపై గలకత్తాకరుదెంచి, గంగాతీరవాసియై, తన దివ్యాధ్యాత్మికానుభవ సంపదను యథార్థ పవిత్రమూర్తులైన వివేకానందాది యువక బృందమునకుమాత్రమే ప్రకటింపగలిగిన శ్రీరామకృష్ణ దేవునకు శీఘ్రముగ శ్రీకృష్ణ సందర్శనము లభించుటలో నాశ్చర్యములేదు. ఆ కృష్ణకిశోరుడు శ్రీరామకృష్ణుని ఉపాసనాశక్తికి వశుడై, బాలకృష్ణుడై, శిఖిపింఛధరుడై నృత్యము సలుపును. అట్లు యమునాతీరవిహారి కృష్ణ పదసరోజజనితసుధారసాస్వాదనము జేసి, భక్త్యున్మత్తచిత్తుడై, దివ్యభావపరవశుడైన శ్రీరామకృష్ణ దేవునకు ప్రణామములు.

## 104. యత్నప్రయత్నసంజనితనానాసిద్ధి సంయుతాయ నమః

'కృషితో నాస్తి దుర్భిక్షం' అనిగదా సూక్తి. ఈ అనిత్య లోకమున పలువిధముల యత్నించి. అనిత్యగ్రహణమొనర్చి. అనిత్య

సంపాదనము సలిపి, మానవాళి ఎంతయో సంతసించుచు. ఆ సంత సము ... దృ క్షణికమేగదా! కాని అనిత్య విషయపరిత్యాగ మొనరించి, శాశ్వతవిభూతికై బరితపించి, తపించి, యీ లౌకిక మార్గమునుండి ఆధ్యాత్మిక జీవితమున బ్రవేశించి, విశ్వప్రయత్నముచే సద్గురువును జేరి, ప్రయత్నపూర్వకముగ తీవ్రసాధనల గావించి, అయ్యనుభవసంపద మునిగి, శాశ్వతానందమును బొందినవారి స్థితి వర్ణనాతీతము. ఆ దివ్యా నంద జ్ఞానసంపద తరగనిది, అమూల్యమైనది. దీనికై జీవితము చాలదు.

పూర్వజన్మ సుకృతముచే ఒక్క జీవితకాలమున నొక్క దైవము నుపాసన సల్పి, ఆ మూర్తిని సాక్షాత్కరింపజేసికొని సిద్ధిని బొందు టయే దుర్లభముగదా! ఇక 'అవలంబించిరొకొక్క మార్గము గమ్య స్థానమున్ జేర యోగివరేణ్యుల్ గురులైన, కాని పటుశక్తిన్నీవలెన్ సర్వమార్గవితానాంతములంది సర్వమత సౌభ్రాత్రసందేశసారవిశేషం బుల దెల్పగల్గిరె! సుధీరా! రామకృష్ణ ప్రభూ!' (శ్రీరామకృష్ణాంజలి. 76) అని శ్రీ అనుభవానందస్వాములవారు వ్రాసినచందము సర్వ సాధనల గావించి; సర్వదేవతా సాక్షాత్కారమునొంది; సర్వ మత గవేషణ మొనర్చి; సర్వసిద్ధాంత రహస్యముల గ్రహించి; సర్వ సిద్ధుల గరతలా మలకము జేసికొని; సర్వ ప్రపంచమునకు సర్వమత సందేశముల బ్రసా దించిన సర్వలోకవంద్యుడు శ్రీరామకృష్ణ పరమహంసవరేణ్యుడు. అట్టి మహనీయుడు వేరొకడులేడు. కాళికానుగ్రహప్రాప్తినొందిన ఆ శ్రీరామ కృష్ణ దేవునికే ఆ సర్వసమత్వ సిద్ధి సాధ్యమేమో! అట్లు ప్రయత్న పూర్వక సాధనాజన్య సిద్ధులనొందిన శ్రీరామకృష్ణునకు నమస్కారములు.

# 105. యమనలక్షణలక్ష్యసంయమిలోకాదర్శ గురుశేఖరాయ నమః

'యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః। స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే॥' (భగవద్గీత. 3.21) ఉత్తముడు దేని నాచరించునో ప్రజానీకమును అట్లే యుండును. ఆ శ్రేష్ఠుడు దేనిని ప్రమాణముగ గొనునో దానినే లోకము ఆదర్శముగ స్వీకరించునని అర్థము. ఆచరించువాడు శ్రేష్ఠుడు అతడు సర్వాదర్శముల నాచరించును. అంతియకాక అసాధారణ కార్యములగూడ నతడొనర్చును ప్రజానీకము అతడి యాదర్శముల గ్రహించును. కాని ఆచరింపలేదు. కారణము ఆచరణమందరికిని సాధ్యము కాకుండుటయే. అందువలన ఆచరణశీలుడే ఉత్తముడని యిందలి అభిప్రాయము. ఆచరణమున లేని ఆదర్శము ఆదర్శమేకాదు. ఆదర్శములు ప్రతివ్యక్తికి ఉండును. అప్పుడు వారును మహాత్ములే అగుదురుగదా। కాని ఆచరణవిహీనుడు శ్రేష్ఠుడు కాదనియు, ఆచరించువాడుమాత్రమే శ్రేష్ఠుడను అర్థమిందు సుస్పష్టము.

అందుచేతనే ఒకే ఒక్క వాక్యమున 'శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం' అను పదద్వయము నుపయోగించి సందేహనివారణమును గావించినది శ్రుతిమాత. 'శ్రోత్రియం' శాస్త్రజ్ఞుని అను ఒక్క పదమునే ఉపయోగించిన, లోకమునగల సకల శాస్త్రవేత్తలు యిందు అంతర్గతమే. కాని కేవల శాస్త్రజ్ఞానము మానవునికి ప్రశాంతి నీయజాలదు. పాకశాస్త్ర గ్రంథమును చక్కగ పఠించి, ఏ పుటయందేవిషయము గలదో బోధించుచుండిన క్షుద్బాధ నివారణము కాదుగదా। పదార్థముల దెచ్చి, పచనము జేసి, భుజించిననే తృప్తి. 'అనుభూతివినామూఢో వృథా బ్రహ్మణి

మోదతే। ప్రతిబింబితశాఖాగ్రఫలాస్వాదనమోదవత్॥' (మహోపనిషత్తు)
జలమున ప్రతిబింబితమగు శాఖాగ్రఫలమును భుజించి, ఆనందించి నట్లుగ అనుభూతిరహితు మూఢుడును బ్రహ్మానందరసాస్వాదనమొనరించి నట్లు ఆనందించుచు. తృప్తిని పొందుచున్నట్లు భావించుచున్నాడు. అందు చేత కేవల శాస్త్రపాండిత్యముచే లోకమును స్వాధీనము గావించు కొనవచ్చును గాని భగవంతుడు స్వాధీనుడు కాడు. ఇది ముమ్మాటికి సత్యము.

ఆ శాస్త్రమునందలి విషయముల నాచరించువాడుగదా మహాత్ముడు! శాస్త్రమనిత్యవిషయములుగాక నిత్య సత్యస్వరూపుడును, అజుడును, నిర్మలుడును అయిన బ్రహ్మవిషయమును ప్రతిపాదించును. ఆ బ్రహ్మవిషయమును గ్రహించినవాడు బ్రహ్మజ్ఞుడు। ఆ బ్రహ్మమందు సదా వసించువాడు బ్రహ్మనిష్ఠుడు। అట్టివాడే లోకాదర్శకుడు.

పై విధమున శ్రోత్రియత్వ బ్రహ్మనిష్ఠత్వములు గలవాడే గురువన్యనిగ శాస్త్ర నిర్ణయము. ఇంద్రియ నిగ్రహము గలిగి నిశ్చలముగ వర్తించువాడు గురువు। తపోసంపన్నుడే గురువు। అజ్ఞానాంధకారమును దూరీకృతము గావించువాడు గురువు। త్రికరణశుద్ధిగ శిష్యుల అభివృద్ధి నాకాంక్షించువాడు గురువు। మాతృవాత్సల్యముప్పొంగ, శిష్యుల నిర్మలముగ ప్రేమించువాడు గురువు। బోధించి, శాసించి, సాధనల జేయించి, సిద్ధిని కలిగించువాడు గురువు। శిష్యుల సాధనాటంకముల గ్రహించి, సంకల్ప మాత్రమున పారద్రోలు శక్తిసంపన్నుడు గురువు। ఈర్ష్యా మాయాదులు లేకుండుటచే శిష్యుల అభివృద్ధికై సదా యత్నించువాడు గురువు। వేధించి బాధించువాడుగాక బోధించి ఆచరింపజేయువాడు

గురువు! వేయేల సర్వరక్షకుడు గురువనుట ఉత్తమమేమో! అట్టి గురు వర్యుడు లభించుట పూర్వజన్మసుకృతము. అట్టి గురువులకు శిష్య కాంక్ష, ధన కాంక్ష, కీర్తి కాంక్షలుండవు త్యాగధన సుశోభితులైన వారికి సాటి ఎవరు?

అట్టి ఆధ్యాత్మికానుభవసంపద్విభూషితులకే ఉపదేశార్హత! అట్టి బ్రహ్మచర్య నిష్ఠాగరిష్ఠులకే ఉపదేశార్హత! అందువలన గురు శిష్యుల, యోగ్యతలనుగూర్చి అనేక ఉపనిషత్తులు ఉద్బోధించినవి. అనుభవ సంపద్విభూషితుడు గురువుగ, సకల యోగ్యతలుగల వ్యక్తి శిష్యునిగ నుండిననేగదా గొప్పదనము!

పై విధమున గురువులకు అలంకారప్రాయుడు శ్రీరామకృష్ణుడు. అట్టి జగద్గురువు లభించుటయే శ్రీ వివేకానందాదులు చేసిన పుణ్యమేమో! ఆ మహాత్ముని అనుసరించుటయే మన అదృష్టము. యథార్థ గురు, శిష్య సంబంధము ఎంత ఆనందదాయకమో! వారు నిత్యస్మరణమూర్తులు. అట్లు సర్వలక్షణోపేతుడై, లోకాదర్శుడై, జగద్గురువైన రామకృష్ణునకు నమస్సులు.

# 106. యంత్రసమానలోకనియంతృ కార్యపరిజ్ఞాన సంయుతాయ నమః

'ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి। భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా॥' (గీత. 18.61) అను గీతా వాక్యమురీతి యీ లోకము యంత్రసమానము. సర్వభూత హృదయస్థుడగు

ఈశ్వరుడు 'ఏష సర్వేశ్వరః ఏష సర్వజ్ఞః ఏషోఽంతర్యామిః ఏష యోనిః సర్వస్య ప్రభవాప్యయౌ హి భూతానాం' (మాండూక్యోపనిషత్తు. 6) సర్వేశ్వరుడు, సర్వజ్ఞుడు, సర్వభూతాంతర్యామియని గ్రహించినవానికి భక్తి జనించి, ఆ భక్తిచే బ్రహ్మానందప్రాప్తి యగుచున్నది. అట్లుగాక మాయానిర్మిత యంత్రారూఢమైన సకల భూతములు సంసార చక్రమున పరిభ్రమించుచు జన్మమరణముల నొందుచున్నవి. ప్రథమ పాదమున గల 'ఈశ్వర' గ్రహణముచే సాధకుడు 'తిష్ఠతి' నిశ్చలత్వమును సాధించును. ద్వితీయ పాదమున గల 'మాయా' గ్రహణముచే జీవుడు 'భ్రామయన్' చంచలత్వమును బొందును.

ఇట్టి మాయానిర్మిత యంత్రసమాన లోకమునుగూర్చి ఆలోచించి, ఆ రహస్యముల గ్రహింపవలయును. 'లోకస్య కా గతిః?' (ఛాందోగ్యము. 1.8.7) లోకమునకు గతి ఏది? అనియు; 'భగవన్ కుతో హ వా ఇమాః ప్రజాః ప్రజాయంతే?' (ప్రశ్న. 1 3) భగవంతుడా! ఈ జీవులు దేనివలన జనించుచున్నవి? అనియు, 'యతో వా ఇమాని భూతాని జాయంతే। యేన జాతాని జీవంతి। యం ప్రయంత్యభిసంవిశంతి?' (తైత్తిరీయము. 3.1) ఈ భూతజాలము దేనివలన బుట్టొందుచున్నది? దేనిచే జీవించుచున్నది? దేనిని మరల పొందుచున్నది? అను ప్రశ్నా పరంపరల మనస్సున నిడికొని; అంతర్ముఖులై; సాధనల గావించి; సమాధానముల శాస్త్రజ్ఞానమునగాక అనుభవమున గ్రహించి; మాయామయ ప్రపంచమున, మాయావశులై బాధల మ్రగ్గు సర్వ జీవకోటి దిలకించి; కరుణాసముద్రులై ఈశ్వర సందర్శనముచే నీ 'మాయ' మాయమగునను దివ్య సందేశమును మానవాళికొసంగి; భారతీయాధ్యాత్మికానందానుభూతిచే బరవసులైన ఋషివరేణ్యులకు మనము కృతజ్ఞ

తాంజలుల సమర్పింపవలయును. ఇట్టి యంత్రసమాన లోకగ్రహణమునేగాక; ఆ యంత్రచాలకుని గ్రహణమును కూడ వారు చేయగలిగిరి. దానిచే వారు పునర్జన్మ రాహిత్యమును పొందగలిగిరి. ఇట్టి యంత్ర సమాన లోకజ్ఞానము, దాని నియమించు కార్యపరిజ్ఞానము వేదాంతానుభవజ్ఞులకే సాధ్యము. లోకపరిజ్ఞానము, లోకస్థుల హృదయ పరిజ్ఞానము చేయగల దివ్యజ్ఞానము ఆ అనుభవమూర్తులదే! అది మహల గురుపుంగవుల హస్తగతము. అట్టి పరిజ్ఞానయుతుడై, లోకమునుగాక, సాధకులను శాసింపగలిగిన శ్రీరామకృష్ణ దేవునకు నమోవాకములు.

## 107. యదృచ్ఛాలాభసంతుష్ట సూత్రనియమ పరిపాలకోత్తమాయ నమః

మానవునికి నియమావళి చాల ముఖ్యము. ఇక సాధకునికి నియమములేకుండిన అభివృద్ధి కలుగుట చాల కష్టము. ఆ నియమములు కూడ సాధారణ మానవులకొక విధము, సాధకునకు మరియొక విధము, తీవ్ర వైరాగ్యోపేతునకు వేరొకవిధముగనుండును. అందుచేతనే ఉత్తమ సాధకులకు కొన్ని సూత్రముల, తన యోగ సూత్రగ్రంథమున పతంజలియోగివర్యుడు తెలిపియున్నాడు. యమనియమాద్యష్టాంగ యోగములు తెలిపి, అందు ప్రథమ స్థానము నలంకరించిన యమమును 'అహింసాసత్యాస్తేయబ్రహ్మచర్యాపరిగ్రహము'లని పంచ విధములుగ విభజించెను. తన ఆధ్యాత్మిక జీవితమునకాటంకదాయకములుకాని, అత్యవసరముల స్వీకరించుట సాధకునకు ముఖ్యము. ఈ అపరిగ్రహమును పరిపాలించిన సాధకుడు పతనమొందుటకవకాశము లేదు. 'చిక్కినదెతింటి మంచిదేన్చెడ్డదేని మంచిచెడ్డల మదిలోన నెంచబోకు' అని శ్రీ వివేకానంద స్వామి తన 'యతిగీతము'న వ్రాసియున్నాడుగదా!

శ్రీరామకృష్ణ దేవుని సాధకస్థితినుండి, ఆయన సమాధి పర్యంతము, ఆయన నిత్యావసరముల దీర్చుటకు లోకైకమాతయగు కాళికా దేవియే, సర్వ భారముల వహింపగల మధురనాథుడు, బలరాంబోసు, మొదలైనవారిని శ్రీరామకృష్ణునివద్దకు బంపెను. అది అందరికి లభించుట దుర్లభము! అది ఒక్క శ్రీరామకృష్ణ దేవునికే సాధ్యము! అది ఆ దేవీ అనుంగుపుత్రునికే సాధ్యము! అవును, పసిబిడ్డ భారము తల్లి దే గదా మరి!

ఒక మార్వాడీ శ్రీరామకృష్ణుని దర్శించి, ఆయన పోషణకు పది వేల రూప్యములు నొసంగ సంకల్పించి, ఆ విషయమును శ్రీ గురుదేవునకు నివేదించెను. ఆ కామకాంచనవిజేత, సర్వ కర్తృత్వభోక్తృత్వముల నా జగన్మాతకే వదలి, నిశ్చలముగనుండి, 'అమ్మా! నేను యంత్రమును. నీవు ఆ యంత్రమును నడుపుదానవు. అంతయు నీ సంకల్పమే. నాకు వ్యక్తిత్వము లేదమ్మా' అని పలుకుచు, పసిబాలునివలె మాతృమూర్తిపై నాధారపడు నా దివ్యమూర్తి, ఆ ధనమును నిరాకరించి, వైరాగ్యశిఖరము నధిష్ఠించి, సర్వలోకవంద్యుడగుటలో నాశ్చర్యము లేదు. అట్టి త్యాగసంపన్నుడు కావుననే సర్వాదర్శమూర్తి కాగలిగెను. 'యదృచ్ఛాలాభసంతుష్టః' అను సూత్రమును మనోవాక్కాయముల బాటించుట ఆ పరమహంసవరేణ్యునికే సాధ్యము! అట్టి నియమ పరిపాలకుడైన శ్రీరామకృష్ణ దేవునకు వందనములు.

## 108. యజ్ఞాధిష్ఠానదేవతానికరసంపూజితపదాయ భవానందపరబ్రహ్మణే నమః

'కర్మణా చిత్తశుద్ధిః, చిత్తశుద్ధ్యా జ్ఞానం, జ్ఞానేన మోక్షః' కర్మాచరణమున జిత్తశుద్ధియు, జిత్తశుద్ధివలన జ్ఞానమును, జ్ఞానముచే

మోక్షప్రాప్తి యనియు శాస్త్రముగదా! ప్రథమమున సగుణము అవస రమే! మహాత్ముల జీవితమున నీ త్రయము త్రివేణీ సంగమమై, సమ న్వయ విధానమును బోధించును.

'ఏకం సత్' సత్స్వరూపమొక్కటియే అనియు ఆ ఏకత్వాను భూతియే గమ్యమనియు, అదియే జ్ఞానమనియు భావించి. జ్ఞానమునార్జింప నేతెంచిన శ్రీ వివేకానందాదులకు ఆ అనుభవముల నందించి, అద్వైత శిఖరము నధిష్ఠించిన జ్ఞానమూర్తి శ్రీరామకృష్ణుడు. భగవంతుడు సాకారుడనియు, సగుణుడనియు, ఆ భగవద్దర్శనాభిలాషులై అరుదెంచిన శ్రీరామకృష్ణానందాదులకు భక్తితత్పరుడై, సర్వ సగుణ దేవతా మూర్తుల నుపాసించి, దర్శించి, ఆనందనృత్యము సలిపిన భక్త వరేణ్యుడు శ్రీరామకృష్ణ దేవుడు. నిత్య స్నానసంధ్యాదికముల జేయుచు, ఆచారముల బాటించుచు. కర్మయోగ రహస్యముల దెలియగోరివచ్చిన అఖండానందాదులకు, అవసరమగు కర్మసిద్ధాంత మర్మములదెలిపి, వాని నాచరించు విధానమును, ఎంతవరకు వాని సలుపవలెనో బోధించిన కర్మయోగి శ్రీరామకృష్ణ దేవుడు. అందువలననే ఆయన కర్మ, భక్తి, జ్ఞాన, సమన్వయమూర్తి కాగల్గెను. అట్టి సర్వ సమన్వయమూర్తుల మానవులేగాక దేవతలుగూడ అర్చింతురు. అట్లు యజ్ఞాధిష్ఠానదేవతా సమూహముచే పూజితుడై, అనుభవనిలయుడై, అనుభవానందమూర్తియై, పరబ్రహ్మస్వరూపుడై వెలుగొందు శ్రీరామకృష్ణ దేవునకు సాష్టాంగ నమస్కారములు.

ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః

# శ్రీ రామకృష్ణాష్టకమ్



1. ఓంకార రూపాయ వినిర్మలాయ ఓంకారవేద్యాయ అమలాత్మికాయః
ఓంకార గమ్యాయ అగోచరాయ శ్రీ రామకృష్ణాయ సదానమామి॥

2. నరేంద్ర శ్రేష్ఠాయ నిరంజనాయ నవ్యావతారాయ నారాయణాయ।
నరేంద్ర గానామృత తోషితాయ శ్రీ — — —॥

3. మోక్ష స్వరూపాయ మదాంతకాయ మనుకారనాశాయ మందస్మితాయ।
ముముక్షుజన తాప నివారకాయ శ్రీ — — —॥

4. భక్తి ప్రపూర్ణాయ భవనాశకాయ భక్తి స్వరూపాయ భయాపహాయ।
భోగాది విముఖాయ భువనేశ్వరాయ శ్రీ — — —॥

5. గయాధివాసాయ గదాధరాయ గంభీరవదనాయ గంగాధరాయ।
గర్వాపహారాయ గురుపుంగవాయ శ్రీ — — —॥

6. బృందాయ వంద్యాయ విశ్వాత్మకాయ వివేకయతివర్య సుపూజితాయ।
విజ్ఞానరూపాయ విమోచకాయ శ్రీ — — —॥

7. తేజోనిధానాయ తపోధనాయ త్యాగావతారాయ తత్త్వప్రదాయ।
తమోవినాశాయ త్రిగుణాత్మికాయ శ్రీ — — —॥

8. రాకేందు వదనాయ రామార్చకాయ రాధాస్వరూపాయ
రాగాది శూన్యాయ రమాధవాయ శ్రీ — — —॥

9. మధుర స్వరూపాయ మదనాంతకాయ మాయావిదూరయ
మానవ మనస్తత్వ సువేదితాయ శ్రీ — — —॥

10. కృష్ణ స్వరూపాయ కుటిలాంతకాయ కృపాసముద్రాయ
కులదీపకాయ।
కాళీ స్వరూపాయ కఠినాత్మకాయ శ్రీ — — —॥

11. షాంతర్గత షకార నకారకాయ షడ్దేవతా, షట్చక్ర విశారదాయ।
షడ్వర్గ షడ్భావ వినాశకాయ శ్రీ — — —॥

12. యమాది అష్టాంగ సుశోభితాయ యజ్ఞాదిరహితాయ
యతిప్రియాయ।
యతివర్య తోతాపురి సేవితాయ శ్రీ — — —॥

★ యః పఠేదేతత్ స్తోత్రం త్యాగీశానంద విరచితం।
త్యాగమూర్తిం రామకృష్ణం పరమహంసం స విందతే॥



# శారదాష్టకమ్

శ్లో॥ రామకృష్ణగురుధ్యానతత్పరాం శాంతిదాయినీమ్।
కామకాంచనదూరాం తాం శారదాం ప్రణమామ్యహమ్॥

౨. రామకృష్ణం హృది ధ్యాత్వా మాతేతి గురుదేవతా।
పూజితాం తాం త్రిరూపేణ శారదాం ప్రణమామ్యహమ్॥

౩. పూజితాం రామకృష్ణేన సర్వలోకైర్నమస్కృతామ్।
వందితాం భక్తబృందైశ్చ శారదాం ప్రణమామ్యహమ్॥

౪. ముఖర్జీవంశసంజాతాం ప్రసన్నగుణశోభితామ్।
నిత్యానందమయీం దేవీం శారదాం ప్రణమామ్యహమ్॥

౫. జయరామవటీవాసాం సర్వేషాం చ ప్రియంకరీమ్।
క్షమాది గుణసంపన్నాం శారదాం ప్రణమామ్యహమ్॥

౬. సర్వమంగళసంపన్నాం సర్వానందప్రదాయినీమ్।
ప్రసన్నవదనాం దేవీం శారదాం ప్రణమామ్యహమ్॥

౭. సమాధినిష్ఠాగరిష్ఠాం చ దివ్యానందనివాసినీం।
స్వస్వరూపస్థితాం దేవీం శారదాం ప్రణమామ్యహమ్॥

౮. సర్వదేవీస్వరూపాం తాం సర్వవిద్యాస్వరూపిణీమ్।
సకలానుభవసంపన్నాం శారదాం ప్రణమామ్యహమ్॥

౯. అలౌకికప్రేమదాం దేవీం అవ్యయానందరూపిణీమ్।
అజన్మబ్రహ్మనిష్ఠాం తాం శారదాం ప్రణమామ్యహమ్॥

10. త్రిగుణాతీతాం త్రికాలజ్ఞాం త్రిజగత్కల్యాణదాయినీమ్।
తాపత్రయనాశినీం దేవీం శారదాం ప్రణమామ్యహమ్॥

11. సాధకానాం సిద్ధమూర్తిం చ దేవతానాం దివ్యరూపిణీమ్।
శిష్యాణాం మాతృమూర్తిం చ శారదాం ప్రణమామ్యహమ్॥

12. త్యాగస్వరూపిణీం దేవీం త్యాగయోగసమన్వయీమ్।
శోకమోహవిదూరస్థాం శారదాం ప్రణమామ్యహమ్॥



## జయంతులు

1. శ్రీ రామకృష్ణ పరమహంస : ఫాల్గుణ శుద్ధ విదియ
2. శ్రీ శారదామణీదేవి : మార్గశిర బహుళ సప్తమి
3. శ్రీ వివేకానందస్వామి : పుష్య బహుళ సప్తమి
4. శ్రీ అనుభవానంద స్వామి : ఆశ్వయుజ బహుళ పంచమి

# రామకృష్ణ మంగళాష్టకమ్

1. ఖుదీరామసుపుత్రాయ చంద్రామణిసుతాయ చ ।
శారదారాధ్యదేవాయ రామకృష్ణాయ మంగళం ॥

2. కాళికామాతృచరణాబ్జ ఆరాధనతత్పరాయ చ ।
కామక్రోధవినాశాయ రామకృష్ణాయ మంగళం ॥

3. విద్యావివేకవైరాగ్య భక్తిముక్తిప్రదాయ చ ।
విశ్వారాధ్యచరిత్రాయ రామకృష్ణాయ మంగళం ॥

4. కామక్రోధమదోన్మత్త లోకోద్ధరణాయ చ ।
కామధేనుస్వరూపాయ రామకృష్ణాయ మంగళం ॥

5. కల్మషదృష్టిసంయుక్త మానవోద్ధరణాయ చ ।
కల్పవృక్ష స్వరూపాయ రామకృష్ణాయ మంగళం ॥

6. సర్వకామ నిరాసాయ లోకశాంతిప్రదాయ చ ।
సకలానుభవరూపాయ రామకృష్ణాయ మంగళం ॥

7. సర్వదేవస్వరూపాయ సర్వమతసాధకాయ చ ।
సర్వలోకశరణ్యాయ రామకృష్ణాయ మంగళం ॥

8. మంగళం వివేకమునయే శారదామాయై చ మంగళం ।
మంగళమనుభవరూపాయ రామకృష్ణాయ మంగళం ॥

హరిః ఓం తత్ సత్



విని ఆనందించండి!                                                    గమ్యాన్ని పొందండి!!

మీ హృదయాలను స్పందింపజేసి, ఆనందరసాస్వాదనతో తన్మయత్వముగావించు స్టీరియో క్యాసెట్స్, అధునాతన రికార్డింగ్ స్టూడియోలలో, అత్యున్నత ప్రమాణాలతో, ప్రముఖ గాయనీగాయకులతో రికార్డింగ్ చేయబడి ముముక్షువులను దివ్యానందానుభూతులలో నోలలాడిస్తున్న మా ప్రీరికార్డెడ్ క్యాసెట్సు.




1. శ్రీ రామకృష్ణ గానసుధ
2. భారతీయ సంస్కృతి (2 భాగములు)
3. గీతామృతము (3 భాగములు)
4. శ్రీ రామకృష్ణ పరమహంస జీవిత కథాగానము
5. సాధనరహస్యము
6. సాధనమకరందము
7. అనుభవరహస్యము
8. శ్రీ త్యాగరాజ హృదయము

మరియు మరికొన్ని స్టీరియోక్యాసెట్స్‌కు రూపకల్పనలు జరుగుచున్నవి.

వివరములకు మాకు వ్రాయండి.